# మనువు-మానవధర్మములు





రచన:

వెంపటి లక్ష్మీనారాయణ శాస్త్రి

పంచమ ముద్రణ :
అక్టోబర్ - 1998

ప్రతులు – 1000

హక్కులు : V. L. N. శాస్త్రివి

మూల్యము : రు. 28-00

ప్రాప్తిస్థానము :
V. L. N. శాస్త్రి
శ్రీ లలితా విద్యామందిరము,
కేదారేశ్వర పేట, విజయవాడ-520 003

ముద్రణ :
తిరుమల ఆర్ట్ ప్రింటర్స్
మ్యూజియంరోడ్, గవర్నరుపేట,
విజయవాడ-520 002

# నా జీవన స్రవంతి

మన జీవితంలో జరిగే ప్రతి సంఘటనా భగవంతుని సంకల్పము ననుసరించే జరుగుతుందనే రహస్యం ప్రతివారి జీవితంలో ఏదో ఒక సమయాన అనుభవానికి రాక తప్పదు. అలాగే నా జీవితంలో గూడ చిన్న పెద్ద సంఘటనలు దైవసంకల్పాన్ని యనుసరించే జరుగుతాయనే రహస్యం అనుభవానికి వచ్చింది.

నాకు బాల్యంలోనే పితృవియోగం సంభవించింది. అందుచేత మేనమామల యింట్లో పెరుగవలసి వచ్చింది. వారందరు సంస్కృత సాహిత్యంలోనేగాక శాస్త్రాలలో నిష్ణాతులై ప్రసిద్ధికెక్కారు. వారి దగ్గర ఒకటి రెండు సాహిత్యగ్రంథాలు చదవటం దైవాయత్తంగా సంభవించింది. సామాన్యవయసులో అనగా 15, 16 సంవత్సరాల వయసులో దైవసంకల్పంగా విజయవాడ చేరటం సంభవించింది. ఇక్కడికి వచ్చినప్పుడు దేని విషయంలోను దృఢ సంకల్పంలేదు. అయినప్పటికి దైవ సంకల్పంచేత ఒక మహత్తర సంఘటన జరిగింది.

ఒకరోజున అనుకోని విధంగా ఒక దివ్య పురుషుని దర్శనం లభించింది. ఆయన శరీర శోభ ముందుగా నన్నాకర్షించింది. రాముని సౌందర్యం మనకు తెలియదు. గాని "పుంసా మోహన రూపాయ" అని పెద్దలు అంటే వింటాం. అయితే రాముడు మాత్రం ఈ దివ్య పురుషుని కంటె అందంగా వుంటాడా అనిపిస్తుంది. ఆయనకుగల కంఠ మాధుర్యం శరీరంకంటె మించిన ఆకర్షణ శక్తిగలది. ఆయనకుగల పాండిత్యం పాఠబోధన అనితరసాధ్యం. అయితే అవియన్ని ఆయన దగ్గరగల సద్గుణాలు. అవి ఆయనకు శోభను చేకూరుస్తాయి వాటివలన యితరులకు లాభం లేదుకదా. వీటియన్నిటికంటె మించింది యాయనకు శిష్యవాత్స

ల్యము. ఆ వాత్సల్యాన్ని దేనితో పోలుస్తాం. పోల్చటానికి సరియయిన ఉదాహరణ దొరకదు. తల్లి కూడా కుమారుని ప్రేమిస్తుంది. ఎందుకని తనకు జన్మించాడు కాబట్టి. కాకిపిల్ల కాకికి ముద్దుకదా. తండ్రి కూడా ప్రేమిస్తాడు వృద్ధాప్యంలో అక్కరకు వస్తాడని, పేరు ప్రతిష్ఠలు తెస్తాడని, తండ్రికికూడా కుమారుని విషయంలో ప్రేమతోబాటు కొంచెం స్వార్థం ఉంది భార్యకూడా ప్రేమిస్తుంది. అక్కడ స్వార్థం సగపాలు ఉంటుంది. తనను పోషిస్తాడు, ఆనందం కలిగిస్తాడు అని, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి కదా. కాబట్టి ఆ శిష్య వాత్సల్యంతో పోల్చటానికి సరియయిన ఉదాహరణ లేదు గురువు శిష్యుని విషయంలో అతి జాగ్రత్త వహించాలి, బరువు తనది. మార్జాల కిశోరన్యాయం శిష్యునికి చదువు రాకపోతే గురువుకు బాధ. తనకృషి ఫలించలేదు, తన శ్రమ వ్యర్థం అయింది. మళ్ళీ మళ్ళీ ప్రయత్నించాలి. ఎంతవరకు "శిష్యాదిచ్ఛేత్పరాజయం" అన్నంతవరకు. అలాగే ఆ దివ్యపురుషుడు వాగ్వ్యయముచేసి వ్యాకరణ శాస్త్రాన్ని ఆభాష్యాంతం బోధించారు. అయితే మా యిద్దరిమధ్య వారధివలె ఒక మహాపురుషుడు నిలిచాడు. ఆయనకు ఒకే విషయం తెలుసు. రెండవది తెలియదు. అది దానగుణం, ఆయనకు ఏ మంచి పనికైనా దానం చేయకపోతే నిద్రపట్టదు. అది ఏ మతమయినా ఫరవాలేదు. ఎవరయినా ఫరవాలేదు. దానం చేసితీరాలి. "దానం భోగో నాశ స్తిస్రో గతయో విత్తస్య" అనేదానిలో మహాపురుషులు దానానికే ప్రధానస్థానమిచ్చారు. అది గ్రహించిన మహాపురుషు డాయన. ఆయనకు గురుసేవా ఫలితంగా అపారధనం లభించింది. అయితే ఆయన రఘువంశంలో కాళిదాస మహాకవి రఘువును వర్ణించిన రీతిగా ఆయన సర్వస్వం దానంచేసారు. ఆయనపేరు శ్రీ చుండూరు వెంకట రెడ్డిగారు. ఆయన కేవలం దాతగాదు, మహాజ్ఞాని. ఆయనకుగల తత్త్వజ్ఞానం

శుష్క వేదాంతంకాదు. అనుభవైకవేద్యం. తన గురువు ఆదేశాన్ననుస రించి ప్రాచీన భారతీయవిద్యల సంరక్షణకు నడుం బిగించారు. సర్వ స్వతంత్ర స్వతంత్ర కళాశాలనుస్థాపించి ఆచార్యుల. విద్యార్థుల పోషణకు ఒక్కొడుగ నిలిచారు. ఆ కళాశాల పది సంవత్సరాలు మూడు పూలూ ఆరు కాయలుగా వెలిగింది అప్పుడు మన దివ్యపురుషుడు వ్యాకరణశాస్త్ర బోధకులుగానేగాక ప్రధానాచార్యులుగా నియమింపబడ్డారు. యథార్థానికి ఆ పాఠశాల ఆయన ప్రేరణతో స్థాపించబడిందన్నా అతిశయోక్తి లేదు. ఇంత వరకు ఆ దివ్యపురుషుని పేరు చెప్పనేలేదు. ఆయనపేరు శ్రీ తాదేపల్లి సాంబమూర్తి శాస్త్రిగారు. ఆయనకుగల శిష్యవాత్సల్యం అపారమయింది.

<u>శ్రీ శాస్త్రిగారి విద్యాభ్యాసము :</u> వీరికి వీరి పెదతండ్రియగు తాదేపల్లి వెంకటప్పయ్య శాస్త్రిగారు అక్షరాభ్యాసము చేసిరి. వారి కుమారులయిన శ్రీ రాఘవ నారాయణశాస్త్రిగారు సాహిత్య గ్రంథములను బోధించిరి. అటుపిమ్మట వీరు కొల్లూరు గ్రామమునందు శ్రీ ప్రతాప హనుమచ్ఛాస్త్రి గారి దగ్గర వ్యాకరణమునందలి సిద్ధాంతకౌముదిని చదివిరి. పిఠాపురము వెళ్ళి బాలవ్యాస శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి మరియు శ్రీ వేదుల సూర్యనారాయణశాస్త్రిగార్లవద్ద ఆభాష్యాంతము చదివిరి. అకిరిపల్లియందు శ్రీ వేమూరి రామబ్రహ్మశాస్త్రిగారి వద్ద న్యాయశాస్త్రము చదివి విజయ నగరంవెళ్ళి శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రి (రాయుడుశాస్త్రి) గారివద్ద వ్యాకర ణమునందలి అర్థిక గ్రంథములను, అలంకారశాస్త్రము చదివిరి. ఇంతటి పాండిత్యమును 22 సంవత్సరములలోపుననే సంపాదించుటయేగాక పద్మ వ్యూహము, శ్రీకృష్ణరాయబారమువంటి నాటకములను, గురూపహారము, రసమంజరిలాంటి కావ్యములను రచించి కవులమన్ననలను పొందిరి.

కళాశాల సంగతి కొంచెం చెప్పాలి. ఆ కళాశాల నలుగురు వేద శాస్త్ర పండితులతో నలుబదిమంది శాస్త్రపాఠ విద్యార్థులతో వెలుగొందింది.

ఇంతమాత్రమేగాదు. అచట జరిగిన జయంతియుత్సవాలకు కాశీనుండి, పండిత ద్రావిడ రాజేశ్వరశాస్త్రిగారు, కలకత్తానుండి దేవనాయకాచార్య మొదలగు పండితులు వచ్చేవారు. ఆంధ్రదేశంలోగల పండితులందరు వచ్చేవారు. ఆ పండితుల సంభాషణలు నన్ను మన భారతీయ సంస్కృతి లోనికి ఆకర్షించాయి.

వ్యాకరణం ఒక అద్భుత శాస్త్రం ఆ శాస్త్రం చదువుతున్నప్పుడు ఒకమంచి స్వారీ చేయగల యువకుడు మదించిన అశ్వముపై నెక్కి పరుగెత్తుచున్నట్లుఉంటుంది. ఆ పాఠం ఏకదీక్షగామూడు గంటలు జరుగు తుంది, అది తపోదీక్షనుమించినది. ఎందుకంటే తపస్సుకు ఒక ఏకాగ్రత చాలు, కాని యిచ్చట ఏకాగ్రతతోపాటు విషయగ్రహణ శక్తి కూడ కావాలి. ఏమాత్రం మనస్సు చలించినా కొన్నివందల మైళ్ళు మనం వెనుకపడిపోతాము. మళ్ళీ ఆ విషయం అందదు. ఆ విధంగా ఆ దివ్య పురుషుడు ఆ మహాశాస్త్రాన్ని సామగానంలా వినిపించి నాతోగూడ ముగ్గురు విద్యార్థులను కృతార్థులనుచేసి తనకు ఋణగ్రస్తులనుగాచేసి వెళ్ళి పోయారు. వారు నాకు మిత్రులేగాక చెరియొక వైపున చేయి పట్టుకొని, ముందుకు నడిపించారు. వారి సహకారము మరువరానిది వారు పురాణం ఆంజనేయశాస్త్రి, దావట్ల కామశాస్త్రి, ఋణం వ్రణంలాంటిది కాబట్టి దానిని తీర్చటానికి నేను ప్రయత్నించుచున్నాను. దేవతలకు త్రిదశులు అని పేరు. అందుకనే గాబోలు ఆ దివ్యపురుషుడు ముప్పది సంవత్స రాల వయసులోనే దివ్యలోకానికి వెళ్ళిపోయారు.

సుమారు 30 సంవత్సరాలు వయసుకల నా విషయంలో మరియొక సంఘటన జరిగింది. ఆంధ్రదేశంలో మరియొక మహాపురుషు డున్నాడు. ఆయనకు రాజకీయ చైతన్యంతోపాటు తండ్రిగారి కారణంగా ధార్మిక చైతన్యంగూడా లభించింది. ఆయన జాగ్రదవస్థ అంతాకూడా ధార్మిక

చింతనలోనే గడిచేసి ఊరూరా తిరిగి ధర్మవైశిష్ట్యాన్ని తెలియచెప్పటం ధార్మిక గ్రంథాలు వ్రాయటం ఆయన నిరంతర కృషి. ఆయన పేరు శ్రీ జటావల్లభుల పురుషోత్తంగారు. ఆయన సంస్కృతంలో M. A. పట్ట భద్రులైకూడ సనాతన ధర్మాపేక్షను వదలలేరు హిందూమతం వంటి సుప్రసిద్ధగ్రంథాలు పదిదాకా వ్రాశారు. ఆయన ఆలోచనాధోరణిని అనుస రించి తూర్పుగోదావరిజిల్లాలోని కాకరపర్రు గ్రామంలో ధర్మశాస్త్ర విద్యాలయం స్థాపించి ఉన్నతులయిన పండితులచేత నా వంటి సంస్కృత సాహిత్యాభిమానులకు ధర్మశాస్త్రాధ్యయనం చేయించారు. ఆ సమయం లోనే మనుధర్మశాస్త్రం నిర్ణయ సింధువువంటి ధర్మశాస్త్ర గ్రంథాలు చదవటం సంభవించింది. మనుధర్మశాస్త్రాన్ని నిత్యం పారాయణం చేయటం జీవితంలో భాగమయింది. దానికి కారణం ఆ గ్రంథంలో మహర్షి మనువు చెప్పిన ఉదారవిషయాలను రసవంతమయిన కావ్య పణి తిలో చెప్పటం. దానిని చదివిచదివి తృప్తి పొందలేక దానిని నలుగురికి అందించాలనే కుతూహలంతో మనువు.మానవ ధర్మములు అనే గ్రంథం సమకూర్చటం సంభవించింది. ఆర్థిక పుష్టిలేని నాకు ఆ గ్రంథ ముద్రణకు కొందరు వదాన్యుల సహాయం కోరవలసి వచ్చింది దానికి తిరుపతి దేవ స్థానంవారుకూడా కొంతసహాయంచేసారు. ఆ గ్రంథం విస్తృత ప్రచారం పొందడంచేత అయిదవ తడవకూడా ముద్రించటం సంభవించింది.

అదేవిధంగా నిర్ణయ సింధువునుగూడ చదివిచదివి అందలి విషయ ములను ముఖ్యమయినవిగ భావించటమే గాకుండా ఆ గ్రంథరచయితకు గల సమస్త పురాణపరిచయం నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేసింది. పండు గలు పామావ్యపండితులకుగూడ అంతుపట్టని పండుగల రహస్యాలు అందులోచోటు చేసుకున్నాయి. అందుచేత "పండుగలు-మన కర్తవ్యం" అనే గ్రంథంవ్రాయటం సంభవించింది. గ్రంథముమీద యభిమానము

చేతను నాయందలి యభిమానము చేతను ఆ గ్రంథానికి ఉదారుల సహాయము లభించి ముద్రణ జరిగింది.

రామాయణ విషయం ప్రత్యేకంగా చెప్పాలి.

చిన్నప్పటినుండి యుపాసకుడనై సుందరకాండ పారాయణచేసి సంతృప్తిపొందిన నాకు రామాయణం పారాయణం చేయాలనే కోరిక కలిగింది. దానిని పారాయణం చేసినప్పుడు రాముని యౌదార్యం దూరదర్శిత్వం ప్రశాంతత వాగ్వైభవంతోపాటు వాల్మీకి రచనా విశేషం నన్ను పూర్తిగా రామాయణదాసుని చేసింది. ఎంతగానంటే దానిని కొన్ని వేల మంది చేత చదివించి తీరాలనే దీక్షపెరిగింది అయితే ముద్రించటం సామాన్య విషయం కాదు. లక్షరూపాయలను మించుతుంది. బహిరంగ వేదికలలో జనసమ్మోహనంగా ఉపన్యాసాలు చెప్పి ఆకర్షించటం నాకు చేతగాదు పాఠములు చెప్పటయందే ఆసక్తి ఎక్కువ. అందుచేత నన్ను గురించి తెలుసుకోవటం కష్టం. పాఠము చదివినవారికి మాత్రమే నా విషయం తెలుస్తుంది. పరిచయం తక్కువ కావటంచేత రామాయణ ముద్రణ కష్టసాధ్యం. అయితే ముందుగా రామాయణంచూచి తెల్లకాగితాల మీద వ్రాయటం ప్రారంభించాను. బాల అయోధ్య, అరణ్య, కిష్కింధా కాండలు నాలుగు వ్రాశాను. దాని పుణ్య ఫలితమేమో నాలుగు కాండల ముద్రణ సాధ్యం అయింది. వాటిని యోగ్యులకు ఉచితంగా యివ్వటానికి ప్రయత్నిస్తున్నాను. ఇంకా సుందర, యుద్ధకాండలు ముద్రణ కావలసి యున్నది దానికి ఉదారుల సహాయం అవసరం.

రాబోవు తరాలవారికి భారతీయ సంస్కృతిని అందించాలనే విషయంలో ఎవరికి సందేహంలేదు. అందుకోసం బాలరామాయణం శ్లోకాలలో పోటీలు ఏర్పాటుచేసి బహుమతులు యివ్వటం జరుగుతున్నది. దానితో పాటుగ వాల్మీకి జయంతిని జరపటం ఆచారమయింది వాల్మీకి జయంతిని

ఉత్తర దేశీయులు చేస్తున్నారు. కాని ఆంధ్రదేశంలో ఎక్కువగా జరపటం లేదు కేంద్ర ప్రభుత్వం వాల్మీకి జయంతిని ఆశ్వయుజ శుద్ధ పూర్ణిమగా నిర్ణయించి ఆకాశవాణి మూలకంగా ప్రచారం చేస్తున్నా చాలమంది దానిని విస్మరించారు. అందుచేత వాల్మీకి చిత్రపటాన్ని అయిదువందల రూపాయల వ్యయంతో చిత్రింపజేసి ముద్రపరచటం జరిగింది.

మన సంస్కృతి శాశ్వతం కావటానికి ప్రధానమయినవారిలో శ్రీ శంకరాచార్యులవారు ఒకరు అయన చిన్న వయస్సులోనే భాష్యములు, స్తోత్రములు ఇతర గ్రంథములు వ్రాసి ఆసేతు శీతాచలము పర్యటించి వైదిక మతమును స్థాపించి దానిని శాశ్వతము చేయుటకై నాలుగు దిక్కులందు నాలుగు పీఠాలు స్థాపించారు. ఈ విషయములు బాలబాలికలకు తెలియటానికై శ్రీ శంకరాచార్య చరిత్ర సంగ్రహంగా వ్రాసి ముద్రించటము జరిగింది శంకర జయంతి రోజున ఆ గ్రంథమును యింటింటికి అందచేయటం బాలబాలికలకు పోటీలు ఏర్పాటు చేయటం జరుగుతున్నది. శంకరాచార్యులవారి సిద్ధాంతానికి అనుకూలమయిన రీతిలో వేదాంతవ్యాస రత్నావళిని ముద్రించి ప్రచారం చేయటం జరుగుతున్నది. దానిని పెద్దలు మెచ్చుకొని తమ అభిప్రాయాలు తెలియచేసారు. అవసరమయిన వారికి తమ యింటిదగ్గర, ఆసక్తిగలవారల యింటిదగ్గర సంస్కృత పాఠములు చెప్పుట సర్వసాధారణమయింది. నేను వ్రాసిన వ్యాసములను సప్తగిరి, ఆరాధన, ఆర్షధర్మ, విశ్వహిందుసంపాదకులు ప్రచురించారు. ప్రస్తుతం రామాయణప్రచారమే ప్రధానంగా పెట్టుకొని మారురూపాయల మూల్యముగల రామాయణమును స్వల్పమూల్యమునకు శ్రావణమాసము నందలి సంస్కృత జయంతి సందర్భముగా వినియోగించటానికి నిశ్చయించి ప్రచారము చేయుచున్నాను.

ప్రస్తుతము శ్రీ వేంకటాచల మాహాత్మ్యమును తెలుగులోనికి అనువాదము చేసియున్నాను దానిని వదాన్యుల సహాయముతో ముద్రించి శ్రీనివాసునికి అంకితమిచ్చి అమూల్యముగా భక్తులకు అందించ దలచి యున్నాను. అంతయు భగవంతుని సంకల్పమే.

ఈ విషయములను తెలియజేయటానికి ముఖ్యకారణం, నా గొప్పతనమును చాటి చెప్పటానికి కాదు. నాకు నిస్వార్థ భావనతో ఉపకారము చేసిన పెద్దలను, గురువులను స్మరించి వారి ఋణమును తీర్చుకొనుటయే కాని మరియొకటి కాదు. అటులవారిని స్మరించుటలో నాకుగల ఆనందమే ఈ విషయములను వ్రాయుటకు ప్రేరణ కలుగ జేసినది.

# మహర్షి మనువు సందేశము

ఈనాటి బ్రాహ్మణుడు తన పూర్వ వైభవమును తెలియని వాడగు టచే తన శక్తిని మరచినవాడయి సామాన్యునికంటె హీనస్థితిని అన్ని విధముల అనుభవించుచున్నాడు. తమ జాతి శక్తిని గుర్తించినవారు తమ పూర్వ వైభవమునుగురించి తెలియనివారికి చెప్పవలసిన యవసర మెంతయో గలదు.

బ్రాహ్మణ జాతికిగల శక్తిసామర్థ్యములను తెలుసు కొనుటకు మహర్షులు రచించిన గ్రంథములను చదివి అందలి విషయములను తెలుసు కొనవలయును. తెలుసుకొనినచో బ్రాహ్మణుడు ఆత్మాభిమాన మును పెంచుకొని సమాజగౌరవమును పొందును. మహర్షులు చెప్పిన విషయములు అన్ని కాలములయందును అనుసరించతగినవి. వాటిని తెలుసు కొని ఇతరులకు తెలియ చెప్పినవారికి సమాజమున ఉన్నత గౌరవమును కలుగును.

అందుచేత ప్రాచీన మహర్షులు చెప్పిన విషయపరిజ్ఞానమునకు ప్రాచీన గ్రంథములను చదువుట అత్యంతము అవశ్యకము. ఈ నాటి విద్యావిధానము ఆ నాటి గ్రంథములను చదువుటకు అవకాశము లేకుండా చేసినది, అయినప్పటికిని తీరిక సమయములందు తప్పక చదువ వలయును.

చిన్న మంచి విషయము, సమాజమున గౌరవము కల్గుటకు అందరికి తెలియనిది మనకు తెలిసినది సమాజహితమయిన ప్రత్యేక విషయము తెలిసియుండ వలయును.

ఈ నాటి జన సామాన్యము పత్రికలు, సినిమాలు రాజకీయములు మొదలగు విషయములలో మునిగి మహర్షులు, మహాత్ములు చెప్పిన విషయ

ములను తెలిసి కొనలేక పోవుచున్నారు. అట్టివారికి మనకుగల విజ్ఞాన సముదాయమునందలి కొన్ని విషయములను తెలియ చేసినచో మనలను గౌరవించి నెత్తిన పెట్టుకొందురు. మన బుద్ధి ననుసరించి పురాణముల యందు కావ్యములయందు ధర్మశాస్త్రములందు గల విషయములను ముచ్చటించినచో మన గౌరవము పెరుగును.

మహర్షులు చెప్పిన విషయములు అందరి హితమునుగోరి చెప్పినవి. అన్ని కాలములకు పనికివచ్చునవి. అందరికి ఆనందమును కల్గించునవి. ఆ విషయమును బ్రాహ్మణ జాతి మరచినది. ఈ విషయములను పురుషులకే గాక స్త్రీలకు కూడ తెలియజేయవలసి యున్నది.

మహర్షి మనువు తాను రచించిన మనుస్మృతి అను ధర్మశాస్త్ర గ్రంథమునందు బ్రాహ్మణజాతిని ఈ విధముగ హెచ్చరించెను.

బ్రాహ్మణస్య చ దేహోఽయం న క్షుద్ర కామాయ కల్పతే
తపసే బహూయాసాయ ప్రేత్యానంత సుఖాయ చ

ఈ బ్రాహ్మణ దేహమును నీచమయిన శారీరక భోగములు అనుభవించుటకు బ్రహ్మ సృష్టించలేదు. అనేక విధములయిన తపస్సులు చేయుటకు నిర్మించెను. ఈ విషయము బ్రాహ్మణశరీరమును గురించి చెప్పినను అందరికి వర్తించును.

ఈ శ్లోకమున క్షుద్రకామములు అని తెలుపబడినది, అనగా అల్ప సుఖముల నిచ్చునవి. క్షణకాలము మాత్రమే నిలుచునవి యని యర్థము. అనగా దేనిని యాచరించిన సమాజమున గౌరవము తగ్గునో వానిని క్షుద్ర కామములని తెలుసుకొనవలయును. సామాన్యముగ అసత్యము, దొంగతనము. జూదము, వ్యభిచారము మొదలగు వానితోపాటు వ్యర్థములగు సంభాషణములతో కాలము గడుపుటగూడ క్షుద్ర కామమే యగును. అమూల్యమయిన కాలమును సదుపయోగము చేసికొనినచో శంకరులవలె

వివేకానందులవలె గౌరవమును పొందవచ్చును. ఆ కాలమును తవస్సే బహురూపాయ అనగా అనేక విధములయిన మంచి పనులకు వినియోగించుకొన వచ్చును. అవి సామాజిక ప్రయోజనమును కల్గించునవి. కుటుంబగౌరవమును పెంచునవి, ఆత్మగౌరవమును కల్గించునవి అవి అనేక విధములుగా ఉన్నవి. ఉపన్యాసములుచెప్పవచ్చును. గ్రంథములు వ్రాయ వచ్చును. విద్యార్థులకు పాఠములు చెప్పవచ్చును ఈ పనులవలన ఉన్నత లోకములలో అంతులేని ఆనందము పొందవచ్చును. దానికి కారణము మనము అందించిన విషయములు పరంపరగా లోకమునందు శాశ్వతముగ నిలచుటచే మనకు ఉన్నత లోకమున శాశ్వతత్వము లభించును.

ఈనాడు ధనముగలవారికి గౌరవము పెరుగుటవలన ఈ విషయములు ధన సంపాదనకు అనుకూలములు గాకపోవుటచే వ్యర్థములని కొందరందురు. అది నిజమేయయినను మీ శక్తియుక్తుల ననుసరించి ధన సంపాదన జేయుచు మన ధర్మ విషయములు తెలుసుగొని చెప్పినచో సమాజమునగౌరవము పెరుగును. ఆత్మసంతృప్తియు జీవిత పరమార్థము సిద్ధించును.

మహర్షియయిన మనువు చెప్పిన విషయములు అన్ని కాలములయందు అందరికి అనుకూలమయినవి. వానిని చదివినందువలన మన మనసునకు ఒక నిర్దిష్టమయిన లక్ష్యసిద్ధి దృఢదీక్ష ఏర్పడును, అనగా మనకు తెలియ నంతగా పైకి పెరిగిన వారమగుదము. అందువలన స్వాత్మాభిమానముతో ఇతరులకు మంచి విషయములు చెప్పుటకు ధైర్యము ఏర్పడును.

ఈ భావనతోనే మనువు ఇటుల చెప్పెను

ఏతద్దేశ ప్రసూతస్య స కాశాదగ్రజన్మనః
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః

ఈ దేశమున పుట్టిన బ్రాహ్మణునివలన సమస్త భూమండల వాసులు తమ తమ చరిత్రను, నడవడికను, నేర్చుకొందురుగాక. ఇది అహంకారముతో చెప్పినదికాదు. తాను నిర్దేశించిన ధర్మశాస్త్ర గ్రంథము చదివిన వారికి అంతటి శక్తి కలుగునని భావము.

మనువు తన ధర్మశాస్త్ర గ్రంథ విశేషమును గురించి మరియొక మాట చెప్పెను.

ఇదం స్వస్త్యయనం శ్రేష్ఠమిదం బుద్ధి వివర్ధనం
ఇదం యశస్యమాయుష్య మిదం నిఃశ్రేయసం పరమ్

ఈ ధర్మశాస్త్ర గ్రంథము చదువుటవలన శుభములు కలుగును. జ్ఞానము పెరుగును. కీర్తి కలుగును. ఆయువు వృద్ధి యగును మోక్షము గూడ లభించును.

కాబట్టి బ్రాహ్మణునికి తన జాతి యభివృద్ధికొరకు దేశాభివృద్ధి కొరకు సర్వప్రపంచ క్షేమమునకు ప్రాచీన భారతీయ వైదిక గ్రంథములు చదువవలసి యున్నది.

లలితావిద్యామందిరము
కేదారేశ్వర పేట
విజయవాడ-3.
10-10-98

రచన
వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి

*

# గ్రంథ ప్రశంసలు

Dr. V. Subrahmanya Sastry,
Head of the Department of Telugu
Andhra University,
VISAKHAPATNAM-530 003

10-10-93

శ్రీ శివాయ గురవే నమః

శ్రీ వేదమూర్తులయిన బ్రహ్మశ్రీ వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రి గురుపాదులకు నమస్సుమనసాంజలి. ఉ॥ క్షేమపూర్వకముగా తాము ఆదరముతో నొసగిన "మనవు-మానవ ధర్మములు" "వేదాంత వ్యాస రత్నావళి" అను గ్రంధములురెండును అమూల్య గ్రంథములుసాంతము పఠించితిని.

నిత్యజీవితమునకు పరమావశ్యకములయిన మనుస్మృతిలోని ప్రధాన విషయములను వివరణ పూర్వకముగ లోకమున కందించిన మీకు హార్థిక కృతజ్ఞతాభివందనములు. లోకము మీ ఋణము తీర్చుకొన జాలదు, సర్వమానవ జీవిత సముద్ధరణకు ఈ గ్రంధము పరమోప కారకము. భిన్నభిన్న విషయములను గైకొని సులభ మధురముగ వేదాంత వ్యాసరత్నావళిని మీరు రచించుట అత్యంత ప్రశంసార్హము. సుఖము శారీరకమా, మానసికమా, అద్వైతము అంతుపట్టని విష యమా, మోక్షం అంటే ఏమిటి, నిత్యానందము అను వ్యాసములు ఆణి ముత్యములు. మీ వంటి పండితులు లోకమునకు తప్పక అందించవలసిన విషయములు అని హృదయపూర్వక కృతజ్ఞతలు.

వేదుల సుబ్రహ్మణ్య శాస్త్రి

తెలుగు భాషలో ధర్మశాస్త్ర విషయములంతగాలేవని వ్యధచెందిన శ్రీ వెంపటి లక్ష్మీనారాయణశాస్త్రిగారు మనుస్మృతి యందలి శ్లోక తాత్ప ర్యాలను సంగ్రహముగ సామాజికులకు పరిచయంచేయాలనే, సామాజిక శ్రద్ధతో తలపెట్టిన పుస్తకమే "మనువు-మానవ ధర్మములు".

మనుష్యుడు బ్రాహ్మీముహూర్తమున లేచినప్పటినుండి ఎలా చరించాలి ఎలా వ్యవహరించాలి. అను విషయము మొదలు ఒక బండి ప్రమాదములో ఎవరైనా మరణిస్తే ఆ బండి తోలువానికి లేదా ఆ బండి యజమానికి ఎలాంటి శిక్ష వేయవగునవే మారుమూల విషయమువరకు ఇందు ప్రస్తావించబడింది. వ్యక్తినియమములు, సమిష్టి నియమములు, సంప్రదాయములు, పాలితుల నియమములు, పాలకుల ధర్మములు - ఎన్నెన్నో చెప్పబడ్డాయి. నేటి సమాజమును నులిమివేస్తున్న అవినీతి, ధర్మరాహిత్యంవంటి వానినుండి నిష్కృతి యేమిటి అనే విషయంలో ఇందు మార్గదర్శనం కనిపిస్తుంది. ఇలా ఎన్నని చెప్పాలి - మానవ జీవితంలోని అన్ని అంశములు ఇందు ప్రస్తావించబడ్డాయి. అంటే అతిశయోక్తికాదు. మనకున్న సంస్కారమంతటికి మూలమిది.

శాస్త్రిగారి శైలి మృదుమధురము ద్రాక్షారసము త్రావుతున్నట్లు నడుస్తుంది.

ఈ పుస్తకము సామాన్యులలో ఆవశ్యక పఠనీయమునకు ఉపక రించునట్టిది. కనీసముగా ఉండవలసిన విషయజ్ఞతకు దోహదము చేయు నట్టిది, ఈ కృషి ద్వారా శాస్త్రిగారు ధన్యత పొందినారు. తాము ఆర్థికాది విషయములకు సామాన్యులయ్యు ఎంతో శ్రమచేసినారు. దీనిని చదివి వద్యగ్గురించే చదివించుటద్వారా తమ కర్తవ్యము నీదేర్చుకొనుట పఠితుల కర్తవ్యము. ప్రజానీకమునకు హితకరము.

— తూములూరి లక్ష్మీనారాయణ

# ఇదియే మన సంపద

మహర్షియయిన మనువు, గౌతమ మహర్షి, పరాశర మహర్షి, మొదలయినవారు ధర్మశాస్త్ర గ్రంథములను రచించి సమాజక్షేమమునకు అంకురార్పణ చేసిరి. ఈ ధర్మశాస్త్రగ్రంథములన్నియు వేదములయందలి ధర్మసూక్ష్మములను విశదపరచుచున్నవి. ఆ ధర్మములను కథారూపముగ మహర్షులయిన వ్యాసవాల్మీకాదులు వెలయించి సామాన్యులలో భక్తి ప్రపత్తులను వృద్ధిపరచిరి. ఆ కథలనే కాళిదాస, భారవి, మాఘ, భాస, దండి, భవభూతి, భోజ మొదలయిన మహాకవులు కావ్యములను రచించి సమాజమునందు ఆనందరసమును వర్షించిరి. వీరలేగాక పాణిని, కాత్యాయన, పతంజలి మహర్షులు వ్యాకరణ శాస్త్రమునకు ఆధారభూతులయిరి కణాదమహర్షి న్యాయ శాస్త్రమునకు, శబరమహర్షి పూర్వ మీమాంసకు, పతంజలి యోగశాస్త్రమునకు కారకులయిరి. వీటిని ఆధారము చేసుకొనియే నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథ, అల్లసాని పెద్దన, ముక్కు తిమ్మన్న, నాచనసోమన మొదలయిన మహాకవులు ప్రాంతీయ భాషలో కావ్యరచన చేసిరి. వీరు మనకు అందచేసిన వాఙ్మయమే మన సంపద. మన సర్వస్వము. దీనిని రక్షించి యనుభవించి తరతరాలకు అందించవలసిన భారము మనపై యున్నది.

రామాయణమునందు వాల్మీకి మహర్షి వాక్యము. ఆవును ఈయవలసినదని రాజర్షి విశ్వామిత్రుని యాచించిన సమయమున వసిష్ఠ మహర్షి చెప్పునమాధానము ఇది_

ఏతదేవహి మే రత్న మేతదేవహి మే ధనం
ఏత దేవహి సర్వస్వ మేత దేవహి జీవితం.

ఈ కామధేనువే నాకు రత్నములతో సమానము. నాకున్న ధనము, నా సర్వస్వము, అంతియేగాదు, ఇదియే నా జీవితము. అటులనే మన మహర్షులు, అందచేసిన జ్ఞానభాండారమే మన జీవనసర్వస్వము అని ప్రతి భారతీయుడు గుర్తించవలసి యున్నది. .... రచయిత భావము

# విషయ సూచిక


| అధ్యాయము | విషయము | పుట సంఖ్య |
|---|---|---|
| 1 వ అధ్యాయము | సృష్టిక్రమము | 1 |
| 2 వ అధ్యాయము | బ్రహ్మచారిధర్మములు | 9 |
| 3 వ అధ్యాయము | గృహస్థాశ్రమ ధర్మములు | 27 |
| 4 వ అధ్యాయము | జీవనవిధానము | 41 |
| 5 వ అధ్యాయము | మాంసభక్షణము | 60 |
| 6 వ అధ్యాయము | యతిధర్మములు | 63 |
| 7 వ అధ్యాయము | రాజధర్మములు | 73 |
| 8 వ అధ్యాయము | న్యాయపాలనము | 87 |
| 9 వ అధ్యాయము | స్త్రీ పురుష ధర్మములు | 110 |
| 10 వ అధ్యాయము | వృత్తిధర్మములు | 128 |
| 11 వ అధ్యాయము | దాన ధర్మములు | 132 |
| 12 వ అధ్యాయము | కర్మఫలితములు | 145 |

శ్రీ మనుమహర్షయే నమః

# మనుస్మృతి—మానవ ధర్మములు

## ఒకటవ యధ్యాయము

ఈ యధ్యాయమున సృష్టిక్రమము, జీవుల పుట్టుక, జీవుల యందలి భేదములు, జీవధర్మములు సమగ్రముగ చెప్పబడినవి.

మను మేకాగ్ర మాసీన మభిగమ్య మహర్షయః
ప్రతిపూజ్య యథాన్యాయ మిదం వచన మబ్రువన్
త్వ మేకోహ్యస్య సర్వస్య విధానస్య స్వయంభువః
అచింత్య స్యాప్రమేయస్య కార్యతత్త్వార్థ విత్ప్రభో

మహర్షులందరు ఏకాగ్రచిత్తముతో నాసీనుడై యున్న మనువును సమీపించి తగినవిధమున పూజించి ఈ విధముగ పలికిరి. బ్రహ్మసృష్టించిన ఈ సృష్టియంతయు అచింత్యము, అప్రమేయము అయియున్నది. ఇది యంతయు తెలిసిన మహానుభావుడవు నీవు ఒక్కడివే. మాకు సృష్టి ధర్మములన్నియు తెలియచెప్పుము.

ఆ మాటలు విని మనువు వారిని గౌరవించుచున్నవాడై వారితో నీ విధముగ చెప్పెను.

మొదట ఈ సృష్టియంతయు నిద్రించినవానివలె తమోమయమై యుండెను. ఈ చీకటినంతయు నశింపచేయుచున్నవాడై స్వాయంభువుడు ఆవిర్భవించెను.

దేవతలకు ఒకరాత్రి, ఒక పగలు అగును. మన ఉత్తరాయణము వారికి పగటి కాలము. మన దక్షిణాయనము వారికి రాత్రికాలము. మూలగ్రంథ మున ఈ కాల వివరణము మిక్కిలి విస్తృతముగ గలదు.

చతుష్పాత్సకలో ధర్మః సత్యంచైవ కృతయుగే
నాధర్మేణాగమః కశ్చిన్మనుష్యా న్ప్రతివర్తతే

కృతయుగమునందు ధర్మము నాలుగుపాదములతో నుండును. అధర్మపరుడు ఒకడును ఉండడు. మిగిలిన త్రేతా, ద్వాపరకలియుగము లందు ధర్మము ఒక్కొక్క పాదము చొప్పున తగ్గును. ఈ యధర్మము చౌర్యము, అబద్ధము, మోసము అనువాటితో కూడియుండును.

అరోగాః సర్వసిద్ధార్థాః చతుర్వర్ష శతాయుషః
కృతే త్రేతాదిషు హ్యేషా మాయు ర్హ్రసతి పాదశః

కృతయుగము నందలి ప్రజలురోగములు లేనివారై సమస్త వాంఛలు తీరినవారై నాలుగువందల సంవత్సరముల ఆయుర్దాయము కలిగి యుందురు. మిగిలిన యుగములందు క్రమముగ వారి ఆయుర్దా యము పాదపాదముగ తగ్గుచుండును.

అన్యే కృతయుగే ధర్మాః త్రేతాయాం ద్వాపరేఽపరే
అన్యే కలియుగే నౄణాం యుగహ్రాసాను రూపతః

యుగయుగమునందు ధర్మమున మార్పులుండును. ఈమార్పులు ఆ యా యుగమునందలి మానవుల అశక్తత కారణముగ మారినవి. ఈ మార్పును ఈ విధముగ సూచించినారు.

'తపఃపరం కృతయుగే త్రేతాయాం జ్ఞానముచ్యతే
ద్వాపరే యజ్ఞమేవాహుర్దానమేకం కలౌ యుగే

కృతయుగమున తపస్సు, త్రేతాయుగమున జ్ఞానము, ద్వాపరమున యాగము. కలియుగమున దానము ప్రధానధర్మములుగ చెప్పబడినవి.

ఇదం శాస్త్రమధీయానః బ్రాహ్మణః శంసిత వ్రతః
మనోవాగ్దేహజై ర్నిత్యం కర్మదోషై ర్నలిప్యతే.
పునాతి పంక్తిం వంశ్యాశ్చ సప్త సప్త పరాపరాన్
పృథివీమపి చైవే మాం కత్స్నా మేకోపి సోర్హతి.
ఇదం స్వస్త్యయనం శ్రేష్ఠ మిదం బుద్ధి వివర్ధనమ్
ఇదం యశస్య మాయుష్య మిదం నిశ్శ్రేయసం పరమ్."

ఈ ధర్మశాస్త్రాధ్యయనము చేయుచున్న పండితునకు మనస్సు చేత, వాక్కుచేత, శరీరముచేత చేసిన కర్మదోషములు అంటవు. తన ప్రక్కనగల వారిని పవిత్రులనుచేయును. ఏడుతరముల పూర్వులను, రాబోవు ఏడు తరముల పుత్రాదులను పవిత్రులను చేయును. ఈ శాస్త్ర పఠనము శుభమును కల్గించును. బుద్ధిని పెంచును. కీర్తిని, ఆయువును, మోక్షమును కల్గించును.

విశేషార్థము :- మానవుడు ఎల్లప్పుడు దేనిని తలంచుచుండునో దానియందే బుద్ధియు ఆదరణము కలవాడగును. ఈ శాస్త్రము చదువుట వలన మానవుడు ధర్మాధర్మ విచారణ గలవాడగును. అంతియేగాక అధర్మాచరణము మానును. ఆ కారణమునుబట్టియే మనోవాగ్దేహకర్మ దోషము లుండవని చెప్పబడినది. అటులనే శాస్త్రపఠనమువలన బుద్ధి పెరుగును, దానివలన శుభములు, కీర్తియు సహజముగనే కలుగును.

ఆచారః పరమోధర్మః శ్రుత్యుక్తః స్మార్త ఏవచ
తస్మాదస్మిన్ సదాయుక్తో నిత్యంస్యా దాత్మవాన్ ద్విజః.
ఆచారాద్విచ్యుతో విప్రో న వేదఫల మశ్నుతే
ఆచారేణతు సంయుక్తః సంపూర్ణ ఫలభాగ్భవేత్.
ఏవ మాచారతో దృష్ట్వా ధర్మస్య మునయో గతిమ్
సర్వస్య తపసో మూల మాచారం జగృహుః పరమ్.

ఇచట ఆచార పైశిష్ట్యము సంపూర్ణముగ చెప్పబడినది. ఆచార మనగ నడవడిక యని అర్థము. వేదముచేగాని ధర్మశాస్త్రముచేగాని చెప్పబడిన ఆచారము ననుసరించవలయును. ఆచారహీనుడైనవాడు వేద ఫలమును సంపూర్ణముగ పొందలేడు. అనగా వైదికకర్మలను చేసియు వాటివలన పొందదగినంత ఫలము పొందలేడు. ఆచార సంపన్నుడైనచో ఆ కర్మల సంపూర్ణఫలము పొందగలడు. ఈ కారణము చేతనే మును లందరు ఆచారమును తపస్సునకు ప్రధానలక్షణముగ చెప్పిరి. లోకము నందు కోరికలు కలిగియుండుట ప్రశస్తముగాదు. కాని కోరికలు లేక యుండుట సంభవించుటలేదు. అందుచేత వేదమార్గము ననుసరించి కోరి కలను పూర్తిచేసుకొనవలయును. ఆ విధముగ వైదికమార్గము ననుస రించి కోరికలు పూర్తిచేసుకొనినవాడు సర్వకామములను పొంది చివరకు అమరలోకమును జేరగలడు.

వేదోఽఖిలో ధర్మమూలం స్మృతి శీలేచ తద్విదామ్
ఆచారశ్చైవ సాధూనా మాత్మన స్తుష్టిరేవచ.

ధర్మమునకు మూలము వేదము. ఆ వేదము తెలిసినవారి వాక్య ములు, సాధువుల యాచారము, తమ తృప్తియు ధర్మమే యగును.

యః కశ్చిత్కస్య చిద్ధర్మో మనునా పరికీర్తితః
స సర్వోఽభిహితో వేదే సర్వజ్ఞాన మయో హి సః.

మనువు ఎవరికి ఏ ధర్మము చెప్పెనో అది అంతయు వేదము నందు గలదు. ఆ మనువు సర్వవేద జ్ఞానము గలవాడు గదా

శ్రుతి స్మృత్యుదితం ధర్మమనుతిష్ఠన్ హి మానవః
ఇహకీర్తి మవాప్నోతి ప్రేత్యచా నుత్తమం సుఖమ్.

మానవుడు వేదముచేతను, ధర్మశాస్త్రముచేతను చెప్పబడిన ధర్మము నాచరించుచున్నవాడై ఈ లోకమునందు కీర్తిని పరలోకము నందు ఉత్తమ సుఖమును పొందుచున్నాడు.

శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రంతు వై స్మృతిః
తే సర్వార్థేష్వ మీమాంస్యే తాభ్యాం ధర్మో హి నిర్బభౌ.

వేదమునకు శ్రుతి యని పేరు. స్మృతికి ధర్మశాస్త్రమని పేరు. ఏ విషయము నందును అవి విమర్శించదగినవికావు. అవి అనాదరించ తగినవి కావు వాటిచేతనే ధర్మము నిర్వర్తింప బడినది.

యోఽవమన్యేత తే మూలే హేతు శాస్త్రాశ్రయా ద్ద్విజః
స సాధుభి ర్బహిష్కార్యో నాస్తికో వేదనిందకః.

హేతుశాస్త్రబలము ననుసరించి వేదమును ధర్మశాస్త్రమును నిందించిన పండితుడు సత్పురుషులచే బహిష్కరించతగినవాడు. వేదనిందకుడైనవాడు నాస్తికుడనబడును.

వేద స్మృతి స్సదాచారః స్వస్య చ ప్రియమాత్మనః
ఏత చ్చతుర్విధం ప్రాహు స్సాక్షాద్ధర్మస్య లక్షణమ్

వేదము, ధర్మశాస్త్రము, సత్పురుషులఆచరణము, తనప్రియము అను ఈ నాలుగు ప్రత్యక్షముగా గన్పట్టు ధర్మలక్షణములు.

శ్రుతి ద్వైధంతు యత్రస్యాత్తత్ర ధర్మా వుభౌ స్మృతౌ
ఉభావపిహి తౌ ధర్మౌ సమ్యగుక్తౌ మనీషిభిః.

వేదవాక్యములకు పరస్పరము విరోధము కల్గినచోట ఆ రెండును ప్రమాణములే యని పండితులు చెప్పియుండిరి; ఆ రెండు ధర్మములు తమ తృప్తిననుసరించి ఆచరించతగినవై యుండును.

సరస్వతీ దృషద్వత్యో ర్దేవనద్యో ర్యదంతరమ్
తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే

తస్మిన్దేశే య ఆగారః పారంపర్య క్రమాగతః
వర్ణానాం సాంతరాళానాం స సదాచార ఉచ్యతే

సరస్వతీ దృషద్వతీ నదులమధ్యగల ప్రదేశము దేవనిర్మితము దానికి బ్రహ్మావర్తమని పేరు. ఆదేశమునందు పారంపర్యముగ వచ్చు ఆచారము సమస్త వర్ణములవారికి సదాచారము అగును.

"కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పాంచాలా శ్శూరసేనకాః
ఏష బ్రహ్మర్షి దేశో వై బ్రహ్మావర్తా దనంతరః"
ఏతద్దేశ ప్రసూతస్య సకాశా దగ్రజన్మనః
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః

బ్రహ్మావర్తమునకు అవతలగల కురుక్షేత్ర, మత్స్య, పాంచాల, శూరసేన దేశములకు బ్రహ్మర్షి దేశమని పేరు. ఈదేశమున జన్మించిన పండితునివలన భూమియందలి మానవులందరు తమతమ ధర్మమును తెలిసికొనవలసినవారై యున్నారు.

"హిమవద్వింధ్యయో ర్మధ్యం య త్ప్రాగ్వినశనా దపి
ప్రత్యగేవ ప్రయాగాచ్చ మధ్యదేశః ప్రకీర్తితః"

ఆ సముద్రాత్తు వై పూర్వా దా సముద్రాత్తు పశ్చిమాత్
తయో రేవాంతరం గిర్యో రార్యావర్తం విదుర్బుధాః.

కృష్ణసారస్తు చరతి మృగో యత్ర స్వభావతః
సజ్ఞేయో యజ్ఞియో దేశో మ్లేచ్ఛదేశ స్త్వతః పరః

హిమవత్పర్వతమునకు వింధ్యపర్వతమునకు మధ్యగలదియు, సరస్వతీనదికి ప్రయాగకు మధ్యగలదియగు దేశమునకు మధ్యదేశమని పేరు. తూర్పుసముద్రమునకు పశ్చిమసముద్రమునకు మధ్యగల దేశము అర్యావర్తమని పండితులు చెప్పిరి. సహజముగ లేడి సంచరించు దేశమునకు యజ్ఞదేశమని పేరు. ఇవి సత్పురుషులు నివసించదగిన దేశములు. మిగిలినవి మ్లేచ్ఛదేశములు.

# రెండవ యధ్యాయము

ప్రాఙ్నాభివర్ధనా త్పుంసో జాతకర్మ విధీయతే
మంత్రవత్ప్రాశనం చాస్య హిరణ్య మధు సర్పిషామ్

నాభిచ్ఛేదమునకు పూర్వమే మగశిశువునకు జాతకర్మ చేయవలయును. ఈ బాలుని నోటికి మంత్రపూర్వకముగ మధువును గాని నేతినిగాని బంగారముతో తాకించవలయును

నామధేయం దశమ్యాంతు ద్వాదశ్యాం వాస్య కారయేత్
పుణ్యే తిథౌ ముహూర్తే వా నక్షత్రే వా గుణాన్వితే

ఈ బాలునికి పదియవరోజునగాని పండ్రెండవదినమున గాని మంచితిథియందు, నక్షత్రమునందు, ముహూర్తమునందు నామకరణము చేయవలయును.

స్త్రీణాం సుఖోద్య మక్రూరం విస్పష్టార్థం మనోహరమ్
మాంగల్యం దీర్ఘవర్ణాంత మాశీర్వాదాభివాదనమ్

బాలికలపేరు సుఖముగ ఉచ్చరించ తగినదిగను, క్రూరార్థము లేనిదిగను, స్పష్టమైన అర్థము గలదిగను, మంగళకరమైనదిగను, దీర్ఘాక్షరము చివరగలదిగను నుండవలయును

చతుర్థేమాసి కర్తవ్యం శిశోర్నిష్క్రమణం గృహాత్
షష్ఠేఽన్న ప్రాశనం మాసి యద్వేష్టం మంగళం కులే

నాలుగవమాసమునందు శిశువును సూర్యదర్శనార్థము ఇంటినుండి బయటికి తీసుకొని వెళ్ళవలయును. ఆరవమాసమునందు అన్న ప్రాశనము చేయవలయును. అటుల కుదరనిచో తమ కులాచారమునను సరించి మంగళకర దినమున చేయవచ్చును.

చూడాకర్మ ద్విజాతీనాం సర్వేషామేవ ధర్మతః
ప్రథమేఽబ్దే తృతీయే వా కర్తవ్యం శ్రుతిచోదనాత్

చెవులు కుట్టించుట అందరకు మొదటి సంవత్సరమునందుగాని మూడవ సంవత్సరమునందుగాని చేయవలయును.

ఆయుష్యం ప్రాఙ్ముఖో భుంక్తే యశస్యం దక్షిణాముఖః
శ్రియం ప్రత్యఙ్ముఖో భుంక్తే ఋతం భుంక్తే హ్యుదఙ్ముఖః

ఆయువును కోరినవాడు తూర్పుముఖముగలవాడుగను, కీర్తిని గోరినవాడు దక్షిణముఖముగలవాడుగను, సంపదను కోరినవాడు పశ్చిమాభిముఖుడుగను భుజింపవలయును. సత్యమును కోరినవాడు ఉత్తరాభిముఖుడుగ భుజింపవలయును.

పూజయే దశనం నిత్య మద్యాచ్చైత దకుత్సయన్
దృష్ట్వా హృష్యే త్ప్రసీదేచ్చ ప్రతినందేచ్చ సర్వశః
పూజితం హ్యశనం నిత్యం బల మూర్జం చ యచ్ఛతి
అపూజితం తు తద్భుక్త ముభయం నాశయేదిదమ్
నోచ్ఛిష్టం కస్యచి ద్దద్యాన్నాద్యాచ్చైవ తథాంతరా
న చైవా త్యశనం కుర్యా న్నచోచ్ఛిష్టః క్వచి ద్వ్రజేత్
అనారోగ్య మనాయుష్య మస్వర్గ్యం చాతిభోజనమ్
అపుణ్యం లోకవిద్విష్టం తస్మా త్తత్పరివర్జయేత్

ఆహారమును పూజించవలయును, అసహ్యభావము లేక తినవలయును, చూచి సంతసించ వలయును. నిర్మల స్వభావమును పొందవలయును. అభినందించ వలయును, పూజించబడిన యాహారము బలమును, వీర్యమును ఇచ్చును. పూజించబడని యాహారము ఈ రెండింటిని నాశనముచేయును, ఉచ్ఛిష్టభోజనమును అనగా మిగిలినదానిని ఎవరికిని పెట్టరాదు. తాను తినరాదు. అధికముగా తినరాదు. అన్నము

తినుచు ఎచటకు వెళ్ళరాదు. అధిక భోజనము ఆరోగ్యభంగమును గల్గించును. ఆయుర్దాయమును తగ్గించును. పాపలోకమునకు తీసుకొనిపోవును లోకముచే నిందించబడినది. అందుచే దానిని విడిచిపెట్టవలయును.

బ్రహ్మారంభేఽవసానేచ పాదౌ గ్రాహ్యౌ గురో స్సదా
సంహత్య హస్తా వధ్యేయం స హి బ్రహ్మాంజలిః స్మృతః
వ్యత్యస్తపాణినా కార్య ముపసంగ్రహణం గురోః
సవ్యేన సవ్యః ప్రష్టవ్యో దక్షిణేన చ దక్షిణః

విద్యారంభమునందును, అవసానమునందును, శిష్యుడు గురుపాదములకు నమస్కరించవలయును. చేతులు ఒకచోట చేర్చి కూర్చొనవలయును. దానికి బ్రహ్మాంజలియనిపేరు. గురువు కుడిపాదమును కుడిచేతితోను ఎడమపాదమును ఎడమచేతితోను స్పృశించవలయును.

అకారంచా ప్యుకారం చ మకారంచ ప్రజాపతిః
వేదత్రయాన్నిరదుహ ద్భూర్భువ స్స్వరతీతి చ
త్రిభ్య ఏవతు వేదేభ్యః పాదం పాదమదూదుహత్
తదిత్యృచోఽస్యాః సావిత్ర్యాః పరమేష్ఠీ ప్రజాపతిః
ఏతదక్షర మేతాంచ జపన్ వ్యాహృతిపూర్వికామ్
సంధ్యయో ర్వేదవిద్విప్రో వేదపుణ్యేన యుజ్యతే
సహస్రకృత్వ స్త్వభ్యస్య బహిరేత త్త్రికం ద్విజః
మహతోప్యేనసో మాసా త్త్వచేవా హి ర్విముచ్యతే ॥

బ్రహ్మ అకార ఉకార మకారములను భూః భువః స్వః అను వ్యాహృతులను క్రమముగ ఋగ్వేద, యజుర్వేద సామవేదముల నుండి గ్రహించెను. బ్రహ్మ మూడు వేదములనుండి ఒక్కొక్కపాదముచొప్పున గాయత్రియొక్క మూడు పాదములను గ్రహించెను. వ్యాహృతులతో

గూడిన గాయత్రిని ఉదయ సాయంసంధ్యలయందు చేయుచున్న ద్విజుడు సమస్త వేదపఠన పుణ్యమును పొందును. ఈ గాయత్రిని ఊరి వెలుపల నదీతీరమున వేయి పర్యాయములు చేసిన ద్విజుడు కుబుసమును విడిచిన పామువలె మహాపాపమునుండి విడువబడును.

ఓంకారపూర్వికా స్తిస్రో మహావ్యాహృతయోఽవ్యయాః
త్రిపదాచైవ సావిత్రీ విజ్ఞేయం బ్రహ్మణోముఖమ్
యోఽధీతేఽహన్యహన్యేతాం త్రీణివర్షా ణ్యతంద్రితః
సబ్రహ్మపరమభ్యేతి వాయుభూతః ఖమూర్తిమాన్
ఏకాక్షరం పరం బ్రహ్మ ప్రాణాయామాః పరంతపః
సావిత్ర్యాస్తు పరం నాస్తి మౌనాత్సత్యం విశిష్యతే
క్షరంతి సర్వా వైదిక్యో జుహోతి యజతి క్రియాః
అక్షరం త్వక్షరం జ్ఞేయం బ్రహ్మచైవ ప్రజాపతిః
విధియజ్ఞా జ్జపయజ్ఞో విశిష్టో దశభిర్గుణైః
ఉపాంశు స్స్యా చ్ఛత గుణ స్సాహస్రో మానస స్స్మృతః
యే పాకయజ్ఞా శ్చత్వారో విధియజ్ఞ సమన్వితాః
సర్వేతే జపయజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్
జపేనైవతు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః
కుర్యా దన్యన్నవా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే ॥

ఈ శ్లోకములయందు ఓంకార ప్రభావము జపప్రభావము చెప్పబడినది. ఓంకారము పూర్వముగాగల భూః భువః సువః అనునవి బ్రహ్మ ప్రాప్తికి కారణములు. మూడుపదములతో గూడిన గాయత్రీ మంత్రము వేదమునకు ముఖమువంటిది. ఈ మంత్రమును మూడు సంవత్సరములు జపించినవాడు పరబ్రహ్మను పొందును. ఓంకారమొక్కటియే పరబ్రహ్మ

ప్రాప్తికి కారణము. గాయత్రీమంత్రముతోగూడిన ప్రాణాయామములే ఉత్కృష్టమైన తపస్సు చాంద్రాయణాది వ్రతములకంటె శ్రేష్ఠమైనవి. గాయత్రి మంత్రముకంటె గొప్పమంత్రములేదు. మౌనవ్రతముకంటె సత్యవ్రతము గొప్పది. వేదవిహితములైన హోమాది క్రియలన్నియు, నశించునవి. ఒక ఓంకారము మాత్రమే నశించని బ్రహ్మస్వరూపము. దర్శపౌర్ణమాసాదియజ్ఞములకంటె జపయజ్ఞము పదిరెట్లు అధికమైనది. జపయజ్ఞముకంటె పెదవులుమాత్రమే కదుపుచుచేయు ఉపాంశుయజ్ఞము నూరురెట్లు అధికమైనది. వైశ్వ దేవహోమబలికర్మనిత్యశ్రాద్ధాతిథి భోజనాత్మకములైన నాలుగు పాక యజ్ఞములు దర్శపౌర్ణమాసాదులుగూడ జపయజ్ఞముయొక్క పదునారవభాగమునుగూడ పొందలేవు.

> ఇంద్రియాణాం విచరతాం విషయే ష్వపహారిషు
> సంయమే యత్నమాతిష్ఠే ద్విద్వాన్ యంతేవ వాజినామ్
> ఏకాదశేంద్రియాణ్యాహుర్యానిపూర్వే మనీషిణః
> తాని సమ్యక్ప్రవక్ష్యామి యథావదనుపూర్వశః
> శ్రోత్రం త్వక్ చక్షుషీ జిహ్వా నాసికాచైవ పంచమీ
> పాయూపస్థం హస్త పాదం వాక్చైవ దశమీ స్మృతా
> బుద్ధీంద్రియాణి పంచైషాం శ్రోత్రాదీ న్యనుపూర్వశః
> కర్మేంద్రియాణి పంచైషాం పాయ్వాదీని ప్రచక్షతే
> ఏకాదశం మనోజ్ఞేయం స్వగుణే నోభయాత్మకమ్
> యస్మిన్ జితేజితావేతౌ భవతః పంచకౌ గుణౌ

ఇచ్చట ఇంద్రియప్రపంచము వివరించబడుచున్నది. విషయములపై ప్రసరించు స్వభావముగల ఇంద్రియములను సారథి గుఱ్ఱములను నియమించునట్లుగ పండితుడైనవాడు నియమింపవలయును. పండితులు ఇంద్రియములను పదునొకండని చెప్పిరి. అవి-చెవి, చర్మము, కన్ను, నాలుక, నాసిక యనునవి, గుదము, లింగము, చేయి, కాలు, వాక్కు-అను

నవి. శ్రోత్రాదులు బుద్ధీంద్రియములని, గుదాదులు, కర్మేంద్రియములని చెప్ప బడినవి. పదునొకండవది మనస్సు. ఇదియే అన్ని ఇంద్రియము లను ప్రవర్తింపచేయును. దీనిని జయించిన అన్ని ఇంద్రియములను జయించినవాడగును.

ఇంద్రియాణాం ప్రసంగేన దోషమృచ్ఛత్యసంశయమ్
సంనియమ్యతు తాన్యేవ తతస్సిద్ధిం నియచ్ఛతి
నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే
యశ్చైతాన్ ప్రాప్నుయాత్సర్వాన్ యశ్చైతాన్కేవలాంస్త్యజేత్
ప్రాపణాత్సర్వకామానాం పరిత్యాగో విశిష్యతే

ఇంద్రియముల ప్రభావమిట్లు చెప్పబడినది :

ఇంద్రియముల భోగమువలన నిస్సందేహముగ దోషము కలుదును. వానిని నియమించినవాడై మోక్షరూపమైనసిద్ధిని పొందును. కోరికల ననుభవించుటచేత కోరికలు పెరుగునేకాని కోరికలు నశించవు. నేతిని పోయుటచేత అగ్ని ప్రజ్వరించునేకాని చల్లారదుకదా. కోరిక లన్నియు అనుభవించినవానికంటె వాటిని త్యాగము చేసినవాడే శ్రేష్ఠుడు.

న తథైతాని శక్యంతే సంనియంతు మసేవయా
విషయేషు ప్రదుష్టాని యథా జ్ఞానేన నిత్యశః
వేదస్త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసి చ
న విప్రదుష్టభావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్
శ్రుత్వా స్పృష్ట్వాచ దృష్ట్వాచ భుక్త్వా ఘ్రాత్వా చ యోనరః
న హృష్యతి గ్లాయతి వా న విజ్ఞేయో జితేంద్రియః
ఇంద్రియాణాంతు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియం
తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాదాదివోదకమ్

వశీకృత్వేంద్రియగ్రామం సంయమ్య చ మన స్తథా
సర్వాన్ సంపాదయేదర్థా నక్షిణ్వన్ యోగము త్తమమ్
ఇంద్రియ జయావశ్యకత నిట్లు చెప్పుచున్నాడు :.

ఇంద్రియభోగములను అనుభవించకపోవుటచేత అనగా నిరోధించుటచేత ఇంద్రియములను జయించ లేము. ఇంద్రియభోగములవలన కలుగునష్టములను తెలిసికొనిననే జయించగలము. వేదాధ్యయనము త్యాగము, యజ్ఞములు, తపస్సులు మొదలగునవి యన్నియు ఇంద్రియ జయముగలవానికే సిద్ధించును. కాని ఇంద్రియజయము లేనివానికి సిద్ధించవు. వినియు, తాకియు, చూచియు, తినియు, వాసనచూచియు ఏ మనుష్యుడు సంతోషమును దుఃఖమును పొందడో అతడే జితేంద్రియుడని చెప్పబడును. ఏ ఒక్క ఇంద్రియముస్వాధీనము తప్పినను రంధ్రము పడిన తోలుతి త్తినుండి నీరుకారిపోయినటుల ప్రజ్ఞయంతయు నశించి పోవును. నిజముగ శరీరము తోలుతి త్తియేగదా! కావున ఇంద్రియములను మనస్సును నియమించి సర్వపురుషార్థములను సాధించవలయును

పూర్వాంసంధ్యాం జపం స్తిష్ఠేత్సావిత్రీమార్కదర్శనాత్
పశ్చిమాంతు సమాసీనః సమ్యగృక్ష విభావనాత్
పూర్వాం సంధ్యాం జపం స్తిష్ఠన్నైశ మేనో వ్యపోహతి
పశ్చిమాంతు సమాసీనో మలంహంతి దివాకృతమ్
అపాం సమీపే నియతో నైత్యకం విధిమాస్థితః
సావిత్రీమప్యధీయీత గత్వారణ్యం సమాహితః
జపము చేయవలసిన విధానము నిట్లు చెప్పుచున్నాడు :

ఉదయకాల జపమును సూర్యోదయపర్యంతము నిలువబడి చేయవలయును. సాయంకాలసంధ్యను కూర్చొని నక్షత్రదర్శన పర్యంతము

చేయవలయును ఉదయకాలమున జపముచేసి రాత్రిచేసిన పాపమును; సాయంకాలమున జపముచేసి పగటిపాపమును త్యజించుచున్నాడు. అరణ్యమున నదీతీరమునందు గాయత్రీజపమును చేయవలయును.

> నా పృష్టః కస్యచి ద్బ్రూయాన్నచాన్యాయేన పృచ్ఛతః
> జానన్నపి హి మేధావీ జడవల్లోక ఆచరేత్
> అధర్మేణ చ యః ప్రాహ యశ్చాధర్మేణ పృచ్ఛతి
> తయో రన్యతరః ప్రైతి విద్వేషం వాధిగచ్ఛతి
> ధర్మార్థౌ యత్ర నస్యాతాం శుశ్రూషావాపి తద్విధా
> తత్ర విద్యా నవక్తవ్యా శుభం బీజ మివోషరే
> విద్యయైవ సమం కామం మర్తవ్యం బ్రహ్మవాదినా
> ఆపద్యపి హి ఘోరాయాం నత్వేనా మిరిణే వపేత్
> విద్యాబ్రాహ్మణ మేత్యాహ శేవధిష్టేఽస్మి రక్ష మామ్
> అసూయకాయ మామాదా స్తథాస్యాం వీర్యవత్తమా
> యమేవతు శుచిం విద్యాన్నియతం బ్రహ్మచారిణమ్
> తస్మై మాం బ్రూహి విప్రాయ నిధిపాయా ప్రమాదినే
> లౌకికం వైదికం వాపి తదాధ్యాత్మిక మేవచ
> ఆదదీత యతోజ్ఞానం తం పూర్వ మభివాదయేత్
> సావిత్రీ మాత్రసారోపి వరం విప్ర స్సుయంత్రితః
> నాయంత్రితస్త్రివేదోఽపి సర్వాశీ సర్వవిక్రయీ

ఇచ్చట విద్యాప్రదాన, విద్యాగ్రహణ విషయములు చెప్పబడు చున్నవి :-

బుద్ధిమంతుడైనవాడు విషయము తెలిసినప్పటికి అడుగకుండగ ఎవ్వరికి చెప్పరాదు. అటులనే అన్యాయబుద్ధితో అడిగినవానికిగూడ

చెప్పరాదు. మూఢునివలె లోకమునందు సంచరించవలయును. అధర్మముగా అడిగినవాడుగాని అధర్మముగా చెప్పినవాడుగాని చనిపోవును. లేనిచో పరస్పర ద్వేషభావము పొందుదురు. ధర్మార్థములుగాని శుశ్రూషగాని లేనిచోట ఊసరక్షేత్రమున మంచి విత్తనములు నాటినటుల విద్యను చెప్పరాదు. బ్రహ్మవేత్తయైనవాడు విద్యతో సమముగ నశించవలయునే గాని అయోగ్యునికి చెప్పరాదు. విద్య బ్రాహ్మణుని సమీపించి యిట్లు చెప్పెను—నిన్ను సేవించగలను. నన్ను రక్షించుము. అసూయగలవానికి నన్ను ఇవ్వకుము. అప్పుడు నేను శక్తిగలదాన నగుదును. శుచియు, నియమవంతుడు, బ్రహ్మచారియు, జాగరూకత గలవాడు. ప్రమాదరహితుడు అగు బ్రాహ్మణునకు మాత్రమే ఇమ్ము. లౌకిక వైదికాధ్యాత్మిక విద్యలను బోధించుగురువునకు ముందు నమస్కరించవలయును, నియమవంతుడైన బ్రాహ్మణుడు గాయత్రిమాత్రము గలవాడైనప్పటికి శ్రేష్ఠుడు. అన్నియు తినుచు, అన్నియు అమ్ముచున్నవాడు మూడు వేదములు చదివినప్పటికి శ్రేష్ఠుడుకాడు.

> ఊర్ధ్వం ప్రాణాహ్యుత్క్రామంతి యూనః స్థవిర ఆగతే
> ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే
> అభివాదనశీలస్య నిత్యం వృద్ధోపసేవినః
> చత్వారి పరివర్ధంతే ఆయుర్విద్యా యశోబలమ్
> అభివాదాత్పరం విప్రో జ్యాయాంస మభివాదయన్
> అసౌ నామాహ మస్మీతి తన్నామ పరికీర్తయేత్
> ఆయుష్మాన్భవ సౌమ్యేతి వాచ్యో విప్రోఽభివాదనే
> అకారశ్చాస్యనామ్నోంతే వాచ్యః పూర్వాక్షరః ప్లుతః

వృద్ధుడు వచ్చినపుడు చిన్నవాని ప్రాణములు పైకి లేచిపోవును. లేచి నమస్కరించుటవలన తిరిగివాటిని పొందును. ఎల్లప్పుడు వృద్ధుని సేవించువానికి, నమస్కరించువానికి ఆయువు, విద్య, యశము, బలము

వృద్ధిచెందును. బ్రాహ్మణుడు నమస్కరించి తన పేరును చెప్పవలయును. నమస్కరించిన తర్వాత "ఆయుష్మంతుడవు కమ్ము" అని ఆశీర్వదించ వలయును. చివరగల అకారమును ప్లుతముగ ఉచ్చరింపవలయును.

పరపత్నీ తు యా స్త్రీస్యా దసంబంధా చ యోనితః
తాం బ్రూయా ద్భవతీ త్యేవం సుభగే భగినీతి చ
మాతులాంశ్చ పితృవ్యాంశ్చ శ్వశురా నృత్విజో గురూన్
అసావహమితి బ్రూయాత్ప్రత్యుత్థాయ యవీయసః
మాతృష్వసా మాతులాని శ్వశ్రూ రథ పితృష్వసా
సంపూజ్యా గురుపత్నీ వత్సమస్తా గురుభార్యయా
పితుర్భగిన్యాం మాతుశ్చ జ్యాయస్యాం చ స్వసుర్యపి
మాతృవద్వృత్తి మాతిష్ఠే న్మాతా తాభ్యో గరీయసీ
విత్తం బంధుర్వయః కర్మవిద్యా భవతి పంచమీ
ఏతాని మాన్యస్థానాని గరీయో యద్యదుత్తరమ్
బంధు గౌరవమునుగూర్చి ఇచ్చట చెప్పబడుచున్నది :.

పరుల భార్యను, బాంధవ్యములేని స్త్రీని భవతీ. సుభగే, భగినీ యను సంబోధనలతో పిలువవలయును, పేరులతో పిలువరాదు. అనగా పూజ్యురాలా, సోదరియని పిలువవలయును. మేనమామను, తండ్రి సోదరులను మామను, పురోహితుని, గురువులను చూచి నిలువబడి నేను ఫలానివాడను, నా పేరు ఇది - అని చెప్పవలయును. తల్లిసోదరి, మేనమామభార్య, అత్తగారు, తండ్రి సోదరి-వీరందరు గురుపత్నివలె పూజించ తగినవారు. గురుపత్నితో సమానులు. తండ్రిసోదరి తన అక్క-తల్లివలె పూజించతగినవారు. తల్లి వారందరికంటె గౌరవించతగినది. ధనము, బాంధవ్యము, కార్యాచరణము, చదువు ‌ఃమనవి ఒకదానికంటెను ఒకటి ఉత్తరోత్తరము శ్రేష్ఠమైనవి.

చక్రిణో దశమీస్థస్య రోగిణో భారిణః స్త్రియాః
స్నాతకస్యతు రాజ్ఞశ్చ పంథా దేయో వరస్య చ

బండిపై వెళ్ళువానికి, వయోవృద్ధునికి రోగికి. బరువుమోయు వానికి, స్త్రీకి, స్నాతక వ్రతముచేసినవానికి, రాజునకు, వివాహము కొరకు వెళ్ళువానికి తాను తప్పుకొని దారి ఈయవలెను.

ఉపనీయతు యశ్శిష్యం వేదమధ్యాపయే ద్ద్విజః
సకల్పకం సరహస్యం చ తమాచార్యం ప్రచక్షతే
ఏకదేశం తు వేదస్య వేదాంగాన్యపి వాపునః
యోఽధ్యాపయతి వృత్త్యర్థ ముపాధ్యాయ స్స ఉచ్యతే
నిషేకాదీని కర్మాణి యః కరోతి యథావిధి
సంభావయతి చాన్నేన సవిప్రో గురు రుచ్యతే
అగ్న్యాధేయం పాకయజ్ఞానగ్నిష్టోమాదికాన్ మఖాన్
యః కరోతి వృతో యస్య స తస్యర్త్విగిహోచ్యతే
యః ఆవృణోత్యవితథం బ్రహ్మణా శ్రవణా వుభౌ
స మాతాపితాజ్ఞేయస్తం నద్రుహేత్కదాచన
ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాం శతం పితా
సహస్రం తు పితౄన్ మాతా గౌరవేణాతిరిచ్యతే

ఇచట గురుస్వరూపభేదము చెప్పబడుచున్నది :

ఉపనయనముచేసి యజ్ఞవిద్యతోను ఉపనిషత్తులతోను గూడిన వేదమును చెప్పినవారు 'ఆచార్యు'లని చెప్పబడుదురు. వేదములందుగాని శాస్త్రములందుగాని కొద్దిభాగమును వృత్తినిమిత్తము బోధించినవారు 'ఉపాధ్యాయులు', గర్భాధానాదికర్మలనుశాస్త్రము ననుసరించి చేసి అన్నం పెట్టి పెంచినవారు 'గురువు' లగుదురు. సామాన్యముగాతండ్రియే ఇచ్చట

గురుశబ్దవాచ్యుడగును. ఆవహనీయము అగ్నిష్టోమము మొదలగువానిని చేయించినవారు 'ఋత్విక్కు' లనబడుదురు. ఎల్లప్పుడు వేదాధ్యయనము చేత తన చెవులను పూరించినవాడు తల్లియు తండ్రియు యగును. ఉపాధ్యాయునికంటెను ఆచార్యుడు పదిరెట్లు అధికమైనవాడు. ఆచార్యుని కంటెను తండ్రి నూరురెట్లు అధికమైనవాడు. తండ్రికంటెను తల్లి వేయిరెట్లు అధికమైనది.

ఉత్పాదక బ్రహ్మదాత్రో ర్గరీయాన్ బ్రహ్మదః పితా
బ్రహ్మజన్మహి విప్రస్య ప్రేత్యేహచ శాశ్వతమ్
ఆచార్యస్త్వస్య యాం జాతిం విధివద్వేదపారగః
ఉత్పాదయతి సావిత్ర్యా సాసత్యాఽజరామరా
అల్పం వా బహువాయస్య శ్రుతస్యోపకరోతి యః
తమపీహ గురుం విద్యాచ్ఛ్రుతోపక్రియయా తయా
బ్రాహ్మస్య జన్మనః కర్తా స్వధర్మస్య చ శాసితా
బాలోఽపి విప్రో వృద్ధస్య పితా భవతి ధర్మతః
అజ్ఞో భవతి వై బాలః పితా భవతి మంత్రదః
అజ్ఞం హి బాలమిత్యాహుః పితేత్యేవతు మంత్రదమ్
నహాయనైర్నపలితైర్నవిత్తేన న బంధుభిః
ఋషయశ్చక్రిరే ధర్మం యోఽనుభావ స్సనోమహాన్
న తేన వృద్ధోభవతి యేనాస్య పలితం శిరః
యోవై యువా ప్యధీయానస్తం దేవాః స్థవిరం విదుః
యథా కాష్ఠమయో హస్తీ యథా చర్మమయో మృగః
యశ్చవిప్రో నధీయాన స్త్రయస్తే నామ బిభ్రతి

జన్మ యిచ్చిన తండ్రికంటెను బ్రహ్మజ్ఞానమునిచ్చిన తండ్రియే శ్రేష్ఠమైనవాడు. విప్రునకు ఉపనయన సంస్కారరూపమైన బ్రాహ్మణ జన్మయే ఈలోకమునందును పరలోకమునందును శాశ్వతమైనది. వేద

వేత్తయైన ఆచార్యుడు సావిత్రీ మంత్రోపదేశముచేత ఏ జాతి నిచ్చునో అది అజరామరమైనది. అనగా సావిత్రీ మంత్రోపదేశముచేత లభించునది బ్రాహ్మణజన్మయని యర్థము. కొంచెముగాగాని శాస్త్రోపదేశము చేసినవానిని గురువనియే తలంచవలయును ఉపనయనము చేసినవాడును స్వధర్మోపదేశము చేసినవాడును బాలుడైనను వృద్ధుడైనవానికి తండ్రియే యగును తెలియనివాడు బాలుడు. మంత్రదానముచేసినవాడు తండ్రి. వయస్సుచేతగాని, తెల్లనివెంట్రుకలచేతగాని ఎవడు గొప్పవాడుకాజాలడు ధర్మాచరణముగలవానినే మహర్షులు గొప్పవాడని చెప్పిరి. యువకుడైనను వేదము చెప్పువానిని దేవతలందరు వృద్ధుడని చెప్పిరి. కొయ్యతో చేసిన ఏనుగువలె చర్మముతో చేసిన మృగమువలె వేదము చదువని బ్రాహ్మణుడు నామమాత్రమునకే బ్రాహ్మణుడు.

> అహింసయైవ భూతానాం కార్యం శ్రేయోఽనుశాసనమ్
> వాక్చైవ మధురాశ్లక్ష్ణా ప్రయోజ్యా ధర్మమిచ్ఛతా
> నారుంతుదస్యా దార్తోఽపి న పరద్రోహ కర్మధీః
> యయాస్యోద్విజతేవాచా నాలోక్యాం తాముదీరయేత్
> సంమానాద్బ్రాహ్మణో నిత్యముద్విజేత విషాదివ
> అమృతస్యేవ చకాంక్షే దవమానస్య సర్వదా
> సుఖం హ్యవమత శ్శేతే సుఖం చ ప్రతిబుధ్యతే
> సుఖం చరతి లోకేఽస్మి న్నవమంతా వినశ్యతి

ధర్మమును కోరినవానికి అహింసచేతనే శ్రేయస్సు సంపాదించవలయును. మధురమైన వాక్కునే పలుకవలయును.

బాధితుడైనప్పటికీ పరులకు ద్రోహము తలపెట్టరాదు. ఇతరులకు బాధను కలిగించు వాక్యములు పలుకరాదు బ్రాహ్మణుడు నిత్యము సమ్మానమునుచూచి విషమునుచూచినటుల భయపడవలయును. అవమా

నమును అమృతమువలె స్వీకరించవలయును. అవమానమును పొందిన వాడు సుఖముగ నిద్రించి సుఖముగ మేల్కొనును సుఖముగ సంచరించును. అవమానము చేసినవాడు నశించును.

వేదమేవ సదాభ్యసేత్తపస్తప్యన్ ద్విజోత్తమః
వేదాభ్యాసో హి విప్రస్య తపః పరమిహోచ్యతే

బ్రాహ్మణుడు ఎల్లప్పుడు వేదమునే చదువవలయును. వేదపఠనమే బ్రాహ్మణునకు గొప్పదైన తపస్సు.

హీనాన్నవస్త్రవేషః స్యాత్సర్వదా గురుసన్నిధౌ
ఉత్తిష్ఠే త్ప్రథమం చాస్య చరమం చైవ సంవిశేత్
ప్రతిశ్రవణసంభాషే శయానో న సమాచరేత్
నాసీనో న చ భుంజానో న తిష్ఠ న్న పరాఙ్ముఖః
ఆసీనస్య స్థితః కుర్యా దభిగచ్ఛంస్తు తిష్ఠతః
ప్రత్యుద్గమత్వా వ్రజతః పశ్చాద్ధావంస్తు ధావతః
పరాఙ్ముఖ స్యాభిముఖో దూరస్థస్యైత్య చాంతికమ్
ప్రణమ్యతు శయానస్య నిదేశేచైవ తిష్ఠతః
నీచం శయ్యాసనం చాస్య సర్వదా గురుసన్నిధౌ
గురోస్తు చక్షుర్విషయే న యథేష్టాసనో భవేత్
గురోర్యత్ర పరీవాదో నిందావాపి ప్రవర్తతే
కర్ణౌ తత్ర పిధాతవ్యౌ గంతవ్యం వా తతోఽన్యతః

గురుసేవ చేయవలసిన విధము వివరించబడుచున్నది :

గురుసమీపమునందు గురువునకంటెను తక్కువదైన భోజనము వస్త్రము, వేషము ఉండవలయును. గురువునకంటెను ముందర నిద్ర లేవవలయును గురువు నిద్రించినపిమ్మట నిద్రించవలయును. పరుండియు

కూర్చుండియు తినుచు విముఖుడై గురువునకు సమాధానము చెప్ప రాదు కూర్చుండిన గురువునకు నిలువబడియు నిలుచున్న వానికి ఎదురుగ నుండియు, వచ్చుచున్న వానికి ఎదురుగ వెళ్ళియు, పరుగెత్తుచున్న వానికి పరుగెత్తుచు సమాధానము చెప్పవలయును. విముఖుడుగనున్న గురువునకు ఎదురుగ నిలువబడియు, దూరముగనున్న వానిని సమీపించియు పరుండినవానికి నమస్కరించియు, దగ్గరనున్న వానికి నిలువబడియు సమాధానము చెప్పవలయును. గురువు ఆసనముకంటె తక్కువదైన ఆసనముపై కూర్చుండ వలయును. గురువుసమీపమున స్వేచ్ఛగా కూర్చొనరాదు. గురునింద వినిపించినపుడు చెవులు మూసుకొన వలయును. లేక అచ్చటినుండి ఎచ్చటికైనను వెళ్ళవలయును.

కామంతు గురుపత్నీనాం యువతీనాం యువా భువి
విధివద్వందనం కుర్యాదసావహ మితి బ్రువన్
విప్రోష్య పాదగ్రహణ మన్వహం చాభివాదనమ్
గురుదారేషు కుర్వీత సతాం ధర్మ మనుస్మరన్

గురుభార్యను గౌరవించవలపిన విధము :

యౌవనదశ యందున్న గురుభార్యను యువకుడు భూమిని స్పృశించి తన పేరు చెప్పుచు శాస్త్రప్రకారము నమస్కారముచేయ వలయును. అనగా యువకుడైన శిష్యుడు యువతియైన గురుభార్య పాదములు అంటరాదు. గ్రామాంతరమునుండి వచ్చిన శిష్యుడు గురుపత్ని పాదములతాకి నమస్కరింపవలయును. ప్రతిదినము చేతులు జోడించి నమస్కరించినచాలును. ఇదియంతయు సత్పురుషుల ధర్మమును స్మరించుచు చేయవలయును.

యథా ఖనన్ ఖనిత్రేణ నరో వా ర్యధిగచ్ఛతి
తథా గురుగతాం విద్యాం శుశ్రూషు రధిగచ్ఛతి

మానవుడు పలుగుతో త్రవ్వి భూమినుండి నీరు సంపాదించి నటుల శిష్యుడు గురుసేవచేత గురువునందుగల విద్యను సంపాదించ వలయును.

ఆచార్యశ్చ పితాచైవ మాతా భ్రాతా చ పూర్వజః
నార్తేనా ప్యవమంతవ్యా బ్రాహ్మణేన విశేషతః
ఆచార్యో బ్రహ్మణోమూర్తిః పితామూర్తిః ప్రజాపతేః
మాతా పృథివ్యామూర్తిస్తు భ్రాతాస్వో మూర్తిరాత్మనః
యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణామ్
న తస్య నిష్కృతి శ్శక్యా కర్తుం వర్షశతైరపి
తయోర్నిత్యం ప్రియంకుర్యా దాచార్యస్య చ సర్వదా
తేష్వేవ త్రిషు తుష్టేషు తప స్సర్వం సమాప్యతే
తేషాం త్రయాణాం శుశ్రూషా పరమం తప ఉచ్యతే
నతై రనభ్యనుజ్ఞాతో ధర్మమన్యం సమాచరేత్
త ఏవ హి త్రయోలోకా స్త ఏవ త్రయ ఆశ్రమాః
త ఏత హి త్రయోవేదా స్త ఏవోక్తా స్త్రయోగ్నయః
ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యా చ మధ్యమమ్
గురుశుశ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే
సర్వేతస్యాదృతాధర్మాః యస్యైతే త్రయ ఆదృతాః
అనాదృతాస్తు యస్యైతే సర్వా స్తస్యాఫలా క్రియాః

మాతాపితరులను గురువును సేవించుటవలన కలుగు ఫలితము ఇట్లు చెప్పబడినది —

ఆచార్యుని, తండ్రిని, తల్లిని, అన్నను, ఎంతటి కష్టసమయము వచ్చినను అవమానించరాదు. బాధించరాదు. ఈవిషయమును బ్రాహ్మణుడు ప్రత్యేకముగ గుర్తించవలయును. ఆచార్యుడు బ్రహ్మస్వరూపుడు. తండ్రి సృష్టికర్తయైన ప్రజాపతి స్వరూపుడు. తల్లి భూమివంటిది. అన్న తనస్వరూపుడు. పుత్రులు కల్గినపుడు తల్లి దండ్రులుపడు శ్రమ నూరు సంవత్సరములు సేవించినను తీరదు అందుచే తల్లిదండ్రులకు ఆచార్యునకు సంతసము కల్గునట్లుగ ఎల్లప్పుడు ప్రవర్తించ వలయును. వారు ముగ్గురు సంతసించిన తపస్సు పరిసమాప్తియగును. వారి సేవయే గొప్ప తపస్సుగ చెప్పబడినది. వారి యనుజ్ఞలేక ఏ యితర ధర్మమును ఆచరించరాదు. వారు ముగ్గురు మూడులోకములవంటివారు. మూడు ఆశ్రమముల వంటివారు. మూడు వేదములు, మూడుఅగ్నులు అయియున్నారు.

మాతృసేవచే ఈ లోకమును, పితృసేవచే మధ్యలోకమును, గురు సేవచే బ్రహ్మలోకమును పొందును. ఈ లోకమును పొందుట అనగా ఈ లోకమునందలి సుఖభోగములను పొందుట. వీరి ముగ్గురిని ఆదరించిన వారు అన్నిధర్మములను చేసినవారగుదురు. ఇవి చేయనివారు ఎన్ని చేసియు చేయనివారగుదురు.

శ్రద్దధానః శుభాం విద్యా మాదధీతా వరాదపి
అంత్యాదపి పరం ధర్మం స్త్రీరత్నం దుష్కులాదపి
విషాదప్యమృతం గ్రాహ్యం బాలాదపి సుభాషితమ్
అమిత్రాదపి సద్వృత్త మమేధ్యాదపి కాంచనమ్
స్త్రియోరత్నా వ్యథోవిద్యా ధర్మ శ్శౌచం సుభాషితమ్
వివిధాని చ శిల్పాని సమాదేయాని సర్వతః

### మంచిని గ్రహించవలసిన విధము :

శుభకరమైన విద్యను చిన్నవానినుండియు శ్రద్ధతో గ్రహించవలయును. తక్కువవానినుండియు శ్రేష్ఠమైన ధర్మమును, నీచకులము నుండియు శ్రేష్ఠమైన స్త్రీని గ్రహించవచ్చును. విషమునుంచి అమృతమును, బాలునినుంచి మంచిమాటను, శత్రువునుండి మంచిని, అశుచి పదార్థమునుండి బంగారమును గ్రహించవచ్చును స్త్రీలు, రత్నములు, విద్య, ధర్మము, శౌచము, మంచిమాట. శిల్పవిశేషములు అందరినుండి గ్రహించవచ్చును.

ఇది రెండవ యధ్యాయము

# మూడవ యధ్యాయము

ఈ యధ్యాయమునందు గృహస్థాశ్రమ ధర్మములు చెప్పబడు చున్నవి.

అసపిండా చ యా మాతురసగోత్రా చ యా పితుః
సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే
నోద్వహేత్కపిలాం కన్యాం నాధికాంగీం న రోగిణీమ్
నాలోమికాం నాతిలోమాం న వాచాలాం న పింగలాం
నర్‌క్షవృక్షనదీనామ్నీం నాంత్యపర్వతనామికామ్
అవ్యంగాంగీం సౌమ్య నామ్నీం హంసవారణగామినీం
తనులోమకేశదశనాం మృద్వంగీ ముద్వహేత్ స్త్రియమ్
యస్యాస్తు న భవేద్భ్రాతా న విజ్ఞాయేత వా పితా
నోపయచ్ఛేత తం ప్రాజ్ఞః పుత్రికా ధర్మశంకయా

వివాహమాడతగిన కన్యాలక్షణముల నిట్లు చెప్పెను —

తల్లి వంశమునకుచెందనిదియు తండ్రిగోత్రమునకు చెందనిదియు నగు కన్య వివాహమాడతగినది. కపిలవర్ణము కలదియు, అధికాంగము గలదియు, రోగగ్రస్తురాలును, బహుపరుషభాషిణియు. అధికముగ వెంట్రుకలు గలదియు, వెంట్రుకలులేనిదియుయగు కన్యను వివాహమాడ రాదు. నక్షత్రముల, వృక్షముల, నదులపేర్లు గలదియు, పర్వతాలపేర్లు గలదియు, సర్పాదులపేరు గలదియు, భయంకరనామము గలదియు అగు కన్యను వివాహమాడరాదు. అవికలములయిన అవయవములు గలదియు,

సౌమ్యమైన పేరుగలదియు, హంసవలె నడుచునదియు, చిన్న వెంట్రుకలు దంతములు గలదియు, మృదువైన శరీరము గలదియునగు కన్యను వివాహమాడవలయును సోదరులు లేనిదియు అజ్ఞాతపితగలదియు అగు కన్యను వివాహమాడరాదు.

బ్రాహ్మోదైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాసురః
గాంధర్వో రాక్షసశ్చైవ, పైశాచశ్చాష్టమోఽధమః
ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయమ్
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మోధర్మః ప్రకీర్తితః
యజ్ఞేతు వితతే సమ్యగృత్విజే కర్మ కుర్వతే
అలంకృత్య సుతాదానం దైవం ధర్మం ప్రచక్షతే
ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః
కన్యా ప్రదానం విధివదార్షోధర్మః స ఉచ్యతే
సహోభౌ చరతాం ధర్మమితి వాచానుభాష్య చ
కన్యాప్రదానమభ్యర్చ్య ప్రాజాపత్యో విధిఃస్మృతః
జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయైచైవ శక్తితః
కన్యాప్రదానం స్వాచ్ఛంద్యా దాసురోధర్మ ఉచ్యతే
ఇచ్ఛయాన్యోన్య సంయోగః కన్యాయాశ్చ వరస్య చ
గాంధర్వ స్సతు విజ్ఞేయో మైథున్యః కామసంభవః
హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశంతీం రుదతీం గృహాత్
ప్రసహ్య కన్యాహరణం రాక్షసో విధి రుచ్యతే
సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్ర స గచ్ఛతి
సపాపిష్ఠో వివాహానాం పైశాచః ప్రథితోఽధమః

వివిధములైన వివాహములు వాని గుణదోషములు చెప్పబడుచున్నవి.

వివాహములు బ్రాహ్మము, దైవము. ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము అని ఎనిమిదివిధములు విద్యాచారములుగల వరుని స్వయముగ పిలచి వస్త్రాదులచే నలంకరించి కన్యనుగూడ నలంకరించి దానము చేయుట బ్రాహ్మవివాహము.

యజ్ఞము చేయించిన ఋత్విక్కునకు సాలంకృత కన్యాదానము చేయుట దైవవివాహము

ఒక గోమిధునమునుగాని, రెండింటినిగాని తన ధర్మకార్య నిమిత్తము వరునివలన గ్రహించి కన్యనిచ్చుట ఆర్షవివాహము.

మీరిద్దరు ధర్మాచరణము చేయుడు అని చెప్పి పూజించి కన్య నిచ్చుట ప్రాజాపత్యము.

కన్యయొక్క పితరులకుగాని జ్ఞాతులకుగాని, కన్యకుగానిశక్త్యను సారము ధనమునిచ్చి స్వేచ్ఛగా వివాహము చేసుకొనుట ఆసురవివాహము

వధూవరులు తమ యిష్టము ననుసరించి వివాహము చేసుకొనుట కామసంభవమైన గాంధర్వ వివాహము.

కన్యకు సంబంధించినవారిని చంపియు ఛేదించియు, భేదించియు ఏడ్చుచున్న కన్యను బలాత్కారముగ గృహమునుండి తీసుకొనివచ్చి వివాహమాడుట రాక్షస వివాహము.

నిద్రించుదానిని ప్రమత్తురాలిని స్పృహలేనిదానిని బలాత్కారముగ అనుభవించుట పైశాచ వివాహము అది అన్ని వివాహములలోనికి అధమము. పాపిష్ఠది.

దశపూర్వాన్ పరాన్ వంశ్యా నాత్మానం చైకవింశకమ్
బ్రాహ్మీపుత్రః సుకృతకృన్మోచయత్యేనసః పితౄన్
దైవోఢజః సుతశ్చైవ సప్తసప్తపరావరాన్
ఆర్షోఢజ స్త్రీంస్త్రీన్ షట్ షట్ కాయోఢజ స్సుతః

బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవానుపూర్వశః
బ్రహ్మవర్చసినః పుత్రా జాయంతే శిష్ట సమ్మతాః
రూపసత్వ గుణోపేతా ధనవంతో యశస్వినః
పర్యాప్తభోగా ధర్మిష్ఠా జీవంతి చ శతంసమాః
ఇతరేషు చ శిష్టేషు నృశంసానృతవాదినః
జాయంతే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషస్సుతాః
అనిందితైః స్త్రీవివాహై రనింద్యా భవతి ప్రజా
నిందితై ర్నిందితా నౄణాం తస్మాన్నింద్యాన్ వివర్జయేత్

పూర్వము చెప్పిన వివాహముల వలన కలుగు ఫలితములను చెప్పుచున్నాడు —

బ్రాహ్మవివాహమువలన జన్మించిన పుత్రుడుతనకు పదితరముల పూర్వులను, తననుంచి రాబోవు పదితరముల వంశజులను. తనను పాపమునుండి విముక్తి కలుగచేయును. అతనివంశమునందు పుట్టువారు పాపముచేయని వారగుదురు. దైవవివాహమువలన పుట్టినవాడు ఏడుతరముల పూర్వులను, రాబోవు ఏడుతరములవారిని పాపవిముక్తుల చేయును. ఆర్షవివాహమువలన కలిగినకుమారుడు మూడుతరముల పూర్వులను, మూడు తరముల పౌత్రాదులను పాపవిముక్తుల చేయును ప్రాజాపత్యము ఆరుతరముల పూర్వులను, రాబోవు ఆరుతరములవారినితరింప చేయును.

పైన చెప్పిన నాలుగు వివాహములయందు సదాచారము. బ్రహ్మవర్చస్సుగల పుత్రులు పుట్టుదురు. వీరందరు మంచిరూపము. సత్త్వగుణము గలవారై, ధనవంతులు, కీర్తివంతులుఅయి ధర్మములు చేయుచు సమృద్ధములైన భోగముల ననుభవించుచు నూరు సంవత్సరములు జీవింతురు.

మిగిలిన ఇతర వివాహములయందు నీచస్వభావముగలవారు, అసత్యము కలుగువారు, బ్రహ్మధర్మద్వేషులు పుట్టుదురు. పూజించ తగినవివాహముచే పూజించతగిన సంతానము కలుగును. అందుచే నింద్య మైన వివాహములు పనికిరావు.

ఋతుః స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః
చతుర్భిరితరైస్సార్ధమహోభిః సద్విగర్హితైః
తాసామాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా
త్రయోదశీ చ శేషాస్తు ప్రశస్తా దశరాత్రయః
యుగ్మాసు పుత్రాజాయంతే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు
తస్మాద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశే దార్తవేస్త్రియమ్
పుమాన్ పుంసోఽధికే శుక్రే స్త్రీభవత్యధికే స్త్రియః
సమే పుమాన్ పుంస్త్రియౌ వాక్షీణేఽల్పేచ విపర్యయః
నింద్యాస్వష్టాసు చాన్యాసు స్త్రియోరాత్రిషు వర్జయన్
బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్

ఋతుధర్మమునుండి పదియారురోజులు ఋతుకాలముగా చెప్పబడినది. అందు మొదటి నాలుగుదినములు విడిచిపెట్టతగినవి. ఏకాదశియు త్రయోదశియుగూడ విడిచిపెట్ట తగినవి. మిగిలిన పదిరాత్రులు ప్రశస్తమైనవి. అందును సరిసంఖ్యయగు రెండు, నాలుగు మొదలగు దినములందు పుత్రులు, బేసిదినములగు ఒకటి మూడు దినములందు పుత్రికలు జన్మింతురు. కావున పుత్రులనుకోరినవాడు సరిదినములందే స్త్రీ సంగమమున ప్రవర్తించవలయును. పురుషుని శుక్రము అధికమైనపుడు పురుషసంతానము, స్త్రీబీజమధికమైనపుడు స్త్రీసంతానమును రెండు సమమైనపుడు నపుంసకుడుగాని కవలపిల్లలుగాని జన్మింతురు. ఈ విధమైన నియమములు పాటించినపుడు గృహస్థుడును వానప్రస్థుడును బ్రహ్మచారియే యగుచున్నాడు.

న కన్యాయాః పితా విద్వాన్ గృహ్ణీయాచ్ఛుల్కమణ్వపి
గృహ్ణన్ఛుల్కం హి లోభేన స్యాన్నరోఽపత్యవిక్రయీ
స్త్రీధనాని తు యే మోహా దుపజీవంతి బాంధవాః
నారీయానాని వస్త్రం వా తే పాపా యాంత్యధోగతిమ్
ఆర్షే గోమిథునం శుల్కం కేచిదాహుర్మృషైవ తత్
అల్పోప్యేవం మహాన్ వాపి విక్రయస్తావదేవ సః
యాసాం నాదదతే శుల్కం జ్ఞాతయో న స విక్రయః
అర్హణం తత్కుమారీణా మానృశంస్యం చ కేవలమ్
కన్యావిక్రయమును ఈ విధముగ నిషేధించుచున్నాడు :

పండితుడైన తండ్రి కన్యనిచ్చి కొంచెమైనను శుల్కము గ్రహించరాదు. ఏ కొంచెము గ్రహించినను సంతానవిక్రయము చేసిన వాడగును. స్త్రీధనము నిమిత్తము చేసుకొని జీవించువారు. భోగము లనుభవించువారు అధోగతిని పొందుదురు. ఆర్షవివాహమునందు గోమిథునము గ్రహించవచ్చునని కొందరు చెప్పిరి. అది నిజము గాదు. కొంచమైనను అది విక్రయమే యగును. వరునిబంధువులు కన్యకిచ్చిన ధనము విక్రయము క్రిందకు రాదు. కన్యలకు ధనమిచ్చుట వారిని గౌరవించినటుల, పూజించినటులే యగును.

**విశేషము :** ఆర్ష వివాహమునుగూర్చి చెప్పుచు మనువు పూర్వము ఒకటిగాని రెండుగాని గోమిథునములు గ్రహించుట ఆర్షవివాహ లక్షణమని చెప్పెను, అది ఆర్షవివాహలక్షణమేగాని అది మనువునకు ఇష్టమైనదికాదు. అందుచే పూర్వాపర విరోధములేదు.

పితృభిర్భ్రాతృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభిః

యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః
శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్
నశోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా
జామయో యానిగేహాని శపంత్య ప్రతిపూజితాః
తాని కృత్యా హతానీవ వినశ్యంతి సమంతతః
తస్మాదేతా సదా పూజ్యా భూషణాచ్ఛాదనాశనైః
భూతికామైర్నరైర్నిత్యం సత్కారేషూత్సవేషు చ

స్త్రీకి చేయవలసిన ఆదరసత్కారములగురించి మనువు విశేషముగ చెప్పినాడు.

శుభమునుకోరిన తండ్రి, సోదరుడు, భర్త, మరది మొదలగు వారందరిచేత స్త్రీలు గౌరవించతగియున్నారు. స్త్రీలను పూజించుగృహములందు దేవతలు సంతోషముతో నివసింతురు వారినిగౌరవించని గృహములందు జరుగు పుణ్యకార్యములన్నియు నిష్ప్రయోజనము లగును.

జామలు, యనగసోదరికులమునందు పుట్టినస్త్రీలు, మేనకోడండ్రు మొదలయినవారు, వారిని బాధించుకులము నశించును. వారిని సంతోషపెట్టు కులము వృద్ధిచెందును. వీరందరు గౌరవించబడనివారై శపింతురు. వారి శాపము పొందిన కులము అభిచారశాపము తగిలినటుల నశించును. అందుచే వీరందరిని ఆభరణములచేత, వస్త్రములచేత, భోజనములచేత ఉత్సవసమయములందు పండుగలయందు సత్కరించవలసి యున్నది. ఐశ్వర్యము కోరినవారికిది తగిన విషయము.

సంతుష్టోభార్యయా భర్తా భర్త్రా భార్యా తథైవ చ
యస్మిన్నేవ కులే నిత్యం కల్యాణం తత్ర వై ధ్రువమ్

యది హి స్త్రీ నరోచేత పుమాంసం న ప్రమోదయేత్
అప్రమోదాత్పునః పుంసః ప్రజనం న ప్రవర్తతే
స్త్రియాంతు రోచమానాయాం సర్వం తద్రోచతే కులమ్
తస్యాం త్వరోచమానాయాం సర్వ మేవ నరోచతే

దాంపత్య ధర్మము నిట్లు చెప్పుచున్నాడు —

భార్యను చూచి భర్తయు, భర్తనుచూచి భార్యయు సంతసించు గృహమునందు శుభములు నిశ్చయముగ జరుగును. భర్తనుచూచి భార్య సంతసించనిచో భార్యనుచూచి భర్తయు సంతసించలేడు. అపుడు వారికి సంతానము కలుగదు. స్త్రీ సంతసించినచో ఆ గృహమంతయు సంతసించును ఆమె సంతసించనిచో గృహమంతయు సంతోషరహితమగును

ఆయాజ్య యాజనైశ్చైవ నాస్తిక్యేన చ కర్మణామ్
కులాన్యాశు వినశ్యంతి యాని హీనాని మంత్రతః
మంత్రతస్తు సమృద్ధాని కులాన్యల్పధనాన్యపి
కులసంఖ్యాం చ గచ్ఛంతి కర్షంతి చ మహద్యశః

కులాభివృద్ధిని గురించి యిట్లు చెప్పెను ....

యోగ్యతలేనివారిచే సత్కర్మలు చేయించుటచేత, తాను సత్కర్మలు చేయకపోవుటచేత కులనాశనము జరుగును. మంత్రసమృద్ధిగల కులములు ధనహీనము లయినప్పటికి ఉన్నతకులములే యగును. మహత్తరమైన కీర్తిని సంపాదించును.

అధ్యాపనం బ్రహ్మయజ్ఞః పితృయజ్ఞస్తు తర్పణమ్
హోమోదైవో బలిర్భౌతో నృయజ్ఞోఽతిథిపూజనమ్
పంచైతాన్ మహాయజ్ఞా న్నహాపయతి శక్తితః
స గృహేఽపి వసన్నిత్యం సూనాదోషైర్నలిప్యతే

దేవతాతిధి భృత్యానాం పితౄణా మాత్మన శ్చయః
న నిర్వపతి పంచానా ముచ్ఛ్వస న్న సజీవతి
స్వాధ్యాయే నిత్యయుక్త స్స్యాద్దైవే చైవేహ కర్మణి
దైవకర్మణి యుక్తో హి బిభర్తీదం చరాచరమ్
అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్యగాదిత్య ముపతిష్ఠతే
ఆదిత్యాజ్జాయతే వృష్టి ర్వృష్టేరన్నం తతః ప్రజాః

గృహస్థుని కర్తవ్యము నిట్లు బోధించుచున్నాడు :-

చదువు చెప్పుట బ్రహ్మయజ్ఞము, తర్పణముచేయుట పితృయజ్ఞము హోమము దైవయజ్ఞము, బలిదానము భూతయజ్ఞము, అతిధిపూజ మనుష్యయజ్ఞము, ఈ అయిదుయజ్ఞములను శక్తిననుసరించి చేయు గృహస్థునకు సూనాదిదోషములు అనగా పాకాదులవలన కలుగు హింసాది దోషములు కలుగవు. ఆ విధముగ దేవతాతిథిపితరులకు అర్చన చేయనివాడు జీవించియు, జీవించనివాడే యగును. వేదాధ్యయనమునందు దైవకర్మ యందును ప్రవర్తించి గృహస్థుడు చరాచరమైన ప్రపంచము నంతయు భరించినవాడగును. అగ్నియందు చేసిన హోమము సూర్యుని చేరును. సూర్యునివలన వర్షము కురియును వర్షమువలన అన్నము, అన్నమువలన ప్రజలు సంభవింతురు.

యథావాయుం సమాశ్రిత్య సర్వే జీవంతి జంతవః
తథా గృహస్థ మాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః
యస్మాత్త్రయో ప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహమ్
గృహస్థేనైవ ధార్యంతే తస్మా జ్జ్యేష్ఠాశ్రమో గృహీ
ఋషయో పితరో దేవా భూతాన్యతిథయస్తథా
ఆశాసతే కుటుంబిభ్య స్తేభ్యః కార్యం విజానతా

గృహస్థాశ్రమ వైశిష్ట్యము చెప్పుచున్నాడు :

ప్రాణులన్నియు వాయువునాశ్రయించి జీవించినటుల ఆశ్రమ వాసులందరు గృహస్థునాశ్రయించి జీవించుచున్నారు. మిగిలిన మూడు ఆశ్రమములవారు గృహస్థుచేతనే జ్ఞానాన్నప్రదానములచే పోషించ బడుచున్నారు. అందుచే గృహస్థాశ్రమము మిగిలిన ఆశ్రమములకంటె శ్రేష్ఠమైనది. మునులు, పితరులు, దేవతలు, మిగిలిన ప్రాణులుగూడ గృహస్థులనే ఆశించుచున్నారు.

శునాంచ పతితానాం చ శ్వపచాం పాపరోగిణామ్
వాయసానాం కృమీణాం చ శనకైర్నిర్వపేద్భువి
ఏవం యస్సర్వభూతాని బ్రాహ్మణో నిత్యమర్చతి
స గచ్ఛతి పరం స్థానం తేజోమూర్తిః పథర్జునా
కృత్వైతద్బలి కర్మైవ మతిథిం పూర్వమాశయేత్
భిక్షాం చ భిక్షవే దద్యాద్విధివద్బ్రహ్మచారిణే
యత్పుణ్యఫల మాప్నోతి గాం దత్వా విధివద్గురోః
తత్పుణ్యఫల మాప్నోతి భిక్షాం దత్వా ద్విజోగృహీ

శునకములకు, పతితులకు, పాపులకు, రోగులకు, కాకులకు పరిశుద్ధమైన భూమిపై భోజనము పెట్టవలయును. ఈ విధముగ సర్వ భూతములను పూజించినవాడు తేజస్వరూపుడై ఋజుమార్గముచేత ఉత్కృష్ట స్థానమును పొందుచున్నాడు. ఈ విధముగ బలికర్మచేత ముందుగ అతిథికి భోజనము పెట్టవలయును పిమ్మట భిక్షువునకు బ్రహ్మచారికి పెట్టవలయును. శాస్త్రప్రకారము గురువునకు గోదానము చేసిన పుణ్యము భిక్షము పెట్టుటచేత లభించుచున్నది.

విద్యాతప స్సమృద్ధేషు హుతం విప్రముఖాదిషు
విస్తారయతి దుర్గాచ్చ మహతశ్చైవ కిల్బిషాత్

సంప్రాప్తాయ త్వతిథయే ప్రదద్యా దాసనోదకే
అన్నం చైవ యథాశక్తి సత్కృత్య విధి పూర్వకమ్
తృణాని భూమిరుదకం వాక్చతుర్థీ చ సూనృతా
ఏతాన్యపి సతాం గేహే నోచ్ఛిద్యంతే కదాచన
ఏకరాత్రం తు నివసన్నతిథిర్బ్రాహ్మణః స్మృతః
అనిత్యం హి స్థితో యస్మాత్తస్మా దతిథి రుచ్యతే
ఉపాసతే యే గృహస్థాః పరపాక మబుద్ధయః
తేన తే ప్రేత్య పశుతాం వ్రజంత్యన్నాది దాయినామ్

అతిథి పూజా విశేషము చెప్పబడినది :

విద్యాతపస్సులు గలవారికి పెట్టిన భోజనము మహత్తరమైన పాపమునుండి తరింపచేయును. ఇంటికి వచ్చిన అతిథికి ఆసనము, ఉదకము, భోజనము శాస్త్రప్రకారము గౌరవించి యథాశక్తి పెట్టవలయును. ఆసనము, పాదప్రక్షాళనార్థము నీరు, సత్యవాక్యము సత్పురుషుల గృహములందు ఎప్పుడు లోపించవు ఒకరాత్రి కాలమే నివసించువానిని అతిథి యందురు. తిథియంతయు యుండనివాడు కావుననే అతిథియని చెప్పబడుచున్నాడు బుద్ధిలేని గృహస్థులు పరగృహములకు వెళ్ళి అచ్చటనే భోజనము చేయుటకు అలవాటు పడినచో వారు మరు జన్మలో అన్నముపెట్టిన వారింటిలో పశువులై జన్మింతురు.

నవై స్వయం తదశ్నీయా దతిథిం యన్నభోజయేత్
ధన్యం యశస్య మాయుష్యం స్వర్గ్యం వా తిథిపూజనమ్
ఇతరావపి సఖ్యాదీన్ సంప్రీత్యా గృహమాగతాన్
ప్రకృత్యాన్నం యథాశక్తి భోజయేత్సహ భార్యయా

సువాసినీః కుమారీశ్చ రోగిణో గర్భిణీః స్త్రియః
అతిథిభ్యోఽగ్ర ఏవై తాన్ భోజయే దవిచారయన్
అదత్వాతు య ఏతేభ్యః పూర్వం భుంక్తే విచక్షణః
స భుంజానో న జానాతి శ్వగృధ్రై ర్జగ్ధి మాత్మనః
భుక్త వత్స్వథ విప్రేషు స్వేషు భృత్యేషు చైవహి
భుంజీయాత్తతః పశ్చాదవశిష్టం తు దంపతీ
అతిథిపూజలయందుగల భేదము చెప్పబడుచున్నది :-

అతిథికి పెట్టక తాను తినరాదు. అతనికి పెట్టినభోజనము, ధనమును కీర్తిని, ఆయువును, స్వర్గమునుగూడ కల్గించును ఇంటికి వచ్చిన ఇతర బంధువులనుగూడ ప్రీతితో యథాశక్తి భోజనముపెట్టి సత్కరించవలయును. క్రొత్తగా వివాహమాడిన సువాసినీస్త్రీలకు, బాలికలకు, రోగులకు, గర్భిణిస్త్రీలకు అతిథులకంటె ముందుగానే భోజనము పెట్టవలయును. వీరికిపెట్టకుండ భుజించినవారు రాబోవు జన్మలో తనను కుక్కలు, గ్రద్దలు తినునని తెలిసికొనలేకున్నాడు. బ్రాహ్మణులు, భృత్యులు తినినపిమ్మటనే గృహస్థుడు మిగిలినదానిని భార్యతోగలసి తినవలయును. దీనివలన మనువునకు సేవకులయందుగల ఆదరము తెలియుచున్నది.

శ్రోత్రియాయైవ దేయాని హవ్య కవ్యాని దాతృభిః
అర్హత్తమాయ విప్రాయ తస్మై దత్తం మహాఫలమ్
ఏకైకమపి విద్వాంసం దైవే పిత్ర్యేచ భోజయేత్
పుష్కలం ఫల మాప్నోతి నామంత్రజ్ఞాన్ బహూనపి
దూరాదేవ పరీక్షేత బ్రాహ్మణం వేదపారగమ్
తీర్థం తద్ధవ్య కవ్యానాం ప్రదానే సోఽతిథిః స్మృతః
సహస్రం హి సహస్రాణా మనృచాం యత్ర భుంజతే

ఏకస్తా న్మంత్రవిత్ప్రీతః సర్వానర్హతి ధర్మతః
జ్ఞాన నిష్ఠాః ద్విజాః కేచి త్తపో నిష్ఠాస్తథాఽపరే
జ్ఞాన నిష్ఠేషు కవ్యాని ప్రతిష్ఠాప్యాని యత్నతః
హవ్యాని తు యథాన్యాయం సర్వేష్వేషు చతుర్ష్వపి

**హవ్యకవ్యముల యందుభో క్తల తారతమ్యమును చెప్పుచున్నాడు.**

దేవతల ప్రీతికై ఇచ్చునది హవ్యమనియు పితరుల ప్రీతికై యిచ్చునది కవ్యమనియు చెప్పబడును. హవ్యకవ్యములను వేదాధ్యయనము చేసినవారికి ఇవ్వవలయును. యోగ్యున కిచ్చినది, విశేషఫలము నిచ్చును. మంత్రహీనులను అనేకులను అర్చించుటకంటె మంత్ర వేత్తను ఒకరిని భోజనముచే అర్చించుట శ్రేష్ఠము. వేదాధ్యయనము చేసినవానిని దూరమునుండియే గుర్తించవలయును. హవ్యకవ్యములకు యోగ్యుడయిన అతిధిగా వతనే చెప్పబడినాడు. మంత్ర విహీనులకు వేలకొలదిమందికి భోజనముపెట్టుటకంటె ఒక వేదవేత్తకుపెట్టుట శ్రేష్ఠము. బ్రాహ్మణులు జ్ఞాననిష్ఠులు, తపోనిష్ఠులు, స్వాధ్యాయనిష్ఠులు, కర్మ నిష్ఠులు అని నాలుగు విధములుగా నుందురు. జ్ఞాననిష్ఠులకే కవ్యమును సమర్పింపవలయును. హవ్యమును యీ నలుగురియం దెవరికైనను సమర్పింపవచ్చును.

పూర్వేద్యురపరేద్యుర్వా శ్రాద్ధకర్మణ్యుపస్థితే
నిమంత్రయేత త్ర్యవరాన్ సమ్యగ్విప్రాన్ యథోదితాన్
నిమంత్రితో ద్విజః పిత్ర్యేనియతాత్మా భవేత్సదా
న చ ఛందాంస్యధీయాత యస్య శ్రాద్ధం చ తద్భవేత్
నిమంత్రితాన్ హి పితర ఉపతిష్ఠంతి తాన్ ద్విజాన్
వాయువచ్చానుగచ్ఛంతి తథాసీనా నుపాసతే

శ్రాద్ధమునకు ముందురోజునగాని, శ్రాద్ధమురోజునగాని తగిన బ్రాహ్మణులను ముగ్గురకు తగ్గకుండ పిలువవలయును. నిమంత్రితుడైన బ్రాహ్మణుడు నియమముగలవాడై యుండవలయును నిత్యజపాదులను మాత్రమే చేయవలయును. వేదాధ్యయనము చేయరాదు. కర్తయు ఇటులనే యుండవలయును. నిమంత్రితులయిన బ్రాహ్మణులను పితరులు వాయురూపమున ఆశ్రయించి యుందురు.

యదేవ తర్పయత్యద్భిః పితౄన్ స్నాత్వా ద్విజోత్తమః
తేనైవ కృత్స్నమాప్నోతి పితృయజ్ఞ క్రియాఫలమ్
వసూన్ వదంతి తు పితౄన్ రుద్రాంశ్చైవ పితామహాన్
ప్రపితామహాం స్తథాదిత్యాన్ శ్రుతిరేషాసనాతనీ

స్నానానంతరము చేసిన తర్పణముచేతనే పితృయజ్ఞఫలమంతయు వచ్చును. సనాతనమైన వేదము పితరులను వసువులనియు, పితామహులను రుద్రులనియు, ప్రపితామహులను ఆదిత్యులనియు చెప్పుచున్నది.

ఇది మూడవ యధ్యాయము

# నాలుగవ యధ్యాయము

చతుర్థ మాయుషో భాగ ముషిత్వాఽఽద్యం గురౌ ద్విజః
ద్వితీయ మాయుషో భాగం కృతదారో గృహే వసేత్
అద్రోహేణైవ భూతానా మల్పద్రోహేణ వా పునః
యా వృత్తిస్తాం సమాస్థాయ విప్రో జీవే దనాపది
యాత్రా మాత్ర ప్రసిద్ధ్యర్థం స్వైకర్మభిరగర్హితైః
అక్లేశేన శరీరస్య కుర్వీత ధనసంచయమ్

గార్హస్థ్య జీవన విదానము చెప్పబడుచున్నది :

గురుగృహమునందు ఆయువునందలి మొదటినాలుగవ భాగమును గడపవలయును. పిమ్మట వివాహితుడై ద్వితీయభాగమును గృహమునందు గడపవలయును. ఏ ప్రాణికి ఎటువంటి బాధ కల్గించకయే జీవించవలయును. అది సాధ్యము కానిచో సాధ్యమైనంత తక్కువ బాధ కలుగునట్లు చూడవలయును. జీవయాత్ర గడుపుటకు వలసినంత ద్రవ్యమును యోగ్యములగు పనులచేత శరీరమునకు బాధ కలుగనట్లుగ సంపాదించవలయును,

"అల్పద్రోహమనగ వివరణము :- ఇతరులనుండి ధనము తీసుకొనునప్పుడు ఇతరులకు బాధకలుగును. ఆ బాధను తగినంత తగ్గించుటకై చేతనైనంత తక్కువ తీసుకొనవలయును.

ఋతా మృతాభ్యాం జీవేత్తు మృతేన ప్రమృతేన వా
సత్యానృతాభ్యా మపి వా న శ్వవృత్యా కదాచన
ఋత ముంఛశిలం జ్ఞేయ మమృతం స్యా దయాచితమ్

మృతంతు యాచితం భైక్షం ప్రమృతం కర్షణం స్మృతమ్
సత్యానృతం తు వాణిజ్యం తేన చైవాపి జీవ్యతే
సేవా శ్వవృత్తిరాఖ్యాతా తస్మాత్తాం పరివర్జయేత్

వృత్తిధర్మములు చెప్పబడుచున్నవి :

రోటిదగ్గరగాని, మార్గమునందుగాని, పొలమునందుగాని ఎవరు ఆశించనిధాన్యమును ప్రేళ్ళతో ఏరి తెచ్చుకొనుట ఉంఛవృత్తి. ఆటుల గాక కంకులను తెచ్చుకొనుట శిలావృత్తి. అయాచితముగ వచ్చినది అమృతము. యాచించగా వచ్చినది మృతము. వ్యవసాయము చేయుట ప్రమృతము. సత్యానృతము వాణిజ్యము. ఈ పైన చెప్పిన వృత్తులలో ఒకదానికంటె మరియొకటి ఉత్తరోత్తరము హీనమైనది. అవకాశము ననుసరించి ఈయన్ని వృత్తులచేతను జీవించవచ్చునుకాని శ్వవృత్తిచే మాత్రము జీవించరాదు. శ్వవృత్తి యనగా నితరులకు సేవచేయుట.

న లోకవృత్తం వర్తేత వృత్తిహేతోః కథంచన
అజిహ్మా మశఠాం శుద్ధాం జీవేద్బ్రాహ్మణ జీవికామ్
సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతో భవేత్
సంతోషమూలం హి సుఖం దుఃఖమూలం విపర్యయః
అతోఽన్యతమా వృత్త్యా జీవంస్తు స్నాతకో ద్విజః
స్వర్గాయుష్య యశస్యాని వ్రతానీమాని ధారయేత్

జీవికకొరకు లోకవృత్తమును అనుసరించి అనగా విచిత్రపరిహాస కథాచికములు చెప్పుచు జీవించరాదు, కౌటిల్యములేని పరిశుద్ధ వృత్తిని ఆశ్రయించవలయును. సుఖమును గోరినవాడై నియమముల నాచరించుచు సంతోషముతో నుండవలయును సంతోషమువలనవచ్చునదే

సుఖము, సంతోషము లేకపోవుటయే దుఃఖము, ఈ పైన చెప్పిన వృత్తులతో జీవించుచు స్వర్గమును, ఆయువును కీర్తిని కలిగించు వ్రతాదులను చేయవలయును.

వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యా దతింద్రితః
తద్ధికుర్వన్ యథాశక్తి ప్రాప్నోతి పరమాం గతిమ్
ఇంద్రియార్థేషు సర్వేషు న ప్రసజ్యేత కామతః
అతి ప్రసక్తిం చైతేషాం మనసా సంనివర్తయేత్
సర్వాన్ పరిత్యజేదర్థాన్ స్వాధ్యాయస్య విరోధినః
యథా తథాఽధ్యాపయంస్తు సా హ్యస్య కృతకృత్యతా
వయసః కర్మణోఽర్థస్య శ్రుతస్యాభిజనస్య చ
వేషవాగ్బుద్ధి సారూప్య మాచరన్ విచరే దిహ

అలసత లేనివాడై వేదోక్త కర్మను నిత్యము చేయవలయును. దానిని యథాశక్తి చేయుచు ఉత్కృష్టగతిని పొందును. ఇంద్రియవాంఛలయందు అతిగా ప్రవర్తించరాదు. మనస్సును నియమించు కొనవలయును వేద విరోధములగు ధనసంపాదన విషయము లన్నియు విడిచిపెట్టవలయును. సాధ్యమైనంతవరకు వేద ప్రవచనము చేయుచుండవలయును. అదియేకదా జన్మకు సార్థకము. వయస్సునకు, కర్మకు, ధనమునకు, పాండిత్యమునకు, వంశమునకు తగినవేషము, మాట, తెలివిగలవాడై లోకమునందు సంచరించవలయును.

బుద్ధి వృద్ధి కరాణ్యాశు ధన్యాని చ హితాని చ
నిత్యం శాస్త్రాణ్యవేక్షేత నిగమాంశ్చైవ వైదికాన్
యథా యదా హి పురుషః శాస్త్రం సమధిగచ్ఛతి
తథా తథా విజానాతి విజ్ఞానం చాస్య రోచతే

ఋషియజ్ఞం దేవయజ్ఞం భూత యజ్ఞం చ సర్వదా
నృయజ్ఞం పితృయజ్ఞం చ యథాశక్తి నహాపయేత్

బుద్ధిని వృద్ధి చేయునటువంటియు, ధనమును, హితమును కలుగ చేయునటువంటి వైదికములయిన శాస్త్రములను ప్రతిదినము పఠించవలయును. శాస్త్రమును చదివిన కొలదియు పురుషుడు విజ్ఞానమును సంపాదించును. శాస్త్రము మిక్కిలి సంతోషము కలిగించును 'ఋషి యజ్ఞమును, దేవయజ్ఞమును భూతయజ్ఞమును, మనుష్యయజ్ఞమును పితృయజ్ఞమును యథాశక్తి చేయవలయును.

ఆసనాశనశయ్యాభి రద్భిర్మూలఫలేన వా
నాస్య కశ్చిద్వసేద్గేహే శక్తితోఽనర్చితోఽతిథిః
వేదవిద్యా వ్రతస్నాతాన్ శ్రోత్రియాన్ గృహమేధినః
పూజయే ద్ధవ్య కవ్యేన విపరీతాంశ్చ వర్జయేత్
శక్తితోఽపచమానేభ్యో దాతవ్యం గృహమేధినా
సంవిభాగశ్చ భూతేభ్యః కర్తవ్యోఽనుపరోధతః

ఆసనము, భోజనము, శయ్య, మంచినీరు, ఫలములు మొదలగు వానిచేత నర్చించబడక యతిథి గృహస్థుని గృహమునందుండరాదు. వేదవిద్యారతులను, విద్యాధికులను, శ్రోత్రియులను హవ్యకవ్యములచే పూజించవలయును. ఇతరులను విడిచిపెట్టవలయును. వంటచేసుకొనని బ్రహ్మచారి, పరివ్రాజకుడు మొదలగువారికి విభాగముచేసి యథాశక్తి భోజనము పెట్టవలయును.

న సీదేత్ స్నాతకో విప్రః క్షుధాశక్తః కథంచన
న జీర్ణమలవద్వాసా భవేచ్చ విభవేసతి
క్లప్తకేశనఖశ్మశ్రుర్దాంతః శుక్లాంబర శ్శుచిః

స్వాధ్యాయేచైవ యుక్తః స్యాన్నిత్య మాత్మహితేషు చ
వైణవీం ధారయే ద్యష్టిం సోదకం చ కమండులుమ్
యజ్ఞోపవీతం వేదం చ శుభే రౌక్మేచ కుండలే

స్నాతకుడైన విప్రుడు ఎప్పుడూ ఆకలిచే బాధపడరాదు సంపద యున్నచో జీర్ణమును మాసినది యగు వస్త్రమును ధరించరాదు. వెంట్రుకలు గోళ్ళు పెంచుకొనరాదు. తపఃక్లేశమును సహించుచు తెల్లని వస్త్రమును ధరించి శుచియై యుండవలయును. వేదాధ్యయనమునందును ఆత్మహితమునందును శ్రద్ధ వహించవలయును. వెదురు కఱ్ఱను, ఉదకముతో నింపిన కమండలమును, యజ్ఞోపవీతమును, వేదమును, బంగారు కుండలములను ధరించవలయును.

నేక్షేతోద్యంత మాదిత్యం నాస్తంయంతం కదాచన
నోపసృష్టం న వారిస్థం న మధ్యం నభసోగతమ్
న లంఘయే ద్వత్స తంత్రీం న ప్రధావే చ్చ వర్షతి
న నోదకే నిరీక్షేత స్వం రూప మితిధారణా
మృదం గాం దైవతం విప్రం ఘృతం మధు చతుష్పథమ్
ప్రదక్షిణాని కుర్వీత ప్రజ్ఞాతాం శ్చ వనస్పతీన్

సూర్యుని ఉదయించు చున్నప్పుడు, అస్తమించుచున్నప్పుడు, గ్రహణము పట్టినప్పుడు, ఆకాశమధ్యమున్నప్పుడు చూడరాదు. వర్షమునందు పరుగెత్తరాదు తన ప్రతిబింబమును నీటియందు చూడరాదు, అనుద్ధాతమైన మృత్తికను, ఆవును, దైవవిగ్రహమును, బ్రాహ్మణుని, నేతిని, తేనెను. చతుష్పథమును, గొప్పవియైనవృక్షములను ప్రదక్షిణము చేసి వెళ్ళవలయును.

నోపగచ్ఛే త్ప్రమత్తోఽపి స్త్రియా మార్తవ దర్శనే
సమానశయనే చైవ న శయీత తయా సహ

రజసాభిప్లుతాం నారీం నరస్య హ్యుపగచ్ఛతః
ప్రజ్ఞా తేజో బలం చక్షు రాయుశ్చైవ ప్రహీయతే
తాం వివర్జయత స్తస్య రజసా సమభిప్లుతామ్
ప్రజ్ఞా తేజో బలం చక్షు రాయుశ్చైవ ప్రవర్ధతే

ప్రమత్తుడయినను ఋతుమతియైన స్త్రీని పొందరాదు. ఆమెతో ఒక శయ్యయందైనను శయనించరాదు, ఋతుమతియైన స్త్రీని పొందిన వానికి ప్రజ్ఞ, తేజస్సు, బలము, నేత్రము, ఆయువు నశించును ఆమెను పొందనివానికి ప్రజ్ఞ, తేజస్సు, బలము, చూపు, ఆయువు పెరుగును.

నాశ్నీయాద్భార్యయా సార్ధం నైనా మీక్షేత చాశ్నతీమ్
క్షువతీం జృంభమాణాం వా న చాసీనాం యథా సుఖమ్
నాంజయంతీ స్వకే నేత్రే న చాభ్యక్తామనావృతామ్
న పశ్యే త్ప్రసవంతీం చ తేజస్కామో ద్విజోత్తమః
నాన్న మద్యా దేకవాసా న నగ్నః స్నాన మాచరేత్
న మూత్రం పథి కుర్వీత న భస్మని న గోవ్రజే
న ఫాలకృష్టే న జలే న చిత్యాం న చ పర్వతే
న జీర్ణదేవాయతనే న వల్మీకే కదాచన
న స పత్త్వేషు గర్తేషు న గచ్ఛన్నాపి చ స్థితః
న నదీతీర మాసాద్య న చ పర్వత మస్తకే
వాయ్వగ్ని విప్రమాదిత్య మపః పశ్యం స్తథైవ గాః
న కదాచన కుర్వీత విణ్మూత్రస్య విసర్జనమ్

భార్యతో గలసి భోజనము చేయరాదు. భోజనము చేయుచున్న భార్యను చూడరాదు తుమ్ముచున్నదానిని, ఆవులించుచున్నదానిని, సుఖముగా కూర్చున్నదానిని అనగా విశ్రాంతినిమిత్తమై యథేచ్ఛగా కూర్చున్న

దానిని చూడరాదు. కన్నులకు కాటుక పెట్టుకొను చున్నదానిని అభ్యంగన స్నానము చేయుచున్నదానిని వస్త్రములులేనిదానిని ప్రసవించు దానిని చూడరాదు.

ఒకే వస్త్రముతో భోజనము చేయరాదు. వస్త్రము లేకుండగ స్నానము చేయరాదు. మార్గమునందు మూత్రవిసర్జనము చేయరాదు, భస్మయందు, ఆవులమందయందు చేయరాదు, అటులనే పంటపొలము లందు, నీటియందు, అగ్నినిమిత్తముంచబడిన ఇటుకలయందు, పర్వత మునందు, శిథిలమైన దేవాలయమునందు, పుట్టయందును మూత్రవిసర్జ నము చేయరాదు ప్రాణులుగల గోతులయందు. నడచుచు, నిలువబడియు నదీతీరమునందును మూత్ర విసర్జనము చేయరాదు.

విశేష విషయము : కొందరు ధర్మశాస్త్రము కేవలము మోక్ష ప్రాప్తికే యని భావింతురు, కాని, అటులకాదు మనకు ఈ లోకమునసుఖ జీవనము చేయుటకుగూడ ధర్మశాస్త్రము ఎంతయో యుపయోగపడును.

మొదటి రెండు శ్లోకములు భార్యవిషయమున చెప్పబడిన నియ మములు. ఈ నియమముల నతిక్రమించిన భార్యవిషయమున ఏహ్య భావము కలుగవచ్చును. ప్రీతి తగ్గవచ్చును. అందులకే మనువు అంత గట్టిగ చెప్పెను. తక్కినవి ఆరోగ్యమునకు స్వదేహరక్షణకు సంబం ధించినవి ఉదాహరణము—పుట్టపైమూత్రము పోసిన లోపల ఉన్నపాము బయటికివచ్చి కరవవచ్చును. అందులకే నిషేధింప బడినది వాయువును చూడరాదు అని చెప్పెను. వాయువు కనిపించదుగదాయనిన వాయువుచే మిక్కిలి చలించుచున్న మొక్కలకు చెట్లకు ఎదురుగా చేయరాదని కుల్లూక భట్టు వ్యాఖ్యానించెను.

తిరస్కృత్యోచ్చరే త్కాష్ఠ లోష్ఠ పత్ర తృణాదివా
నియమ్య ప్రయతోవాచం సంవీతాంగోఽవ కుంఠితః

మూత్రోచ్చార సముత్సర్గం దివాకుర్యాదుదఙ్ముఖః
దక్షిణాభిముఖో రాత్రే సంధ్యయోశ్చ యథా దివా
ప్రత్యగ్నిం ప్రతిసూర్యం చ ప్రతి సోమోదకద్విజాన్
ప్రతిగాం ప్రతివాతం చ ప్రజ్ఞా నశ్యతి మేహతః

మలమూత్ర విసర్జనము చెప్పబడుచున్నది :

"శుష్కైస్తథైర్వా కాష్ఠైర్వా పర్ణైర్వేణుదలేన వా. మృణ్మయైర్భాజనైర్వాపి అంతర్థాయ వసుంధరాం" అని వాయు పురాణమున గలదు భూమిని త్రవ్వి గొయ్యిచేసి అందు మలమూత్ర విసర్జనము చేసిన పిమ్మట ఆ గోతిని కాష్ఠములతోగాని మట్టితోగాని గడ్డితోగాని కప్పవలయును ఆ రెండు పనులను మౌనముగ వస్త్రమును కప్పుకొని చేయవలయును పగటికాలమున ఉత్తరాభిముఖముగను రాత్రియందు దక్షిణాభిముఖముగను చేయవలయును. సంధ్యాసమయములందు పగటి కాలమందువలెనే చేయవలయును. అగ్నికి, సూర్యునికి, చంద్రునికి, నీటికి బ్రాహ్మణులకు, ఆవులకు, గాలికి, ఎదురుగ కూర్చొని చేయరాదు. అటుల చేసిన ప్రజ్ఞ నశించును.

విశేషము :- మనువు కేవలము మోక్షప్రదములైన విషయములను మాత్రమే చెప్పలేదు. ఈ లోకమునకు సంబంధించిన ఆరోగ్య విషయములనుగూడ చెప్పెను.

నాగ్నిం ముఖేనోపధమే న్నగ్నాం నేక్షేత చ స్త్రియమ్
నా మేధ్యం ప్రక్షిపే దగ్నౌ న చ పాదౌ ప్రతాపయేత్
నాశ్నీయా త్సంధివేలాయాం న గచ్ఛేన్నాపి సంవిశేత్
న చైవ ప్రలిఖే ద్భూమిం నాత్మనోపహరే త్స్రజమ్
నాప్సుమూత్రం పురీషం వా ష్ఠీవనం వా సముత్సృజేత్
అమేధ్యలిప్తమన్యద్వా లోహితం వా విషాణి వా

నైకః సుప్యాచ్ఛూన్యగేహే శ్రేయాంసం న ప్రబోధయేత్
నోదక్యాభిభాషేత యజ్ఞం గచ్ఛే న్నచావృతః
న వారయేద్గాం ధయంతీం న చాచక్షీత కస్యచిత్
న దివీంద్రాయుధం దృష్ట్వా కస్యచి ద్దర్శయేద్బుధః
న కుర్వీత వృథా చేష్టాం న వార్యంజలినా పిబేత్
నోత్సంగే భక్షయే ద్భక్ష్యాన్ న జాతు స్యాత్కుతూహలీ

అగ్నిని నోటితో ఆర్పరాదు. దిగంబరస్త్రీని చూడరాదు. అగ్ని యందు అశుచి పదార్థము వేయరాదు. నిప్పుతో కాళ్ళు కాచుకొనరాదు. సంధ్యాకాలమున భోజనముచేయుట, ప్రయాణముచేయుట, నిద్రించుట, పనికిరాదు. భూమిని కాలితోగీకుట, తన మెడయందలి హారమును స్వయముగ తీయుట చేయరాదు. అశుచిపదార్థమును రక్తమును విషములను నీటియందు కలుపరాదు. పాడుపడిన గృహమునందు ఒంటరిగ నిద్రించరాదు. తనకంటెను పెద్దవారిని మేల్కొల్పరాదు. రజస్వలయైన స్త్రీతో మాటాడరాదు. వరణము ఇవ్వకయే యజ్ఞమున ఋత్విక్కుగ వెళ్ళరాదు. మేయుచున్న ఆవును బయటకు తోలరాదు. ఇతరులకు చెప్పరాదు. ఇంద్రధనుస్సును చూచి దాని నెవ్వరికి చూపరాదు. వ్యర్థముగ కాలుసేతులు కదపరాదు. దోసిలితో నీరు త్రాగరాదు. భక్ష్యములనుతొడలపై నుంచుకొనితినరాదు, ప్రయోజనములేని ఏ విషయమును గురించియు తెలిసికొనుటకు ప్రయత్నించరాదు.

విశేషము : ఇందు ఆరోగ్యవిషయములు ధార్మిక విషయములు వివరముగ చెప్పబడినవి.

ఉపానహౌ చ వాసశ్చ ధృతమన్యై ర్న ధారయేత్
ఉపవీత మలంకారం స్రజం కరక మేవ చ
బాలాతపః ప్రేతధూమో వర్జ్యం భిన్నం తథాసనమ్
న ఛింద్యా న్నఖలోమాని దంతై ర్నోత్పాటయేన్నఖాన్
లోష్టమర్దీ తృణచ్ఛేదీ నఖఖాదీ చ యో నరః
స వినాశం వ్రజత్యాశు సూచకోఽశుచి రేవ చ
సర్వం చ తిలసంబద్ధం నాద్యా దస్తమితే రవౌ
న చ నగ్న శ్శయీతేహ న చోచ్ఛిష్టః క్వచిద్వ్రజేత్
ఆర్ద్రపాదస్తు భుంజీత నార్ద్రపాదస్తు సంవిశేత్
ఆర్ద్రపాదస్తు భుంజానో దీర్ఘమాయు రవాప్నుయాత్

ఇతరులుపయోగించిన చెప్పులు, వస్త్రము, యజ్ఞోపవీతము అలంకారద్రవ్యము, పూలదండ, కమండలము, ఉపయోగించరాదు, లేత యెండను. ప్రేతధూమమును, పగిలిన ఆసనమును, విడిచిపెట్టవలయును, వెంట్రుకలను, గోళ్ళను కొరకరాదు గోళ్ళను నోటితో తీయరాదు. పని లేకయే మట్టిని నలుపువాడు, గడ్డిని ఛేదించువాడు, గోళ్ళను తినునట్టి వాడు అశుచియగును. అట్టి దుష్టుడు వెంటనే నశించును. సూర్యుడు అస్తమించిన పిమ్మట నూనెతో చేసిన పదార్థమును తినరాదు, దిగంబరియై నిద్రించరాదు అశుచియై ఎచ్చటికి వెళ్ళరాదు. పాదములు కడిగికొని భుజించవలయును, పాదములు కడిగి భుజించువాడు దీర్ఘాయుష్మంతుడు అగును,

బ్రాహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చానుచింతయేత్
కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థమేవ చ
ఋషయో దీర్ఘసంధ్యత్వాత్ దీర్ఘమాయు రవాప్నుయుః
ప్రజ్ఞాం యశశ్చ కీర్తించ బ్రహ్మవర్చస మేవ చ

తెల్లవారుజామున లేచి తాను ఆచరించవలసిన ధర్మమునుగూర్చియు సంపాదించవలసిన ధనమును గూర్చియు వాటికి తగిన శరీర శ్రమను గూర్చియు వేదార్థమునుగురించియు ఆలోచించవలయును. ఋషులు దీర్ఘ కాలము సంధ్యను ఉపాసించుటచే దీర్ఘాయువును, ప్రజ్ఞను, శాశ్వతమైన కీర్తిని, బ్రహ్మవర్చస్సును సంపాదించిరి.

అమావాస్యా గురుం హంతి శిష్యం హంతి చతుర్దశీ
బ్రహ్మాష్టకా పౌర్ణమాస్యౌ తస్మాత్తాః పరివర్జయేత్

అమావాస్య గురువును, చతుర్దశి శిష్యుని నశింపచేయును. అష్టమీ పౌర్ణమాసీతిథులు విద్యను విస్మరింపచేయును. అందుచే ఆ తిథులయందు చదువరాదు.

ఋగ్వేదో దేవదైవత్యో యజుర్వేదస్తు మానుషః
సామవేదః స్మృతః పిత్ర్యః తస్మాత్తస్యాశుచిర్ధ్వనిః

ఋగ్వేదము దేవతలు దైవముగా గలది. యజుర్వేదము మానవులు దైవముగా గలది సామము పితృదేవతలు దైవముగా గలది అందుచే సామవేదధ్వని అశుచి యయ్యెను.

ఇచ్చట ఋగ్వేదము దేవతలనుగూర్చి చెప్పుననియు యజుర్వేదము మానవులు చేయవలసిన కర్మకాండను గురించి చెప్పుననియు సామము పితరులనుగురించి చెప్పుననియు వ్యాఖ్యానమున గలదు.

న హీదృశమనాయుష్యం లోకే కించన విద్యతే
యాదృశం పురుషస్యేహ పరదారోపసేవనమ్
నాత్మానమవమన్యేత పూర్వాభి రసమృద్ధిభిః
ఆమృత్యోః శ్రియమన్విచ్ఛేన్నైనాం మన్యేత దుర్లభామ్

సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్య మప్రియమ్
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మ స్సనాతనః
హీనాంగా నతిరిక్తాంగా న్విద్యాహీనా న్వయోఽధికాన్
రూపద్రవ్యవిహీనాంశ్చ నావమన్యేత కర్హిచిత్

పరుల భార్యనుపొందుటవలన ఆయువు క్షీణించును. ఆయువును క్షీణింపచేయు దుష్కార్యము ఇంతకంటెను మరియొకటిలేదు పర్యాప్తమైన సంపదలులేవని తన్ను తాను అవమానించుకొనరాదు. మరణపర్యంతము సంపదకొరకు ప్రయత్నించవలయును. ధనము పొందశక్యముగాని వస్తువుగాదు సత్యము పలుకవలయును. ప్రియము పలుకవలయును అప్రియమైన సత్యము పలుకరాదు. అబద్ధమైన ప్రియమును చెప్పరాదు. ఇదియే సనాతనమైన ధర్మము. అవయవలోపముగలవారిని, అధికావయవములు గలవారిని, విద్యలేనివారిని, ముసలివారిని, ధనములేనివారిని అవమానించరాదు.

మంగళాచారయుక్తానాం నిత్యం చ ప్రయతాత్మనామ్
జపతాం జుహ్వతాం చైవ వినిపాతో న విద్యతే
వేదమేవ జపేన్నిత్యం యథాకాల మతంద్రితః
తం హ్యస్యాహుః పరం ధర్మ ముపధర్మోఽన్యఉచ్యతే
అభివాదయే ద్వృద్ధాంశ్చ దద్యా చ్చైవాసనం స్వకమ్
కృతాంజలి రుపాసీత గచ్ఛతః పృష్ఠతోఽన్వియాత్
ఆచారాల్లభతే హ్యాయు రాచారా దీప్సితాః ప్రజాః
ఆచారాద్ధన మక్షయ్య మాచారో హన్త్యలక్షణమ్
దురాచారో హి పురుషో లోకే భవతి నిందితః
దుఃఖభాగీచ సతతం వ్యాధితోఽల్పాయు రేవ చ

సర్వలక్షణహీనోపి య స్సదాచారవా న్నృపః
శ్రద్దధానో௨నసూయశ్చ శతం వర్షాణి జీవతి

సదాచారవంతులై నియమితమైన మనస్సుతో జపహోమాదులు చేయుచున్న వారికి ఎటువంటి పతనము కలుగదు. సోమరితనము లేనివాడై బ్రాహ్మణుడు ఎల్లప్పుడు వేదపఠనము చేయవలయును. అదియే శ్రేష్ఠమైన ధర్మము. మిగిలినవన్నియు సామాన్యధర్మములే యగును. పెద్దలకు నమస్కరించవలయును. తన యాసన మియ్యవలయును. దోసిలి కట్టి సేవించవలయును. వెళ్ళుచున్నవారివెనుక వెళ్ళవలయును, సదాచారపరుడు దీర్ఘాయువును, ఇష్టమైన సంతానమును, సమృద్ధమైన ధనమును పొందును, సదాచారము ఆయోగ్యతను నశింపచేయును దురాచారుడు, నిందితుడు, దుఃఖవంతుడు, వ్యాధిబాధితుడు, అల్పాయువు అగును. సమస్తయోగ్యలక్షణములు లేనివాడయినప్పటికి సదాచారపరుడు శ్రద్ధగలవాడు, అసూయారహితుడయినచో నూరు సంవత్సరములు జీవించును.

యద్యత్పరవశం కర్మ తత్త ద్యత్నేన వర్జయేత్
యద్య దాత్మవశం స్యా త్తత్త త్సేవేత యత్నతః
సర్వం పరవశం దుఃఖం సర్వ మాత్మవశం సుఖమ్
ఏతద్విద్యా త్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః
ఆచార్యం చ ప్రవక్తారం పితరం మాతరమ్ గురుమ్
న హింస్యా ద్బ్రాహ్మణాన్ గాశ్చసర్వాం శ్చైవ తపస్వినః

ఇతరుల స్వాధీనమున నున్నదానిని ప్రయత్న పూర్వకముగ విడిచిపెట్టవలయును, తనవశమునందున్నదంతయు ప్రయత్న పూర్వకముగ చేయవలయును. సుఖదుఃఖముల సామాన్య లక్షణమునిట్లు తెలుసుకొనవలయును. పరులస్వాధీనమునందున్న దంతయు దుఃఖము, తన

స్వాధీనము నున్నది సుఖము, ఉపనయనాదులు చేసినవానిని, వేదాధ్యయనము చేయించినవానిని, తండ్రిని, తల్లిని, విద్యనేర్పినవానిని, బ్రాహ్మణులను, ఆవులను, తపోవంతులను బాధించరాదు.

అధార్మికో నరో యోహి యస్య చాప్యనృతం ధనమ్
హింసారతశ్చ యో నిత్యం నేహాసౌ సుఖమేధతే
న సీదన్నపి ధర్మేణ మనోఽధర్మే నివేశయేత్
అధార్మికాణాం పాపానా మాశు పశ్యన్ విపర్యయమ్
నా ధర్మశ్చరితో లోకే సద్యః ఫలతి గౌరివ
శనై రావృత్తమానస్తు కర్తు ర్మూలాని కృంతతి
యది నాత్మని పుత్రేషు న చేత్పుత్రేషు నప్తృషు
నత్వేవతు కృతోఽధర్మః కర్తుర్భవతి నిష్ఫలః
అధర్మఫలము ఇట్లు వివరించబడినది :

అధార్మికుడు, అసత్యముచే ధనసంపాదన చేసినవాడు, నిత్యము హింసయందాసక్తి గలవాడు ఈ లోకమునందును సుఖమును పొందలేడు. ధార్మికుడు ధర్మాచరణముచే బాధపడుచున్నను అధార్మికులకు కలుగుచున్న కష్టములుచూచి అధర్మప్రవర్తనయందు మనస్సు నిలుపరాదు. అధర్మాచరణము ధేనువువలె వెంటనే ఫలించదు మెల్లమెల్లగా ఫలించి కర్తను సమూలముగ నశింపచేయును. ఆ పాపాచరణ ఫలము తనను బాధించనిచో తన పుత్రులను-వారిని విడచినచో- పౌత్రులను బాధించునే గాని వ్యర్థముగ పోదు.

విశేషము : తండ్రిచేసిన పాపము కొడుకునేల బాధించును అని యనగా కొడుకులద్వారా తండ్రికి బాధ కలుగచేయును, తండ్రిచేసిన అప్పునకు కొడుకులు బాధ్యులుకదా, ఈ విషయమువ్యాఖ్యానమున గలదు

ఋత్విక్పురోహితాచార్యై ర్మాతులాతిథి సంశ్రితైః
బాలవృద్ధాతురై ర్వైద్యై ర్జ్ఞాతి సంబంధి బాంధవైః
మాతాపితృభ్యాం జామీభి ర్భ్రాత్రా పుత్రేణ భార్యయా
దుహిత్రా దాసవర్గేణ వివాదం న సమాచరేత్
ఏతై ర్వివాదం సంత్యజ్య సర్వపాపైః ప్రముచ్యతే
ఏభిర్జితైశ్చ జయతి సర్వాన్ లోకానిమాన్ గృహీ

ఋత్విక్కు, పురోహితుడు, ఆచార్యుడు, మేనమామ, అతిథి, ఆశ్రయించినవాడు, బాలుడు, వృద్ధులు, రోగులు, వైద్యులు, పితృవంశమునకు చెందిన జ్ఞాతులు, తనకుచెందిన అల్లుడు, బావ మొదలగు సంబంధీకులు తల్లి పక్షమునగల బంధువులు, తల్లి దండ్రులు. సోదరీమణులు, పుత్రుడు, భార్య, కుమార్తె, సేవకులు అను వీరితో వివాదము చేయరాదు. వీరితో వివాదము చేయనివాడు సర్వపాపవిముక్తుడగును. అంతియేగాక సర్వపుణ్య లోకములను పొందును,

ప్రతిగ్రహ సమర్థోఽపి ప్రసంగం తత్ర వర్జయేత్
ప్రతిగ్రహేణ హ్యస్యాశు బ్రాహ్మం తేజః ప్రశామ్యతి
న ద్రవ్యాణా మవిజ్ఞాయ విధిం ధర్మ్యం ప్రతిగ్రహే
ప్రాజ్ఞః ప్రతిగ్రహం కుర్యా దవసీదన్నపి క్షుధా
హిరణ్యం భూమి మశ్వం గా మన్నం వాస స్తిలాన్ ఘృతమ్
ప్రతిగృహ్ణన్న విద్వాంస్తు భస్మీభవతి దారువత్
హిరణ్య మాయురన్నం చ భూర్గో శ్చాప్యోషత స్తనుమ్
అశ్వ శ్చక్షు స్త్వచం వాసో ఘృతం తేజ స్తిలాః ప్రజాః
తస్మా దవిద్వాన్ బిభియా ద్యస్మా త్తస్మా త్ప్రతిగ్రహాత్
స్వల్పకేనాప్యవిద్వాన్ హి పంకే గౌరివ సీదతి

ప్రతిగ్రహణ విషయము వివరించబడినది :

దానము పట్టుటయందు సమర్థుడయినప్పటికి ఆ ప్రసంగమువిడిచి పెట్టవలయును. దానము స్వీకరించుటవలన బ్రహ్మతేజము నశించును. పండితుడైనవాడు ఆకలిచే బాధపడు సమయమునగూడ ద్రవ్యసంబంధమైన విధితెలియక ప్రతిగ్రహము చేయరాదు బంగారము, భూమి, అశ్వము, ఆవు, అన్నము, వస్త్రము, తిలలు, నెయ్యిని గ్రహించిన అపండితుడు కాష్ఠమువలె భస్మమగును. బంగారము, అన్నము ఆయువును క్షీణింపచేయును, భూమి, గోవు, శరీరమును : అశ్వము చక్షువును, వస్త్రము చర్మమును, నేయి తేజస్సును, తిలలు సంతానమును, నశింపచేయును. అందుచే అపండితుడు ఎట్టి ప్రతిగ్రహము చూచియైనను భయపడవలయును, అది అత్యల్పమైనను బురదలో దిగిన ఆవునువలె బాధించును.

శ్రద్ధయేష్టం చ పూర్తం చ నిత్యం కుర్యా దతంద్రితః
శ్రద్ధాకృతే హ్యక్షయేతే భవతః స్వాగతైర్ధనైః
యత్కించిదపి దాతవ్యం యాచితేనా నసూయయా
ఉత్పత్స్యతే హి తత్పాత్రం యత్తారయతి సర్వతః
సర్వేషా మేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే
వార్యన్న గో మహీవాస స్తిల కాంచన సర్పిషామ్
యేన యేన తు భావేన యద్యద్దానం ప్రయచ్ఛతి
తత్తత్తేనైవ భావేన ప్రాప్నోతి ప్రతిపూజితః
యోఽర్చితం ప్రతిగృహ్ణాతి దదాత్యర్చిత మేవచ
తావుభౌ గచ్ఛతః స్వర్గం నరకం తు విపర్యయే

దానము చేయు విధము వివరించబడినది :

ప్రతిగ్రహణ విషయము వివరించబడినది :

దానము పట్టుటయందు సమర్థుడయినప్పటికి ఆ ప్రసంగమువిడిచి పెట్టవలయును. దానము స్వీకరించుటవలన బ్రహ్మతేజము నశించును. పండితుడైనవాడు ఆకలిచే బాధపడు సమయమునగూడ ద్రవ్యసంబంధమైన విధి తెలియక ప్రతిగ్రహము చేయరాదు బంగారము, భూమి, అశ్వము, ఆవు, అన్నము, వస్త్రము, తిలలు, నెయ్యిని గ్రహించిన అపండితుడు కాష్ఠమువలె భస్మమగును. బంగారము, అన్నము ఆయువును క్షీణింపచేయును, భూమి, గోవు, శరీరమును : అశ్వము చక్షువును, వస్త్రము చర్మమును, నేయి తేజస్సును, తిలలు సంతానమును, నశింప చేయును. అందుచే అపండితుడు ఎట్టి ప్రతిగ్రహము చూచియైనను భయపడవలయును, అది అత్యల్పమైనను బురదలో దిగిన ఆవునువలె బాధించును.

శ్రద్ధయేష్టం చ పూర్తం చ నిత్యం కుర్యా దతంద్రితః
శ్రద్ధాకృతే హ్యక్షయేతే భవతః స్వాగతైర్ధనైః
యత్కించిదపి దాతవ్యం యాచితేనా నసూయయా
ఉత్పత్స్యతే హి తత్పాత్రం యత్తారయతి సర్వతః
సర్వేషా మేవ దానానాం బ్రహ్మదానం విశిష్యతే
వార్యన్న గో మహీవాస స్తిల కాంచన సర్పిషామ్
యేన యేన తు భావేన యద్యద్దానం ప్రయచ్ఛతి
తత్తత్తేనైవ భావేన ప్రాప్నోతి ప్రతిపూజితః
యోఽర్చితం ప్రతిగృహ్ణాతి దదాత్యర్చిత మేవచ
తావుభౌ గచ్ఛతః స్వర్గం నరకం తు విపర్యయే

దానము చేయు విధము వివరించబడినది :

# అయిదవ యధ్యాయము

అనభ్యాసేన వేదానా మాచారస్య చ వర్జవాత్
ఆలస్యాదన్న దోషాచ్చ మృత్యు ర్విప్రాన్ జిఘాంసతి

వేదముల నభ్యసించక పోవుటవలన, ఆచారము విడుచుట వలన ఆలసతవలన అన్నమునందలి దోషమువలన మృత్యువు విప్రులను చంపదలచుచున్నది.

సంవత్సర స్యైకమపి చరే త్కృచ్ఛ్రం ద్విజోత్తమః
అజ్ఞాత భుక్త శుద్ధ్యర్థం జ్ఞాతస్య తు విశేషతః

బ్రాహ్మణుడు తెలియక చేసిన అన్నదోష పరిహారార్థము సంవత్సరమున కొక పర్యాయమైనను కృచ్ఛ్రాంద్రాయణ వ్రతము చేయవలయును. తెలిసిచేసిన దోషపరిహారార్థము విశేషముగ చేయవలయును.

యావంతి పశురోమాణి తావత్కృత్వో హి మారణమ్
వృథాపశుఘ్నః ప్రాప్నోతి ప్రేత్య జన్మని జన్మని

వ్యర్థముగా పశుమారణము చేసినవాడు పశువునకు ఎన్ని రోమములు కలవో అన్ని పర్యాయములు జన్మలు పొంది వధించబడును.

యో బంధన వధక్లేశాన్ ప్రాణినాం న చికీర్షతి
స సర్వస్య హితప్రేప్సుః సుఖ మత్యంత మశ్నుతే

సమస్త ప్రాణులహితమును కోరి పశువుల బంధనము, వధ చేయని మానవుడు అత్యంతసుఖమును పొందుచున్నాడు.

నాకృత్వా ప్రాణినాం హింసాం మాంస ముత్పద్యతే క్వచిత్
న చ ప్రాణివధః స్వర్గ్య స్తస్మా న్మాంసం వివర్జయేత్

ప్రాణులను వధించకుండగ మాంసము లభ్యముకాదు, ప్రాణుల వధ స్వర్గమును కలిగించదు. అందుచే మాంసభక్షణమును విసర్జించ వలయును.

న భక్షయతి యో మాంసం విధిం హిత్వా పిశాచవత్
స లోకే ప్రియతాం యాతి వ్యాధిభిశ్చ న పీడ్యతే

శాస్త్రమర్యాద నతిక్రమించి పిశాచమువలె మాంసభక్షణ చేయని వాడు లోకమున ప్రేమపాత్రు డగును, అతడు వ్యాధులచే పీడించ బడడు.

స మాం భక్షయితాఽముత్ర యస్య మాంస మిహాద్మ్యహమ్
ఏతన్మాంసస్య మాంసత్వం ప్రవదంతి మనీషిణః

ఏ ప్రాణి మాంసమును నేనిచట తిందునో ఆ ప్రాణి నా మాంసమును మరియొక చోట తినగలదు, అందుచేతనే పండితులు మాంసమును మాంస శబ్దముతో పిలుతురు.

క్షాంత్యా శుద్ధ్యంతి విద్వాంసో దానేనా కార్యకారిణః
ప్రచ్ఛన్న పాపా జప్యేన తపసా వేదవిత్తమాః

ఓర్పు చేతనే పండితులు శుద్ధులు కాగలరు, అకార్యము చేసిన వారు దానముచేతను. రహస్యముగా పాపాచరణము చేసినవారు జపము చేతను వేదవేత్తలు తపస్సు చేతను శుద్ధులగుచున్నారు.

అద్భి ర్గాత్రాణి శుద్ధ్యంతి మన స్సత్యేన శుధ్యతి
విద్యా తపోభ్యాం భూతాత్మా బుద్ధి ర్జ్ఞానేన శుధ్యతి

ఉదకముచే శరీరాంగములు, సత్యవాక్యముచే మనస్సు, విద్యా తపస్సులచే లింగశరీరముతో గూడిన జీవాత్మ, తత్త్వవిజ్ఞానముచే బుద్ధియు శుద్ధమగును.

ఊర్ధ్వం నాభే ర్యాని ఖాని తాని మేధ్యాని సర్వశః
యాన్యధస్తా న్య మేధ్యాని దేహాచ్చైవ మలాశ్చ్యుతాః

నాభికి పైనగల ఇంద్రియములు పవిత్రములు. నాభికి క్రింద గల యవయవములు అపవిత్రములు. దానినుండి వెలువడు మలములు అపవిత్రములు.

ఇది అయిదవ యధ్యాయము

*

# ఆరవ యధ్యాయము

గృహస్థస్తు యదా పశ్యే ద్వలీ పలిత మాత్మనః
అపత్యస్యైవ చాపత్యం తదారణ్యం సమాశ్రయేత్
సంసృజ్య గ్రామ్య మాహారం సర్వంచైవ పరిచ్ఛదమ్
పుత్రేషు భార్యాం నిక్షిప్య వనం గచ్ఛేత్సహైవ వా
అగ్నిహోత్రం సమాదాయ గృహ్యం చాగ్ని పరిచ్ఛదమ్
గ్రామాదరణ్యం నిస్సృత్య నివసేన్నియతేంద్రియః
స్వాధ్యాయే నిత్యయుక్తః స్యాద్దాంతో మైత్ర స్సమాహితః
దాతా నిత్య మనాదాతా సర్వభూతాను కంపకః

గృహస్థుడు ముడతలుపడిన తన శరీరమును, తెల్లబడిన వెంట్రు, కలు, తన పుత్రుని సంతానమునుచూచి యరణ్యమునకు వెళ్ళవలయును. గ్రామ సంబంధమైన ఆహారమును, ఆవులు, మంచము మొదలైన పరికరములను విడిచి వెళ్ళవలయును. భార్యను పుత్రులవద్ద ఉంచిగాని, భార్యను తీసుకొనిగాని వెళ్ళవచ్చును. అగ్నిహోత్రమును స్రుక్ స్రువాది పరికరములను తీసుకొని వెళ్ళవలయును అచ్చట ఇంద్రియ నియమములు గలవాడై నివసించవలయును, నిత్యము వేదాధ్యయనము చేయుచు శీతవాతాపముల సహించి మైత్రీభావముగలవాడై యుండవలయును. దానము చేయవలయునేగాని ప్రతిగ్రహము చేయరాదు. సర్వప్రాణుల యందు దయ గలిగి యుండవలయును.

సర్వః ప్రక్షాలకో వా స్యా న్మాస సంచయకోపి వా
షణ్మాస నిచయో వా స్యా త్సమానిచయ ఏవ వా

చాంద్రాయణవిధానైర్వా శుక్ల కృష్ణే చ వర్తయేత్
పక్షాంతయో ర్వాప్యశ్నీయా ద్యవాగూం క్వథితాం సకృత్

ఒకదినమునకు మాత్రమే సరిపోవు ఆహారమును సంచయము చేసుకొనవలయును. అటుల కుదరనిచో మాసమువరకు సరిపోవునదిగాని ఆరుమాసములవరకు సరిపోవునదిగాని, సంవత్సరమువరకు సరిపోవునదిగాని నిలువచేసుకొనవలయును. "ఏకైకం హ్రాసయే త్పిండం శుక్లేకృష్ణే చ వర్ధయేత్" అని చెప్పబోవు రీతిగ చాంద్రాయణ వ్రతము చేయవలయును. పూర్ణిమయందు, అమావాస్యయందు ఒక పర్యాయము భుజించవలయును.

గ్రీష్మే పంచతపాస్తు స్యా ద్వర్షాస్వ భ్రావకాశికః
ఆర్ద్రవాసాస్తు హేమంతే క్రమశో వర్ధయం స్తపః
ఆసాం మహర్షి చర్యాణాం త్యక్త్వాఽన్యతమయా తనుమ్
వీతశోక భయో విప్రో బ్రహ్మలోకే మహీయతే

గ్రీష్మమున అయిదు అగ్నులమధ్యనుండి, వర్షాకాలమున వర్షమునందుండి, హేమంతమున తడివస్త్రము ధరించియు, తపము వృద్ధి చేయవలయును. ఇట్టి మహర్షి చర్యలచే శరీరము విడిచిన విప్రుడు శోక భయములు లేనివాడయి బ్రహ్మలోకము పొందును.

వనేషు చ విహృత్యైవం తృతీయం భాగ మాయుషః
చతుర్థ మాయుషో భాగం త్యక్త్వా సంగాన్ పరివ్రజేత్
ఆశ్రమాదాశ్రమం గత్వా హుతహోమో జితేంద్రియః
భిక్షా బలి పరిశ్రాంతః ప్రవ్రజన్ ప్రేత్య వర్ధతే
ఋణాని త్రీన్యపాకృత్య మనో మోక్షే నివేశయేత్
అనపాకృత్య మోక్షం తు సేవమానో వ్రజత్యధః

అధీత్య విధివద్వేదాన్ పుత్రాంశ్చోత్పాద్య ధర్మతః
ఇష్ట్వా చ శక్తితో యజ్ఞైర్మనో మోక్షే నివేశయేత్
అనధీత్య ద్విజో వేదా ననుత్పాద్య తదా సుతాన్
అనిష్ట్వాచైవ యజ్ఞైశ్చ మోక్ష మిచ్ఛన్ వ్రజత్యధః

సంన్యాసాశ్రమ విధానము విపులముగ వివరించబడినది.

ఆయువునందలి తృతీయభాగమును వానప్రస్థమున గడిపినాలుగవ భాగమున సర్వసంగ పరిత్యాగముద్వారా సంన్యాసమును స్వీకరించవలయును. పురుషుడు జితేంద్రియుడై క్రమముగ ఒక ఆశ్రమమునుండి మరియొక ఆశ్రమమున ప్రవేశించుచు హోమాదులచేతను, భిక్షబలుల చేతను పరిశ్రాంతుడయి ఆశ్రమస్వీకారముచేసి మృతుడై మోక్షమును పొందుచున్నాడు. మూడుఋణములు తీర్చి మనస్సును మోక్షమునందు నిలుపవలయును. అటుల తీర్చక మోక్షార్థి యగుచో అథఃపతితుడగును. వేదాధ్యయనముచేసి ధర్మానుసారము పుత్రులను కని యథాశక్తి యజ్ఞములుచేసి మోక్షార్థికావలయును, వేదములు చదువక సంతానముకనక యాగములు చేయక మోక్షార్థియైనవాడు అథః పతితుడగును.

యో దత్వా సర్వభూతేభ్యః ప్రవ్రజత్యభయం గృహాత్
తస్య తేజోమయా లోకా భవంతి బ్రహ్మవాదినః
యస్మా దణ్వపి భూతానాం ద్విజాన్నోత్పద్యతే భయమ్
తస్య దేహాద్విముక్తస్య భయం నాస్తి కుతశ్చన
ఏక ఏవ చరేన్నిత్యం సిద్ధ్యర్థ మసహాయవాన్
సిద్ధి మేకస్య సంపశ్యన్ న జహాతి న హీయతే

అనగ్ని రనికేత స్స్యాద్గ్రామ మన్నార్థ మాశ్రయేత్
ఉపేక్షకోఽసంకుసుకో మునిర్భావ సమన్వితః
కపాలం వృక్షమూలాని కుచేల మసహాయతా
సమతాచైవ సర్వస్మి న్నేత న్ముక్తస్య లక్షణమ్

సంన్యాస విధులు ఉపదేశించబడుచున్నవి :

సమస్త ప్రాణులకు అభయమిచ్చి సంన్యసించిన బ్రహ్మవాదికి తేజోమయములయిన లోకములు వచ్చును. ఏ బ్రాహ్మణునివలన సర్వ ప్రాణులకు అణుమాత్రము భయములేదో అట్టివానికి చనిపోయిన పిమ్మట ఎట్టి భయముండదు. సర్వసంగ పరిత్యాగియై ఏకాంతనివాసము చేయువారికి మోక్షము సిద్ధించునను విషయము తెలుసుకొని అసహాయుడై సంచరించవలయును. ఏకాకియైనవానికి విడిచిపెట్టతగినదిగాని విడిచి పెట్టబడుటగాని యుండదు. మమకార రహితుడగుటచే సుఖముగ మోక్షము పొందును. అగ్నిసంయోగము, (వంట) గృహము లేనివాడయి ఆహారముకొరకు గ్రామములోనికి వెళ్ళవలయును. బ్రహ్మభావముకలిగి యుండవలయును. భిక్షాపాత్ర, వృక్షాశ్రయము, జీర్ణవస్త్రము, ఒంటరి తనము, అందరియందు సమభావము ముక్తుని లక్షణములు.

నాభినందేత మరణం నాభినందేత జీవితమ్
కాలమేవ ప్రతీక్షేత నిర్దేశం భృతకో యధా
దృష్టిపూతం న్యసేత్పాదం వస్త్రపూతం జలం పిబేత్
సత్యపూతం వదేద్వాచం మనః పూతం సమాచరేత్
అతివాదాం స్తితిక్షేత నావమన్యేత కంచన
న చేమం దేహ మాశ్రిత్య వైరం కుర్వీత కేనచిత్
క్రుధ్యంతం న ప్రతిక్రుధ్యే దాకృష్టః కుశలం వదేత్
సప్తద్వారా వకీర్ణాం చ న వాచ మనృతాం వదేత్

సంన్యాసులకు సంబంధించిన విశేషధర్మములతోపాటు అందరకు అనుసరించతగిన సామాన్యధర్మములుగూడ చెప్పబడినవి.

భృత్యుడు నెలజీతమునకై ఎదురుచూచునటుల తన మరణకాలమునకు ఎదురుచూడ వలయుగాని జీవితమునుగాని మరణమునుగాని అపేక్షించ రాదు. దృష్టిచే పవిత్రమైన ప్రదేశమున నడువవలయును. వస్త్రముచే పవిత్రమైన నీరు త్రాగవలయును సత్యముచే పవిత్రమైనమాట పలుకవలయును మనస్సుచే పవిత్రమైన పనిని చేయవలయును. ఇతరులు చేసిన నిందారోపణము సహించవలయును. ఎవనిని అవమానించరాదు. ఈ శరీర నిమిత్తమై ఎవనితోను విరోధము పెట్టుకొనరాదు. కోపగించినవానిని కోపగించరాదు, అవమానించిన వానితోగూడ క్షేమపూర్వకముగ మాటాడవలయును. ఈ శరీరావవములతో అబద్ధము, ఆడరాదు. అనగా పంచేంద్రియ విషయమునగాని మనోబుద్ధుల విషయమునగాని అబద్ధమాడరాదు.

క్లృప్తకేశనఖశ్మశ్రుః పాత్రీ దండీ కుసుంభవాన్
విచరే న్నియతో నిత్యం సర్వభూతా వ్యపీడయన్
అలాబుం దారుపాత్రం చ మృణ్మయం వైదలం తథా.
ఏతాని యతిపాత్రాణి మనుః స్వాయంభువోఽబ్రవీత్
ఏకకాలం చరేద్భైక్షం న ప్రసంజేత విస్తరే
భైక్షప్రసక్తో హి యతిః విషయేష్వపి సంజతి
అలాభే న విషాదీ స్యాల్లాభేచైవ న హర్షయేత్
ప్రాణయాత్రిక మాత్రః స్యా న్మాత్రాసంగా ద్వినిర్గతః
అభిపూజిత లాభాంస్తు జుగుప్సేతైవ సర్వశః
అభిపూజిత లాభైశ్చ యతి ర్ముక్తోపి బధ్యతే

యతిధర్మ విశేషములు చెప్పబడినవి :

యతి గడ్డములు, మీసములు పెంచక భిక్షాపాత్రను, దండమును కమండలమును ధరించి సమస్తప్రాణులను బాధించక సంచరించ వల యును. సొరకాయబుఱ్ఱ, కొయ్యచెంబు, మట్టిచెంబు, వెదురుచెంబును గాని ధరించవలయును — అని మనువు చెప్పెను. ఒకసారి మాత్రమే భిక్షాచరణము చేయవలయును. అధికముగ చేయరాదు. భిక్షాచరణకారణ ముగ యతి విషయములయందు లగ్నమైన వాడగును. భిక్ష దొరక నప్పుడు విషాదమునుగాని, దొరికినప్పుడు సంతసమునుగాని పొంద రాదు. ప్రాణధారణ నిమిత్తము భుజించవలయునుగాని - ఇది అరుచి యని విడుచుటగాని, రుచియని గ్రహించుటగాని పనికిరాదు. గౌరవ పాత్ర విషయములన్నియు అసహ్యభావముతో విడిచిపెట్ట వలయును, గౌరవ సత్కారములు లభించుటచే ముక్తుడైన యతియు బంధితు డగును.

ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేష క్షయేన చ
అహింసయా చ భూతానా మమృతత్వాయ కల్పతే
అవేక్షేత గతీ ర్నౄణాం కర్మదోష సముద్భవాః
నిరయే చైవ పతనం యాతనాశ్చ యమక్షయే
విప్రయోగం ప్రియైశ్చైవ సంయోగం చ తథాఽప్రియైః
జరయా చాభిభవనం వ్యాధిభి శ్చోపపీడనమ్
దేహాదుత్క్రమణం చాస్మాత్పునర్గర్భే చ సంభవమ్
యోనికోటిసహస్రేషు సృతీ శ్చాస్యాంత రాత్మనః
సూక్ష్మతాం చాన్వవేక్షేత యోగేన పరమాత్మనః
దేహేషు చ సముత్పత్తి ముత్తమే ష్వధమేషు చ

సంసారవిషయకమైన దుఃఖమంతయు చెప్పబడినది, ఇంద్రియములను నిరోధించుటచేత, రాగద్వేషములను విడుచుటచేత ప్రాణిహింస చేయక పోవుటచేతను, యతి అమృతత్వమును పొందుచున్నాడు మానవులకు కర్మదోషమువలన కల్గినకష్టస్థితులను పరిశీలించవలయును. నరకమునందు పడుట, యాతనలననుభవించుట గుర్తించవలయును. ప్రియులతో వియోగము, అప్రియులతో సంయోగము, ముసలితనమునందలి బాధ, రోగములచే బాధకలుగుట గుర్తించవలయును. కోట్లకొలదియోనులయందు పుట్టుట, చనిపోవుట అను విషయములను చింతించవలయును, యోగము చేత పరమాత్మ సర్వప్రాణుల రూపముతో పుట్టుట గమనించవలయును. అనగా పరమాత్మ సర్వాంతర్యామిత్వము గుర్తించవలయును.

దూషితోఽపి చరేద్ధర్మం యత్ర తత్రాశ్రమే రతః
సమః సర్వేషు భూతేషు న లింగం ధర్మకారణమ్
ఫలం కతకవృక్షస్య యద్య ప్యంబు ప్రసాదకమ్
ననామగ్రహణాదేవ తస్యవారి ప్రసీదతి
సంరక్షణార్థం జంతూనాం రాత్రావహవి వా సదా
శరీరస్యాత్యయే చైవ సమీక్ష్య వసుధాం చరేత్
అహ్నా రాత్ర్యా చ యాన్ జంతూన్ హినస్త్యజ్ఞావతోయతః
తేషాం స్నాత్వా విశుద్ధ్యర్థం ప్రాణాయామాన్ షడాచరేత్
ప్రాణాయామా బ్రాహ్మణస్య త్రయోపి విధివత్కృతాః
వ్యాహృతి ప్రణవై ర్యుక్తా విజ్ఞేయం పరమం తపః
యతి ధర్మ విశేషములు వివరముగ చెప్పబడినవి।

ఏ యాశ్రమమందున్నను ఆ యాశ్రమధర్మములను దుస్థితియందైనను చేయవలయును ఆశ్రమ చిహ్నములను ధరించుట మాత్రమే

ధర్మ సంపాదకముకాదు సర్వభూతములయందు సమబుద్ధితో నుండవల యును. చిల్లగింజ పేరు ఉచ్చరించుటచేతనే నీరు నిర్మలము కాదుకదా. శరీరము బాధతో నున్నప్పటికిని రాత్రిం బవళ్ళు ప్రాణిహింస కలుగ కుండుటకై భూమిని చూచుచు నడువవలయును. యతిరాత్రింబవళ్ళు నడచుటచే అజ్ఞానమువలన కలిగిన ప్రాణిహింసా దోషపరిహారార్థము ఆరు ప్రాణాయామములుచేయవలయును. వ్యాహృతులతో శాస్త్రప్రకారము చేయబడిన మూడు ప్రాణాయామములే బ్రాహ్మణునికి గొప్ప తపస్సు.

దహ్యంతే ధ్మాయమానానాం ధాతూనాం హి యథామలాః
తథేంద్రియాణాం దహ్యంతే దోషాః ప్రాణస్య నిగ్రహాత్
ప్రాణాయామైర్దహే ద్దోషాన్ ధారణాభి శ్చ కిల్బిషమ్
ప్రత్యాహారేణ సంసర్గాన్ ధ్యానేనా నీశ్వరాన్ గుణాన్
ఉచ్చావచేషు భూతేషు దుర్జ్ఞేయా మకృతాత్మభిః
ధ్యానయోగేన సంపశ్యేద్గతి మస్యాంతరాత్మనః
సమ్యగ్దర్శనసంపన్నః కర్మభి ర్న నిబధ్యతే
దర్శనేన విహీన స్తు సంసారం ప్రతిపద్యతే.

ప్రాణాయామ ప్రభావము చెప్పబడినది—

వెండిబంగారముల యందలి మాలిన్యము అగ్నితో గాల్చుటవలన దగ్ధమైనట్లు ఇంద్రియ దోషములన్నియు ప్రాణాయామమువలన దగ్ధ మగును, ప్రాణాయామమువలన రాగాదిదోషములను పరబ్రహ్మయందు మనస్సు నిలుపుటవలన పాపమును ఇంద్రియములను విషయములనుండి నిగ్రహించుటవలన సంసర్గ దోషములను ఈశ్వర ధ్యానమువలన క్రోధలోభాదులను పరిహరించతగును. దేవపశ్వాది జన్మలయందు శాస్త్ర

సంస్కారము లేకపోవుటచే చూడశక్యముగాని పరమాత్మస్వరూపమును ధ్యానయోగముచే చూడతగును. బ్రహ్మసాక్షాత్కారముపొందిన జీవుడు కర్మలచే బంధింపబడడు, పొందనివాడు మాత్రము సంసారబంధితు డగును.

నదీకూలం యథా వృక్షో వృక్షం వా శకుని ర్యథా
తథా త్యజన్నిమం దేహం కృచ్ఛ్రాద్గ్రాహా ద్విముచ్యతే
ప్రియేషు స్వేషు సుకృత మప్రియేషు చ దుష్కృతమ్
విసృజ్య ధ్యానయోగేన బ్రహ్మేభ్యేతి సనాతనమ్
యదాభావేన భవతి సర్వభూతేషు నిస్పృహః
తదా సుఖమవాప్నోతి ప్రేత్య చేహచ శాశ్వతమ్
అనేన విధినా సర్వాం స్త్యక్త్వా సంగాం శ్శనైశ్శనైః
సర్వద్వంద్వ వినిర్ముక్తో బ్రహ్మణ్యే వవతిష్ఠతే

వృక్షము నదీతీరమును విడిచిపెట్టునటుల, పక్షి వృక్షమును విడిచి నటుల జ్ఞాని ఈ శరీరమును విడుచుచున్నాడు. జ్ఞాని తాను చేసిన పుణ్య విశేషములను ప్రియమైన వారియందు పాపమును అప్రియులయందు విడిచి సనాతనమైన బ్రహ్మను పొందుచున్నాడు. సర్వవిషయముల యందు కోరికలు లేనివాడు ఈ లోకమునందును పరలోకమునందును సుఖమును పొందుచున్నాడు. ఈ విధముగ మెల్లమెల్లగా సర్వ సాంగత్యములను విడచి మానావమానములనుండి విముక్తుడై బ్రహ్మయందే లీనమగు చున్నాడు.

ఇదం శరణ్య మజ్ఞానా మిదమేవ విజానతామ్
ఇద మన్విచ్ఛతాం స్వర్గమిద మానంత్య మిచ్ఛతామ్
బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థో యతి స్తథా
ఏతే గృహస్థప్రభవా శ్చత్వారః పృథగాశ్రమాః

సర్వేషా మపి చైతేషాం వేదస్మృతి విధానతః
గృహస్థ ఉచ్యతే శ్రేష్ఠ స్స త్రీనేతాన్ బిభర్తి హి
యథా నదీనదా స్సర్వే సాగరే యాంతి సంస్థితిమ్
తథై వాశ్రమిణ స్సర్వే గృహస్థే యాంతి సంస్థితిమ్
ధృతిః క్షమా దమ స్తేయం శౌచ మింద్రియ విగ్రహః
ధీ ర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మలక్షణమ్
దశలక్షణాని ధర్మస్య యే విప్రాః సమధీయతే
అధీత్య చాను వర్తంతే యాంతి పరమాం గతిమ్

వేదాధ్యయనమే అర్థము తెలియనివారికి, అర్థము తెలిసినవారికి, స్వర్గము కోరనివారికి, స్వర్గము కోరినవారికిని శరణమగుచున్నది. బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, యతి అను నాలుగు ఆశ్రమవాసులు గృహస్థాశ్రమమునుండి పుట్టినవారే యగుచున్నారు. మిగిలిన మూడు ఆశ్రమవాసులను భరించుటవలన గృహస్థాశ్రమమే శ్రేష్ఠమైనదని చెప్పబడుచున్నది. నదీనదములన్నియు సముద్రమునందు నిలకడను పొందినటుల మిగిలిన ఆశ్రమవాసులు గృహస్థుని గృహమున నిలకడను పొందుచున్నారు. ధృతి, క్షమ, మనోనిగ్రహము, దొంగతనము చేయకపోవుట, పరిశుద్ధత- ఇంద్రియనిగ్రహము శాస్త్రాదితత్త్వజ్ఞానము ఆత్మజ్ఞానము, సత్యము, క్రోధరాహిత్యము అనుపదియు ధర్మలక్షణములు, ఈ పదివిధములయిన ధర్మలక్షణములను తెలిసికొని వాని ననుసరించిన విప్రులు మోక్షమును పొందుచున్నారు.

ఇది ఆరవ యధ్యాయము

*

# ఏకవ యధ్యాయము

అరాజకే హి లోకేఽస్మిన్ సర్వతో విద్రుతే భయాత్
రక్షార్థ మస్య సర్వస్య రాజాన మసృజ త్ప్రభుః
యస్మా దేషాం సురేంద్రాణాం మాత్రాభ్యో నిర్మితో నృపః
తస్మా దభిభవత్యేష సర్వభూతాని తేజసా
తప త్యాదిత్యవ చ్చైష చక్షూంషి చ మనాంసి చ
న చైనం భువి శక్నోతి కశ్చి దప్యభి వీక్షితుమ్
బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి భూమిపః
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి

అరాజకమయినపుడు లోకమంతయు భయమువలన కంపించును. అట్టి లోకమును రక్షించుటకు భగవంతుడు రాజును సృష్టించెను. ఇంద్రాదిదేవతల యంశముతో రాజు సృష్టించబడెను. అందుచేతనే రాజు తన పరాక్రమముచేత సర్వభూతములను తిరస్కరించు చున్నాడు. రాజు సూర్యునివలె కంటిని మనస్సునుగూడ తపింప చేయును. ఇతనిని ఎవరును సంపూర్ణముగ చూడలేరు. రాజు బాలుడైనను బాలుడు గదాయని తిరస్కరించరాదు. గొప్పదైన దైవతేజము మానవరూపమున నున్న దని గ్రహించవలయును.

తస్మాద్ధర్మం యమిష్టేషు స వ్యవస్యే న్నరాధిపః
అనిష్టం చా ప్యనిష్టేషు తం ధర్మం న విచాలయేత్
తస్య సర్వాణి భూతాని స్థావరాణి చరాణి చ
భయాద్భోగాయ కల్పంతే స్వధర్మా న్న చలంతి చ

దండశ్శాస్తి ప్రజాస్సర్వా దండ ఏవాభిరక్షతి
దండః సుప్తేషు జాగర్తి దండం ధర్మం విదుర్బుధాః
సమీక్ష్య సధృతః సమ్యక్ సర్వా రంజయతి ప్రజాః
అసమీక్ష్య ప్రణీతస్తు వినాసయతి సర్వతః
యది న ప్రణయే ద్రాజా దండం దండ్యే ష్వతంద్రితః
శూలే మత్స్యానివా పక్ష్యన్ దుర్బలాన్ బలవత్తరాః

రాజదండ ప్రాశస్త్యము చెప్పబడుచున్నది :

రాజు సత్పురుషులయందు శాస్త్రానుకూలమైన ధర్మమును విధించును. అహితులయందు అనిష్టమైన దండమును విధించును. దాని నెవరును అతిక్రమించరాదు. ఆ రాజు భయమువలననే స్థావరములు, చరములయిన భూతములు సర్వులకు భోగ్యవస్తువు లగుచున్నవి. అవి ధర్మమును అనుసరించుచున్నవి. రాజదండమే అందరిని శాసించు చున్నది. మరియు రక్షించు చున్నది. నిద్రించువారి విషయమున జాగృతమై యున్నది. అందుచేతనే పండితులు దండమును ధర్మమని చెప్పిరి. న్యాయబద్ధముగ వినియోగించిన ఆ దండము అందరిని రంజింప చేయును. అన్యాయముగ వినియోగించిన సర్వమును నాశనము చేయును. రాజు అలసుడై దండింప తగినవారియందు దండమును తగినట్లు ఉప యోగించనిచో బలవంతులు దుర్బలులను మాత్స్యన్యాయము ననుసరించి బాధింతురు.

సర్వో దండజితో లోకో దుర్లభో హి శుచి ర్నరః
దండస్య హి భయాత్సర్వం జగద్భోగాయ కల్పతే
దేవ దానవ గంధర్వా రక్షాంసి పతగోరగాః
తేఒపి భోగాయ కల్పంతే దండేనైవ నిపీడితాః

తం రాజా ప్రణయన్ సమ్యక్ త్రివర్గేణాభివర్ధతే
కామాత్మా విషమః క్షుద్రో దండేనైవ నిహన్యతే
దండో హి సుమహత్తేజో దుర్ధరశ్చా కృతాత్మభిః
ధర్మాద్విచలితం హంతి నృపమేవ సబాంధవమ్
తతో దుర్గం చ రాష్ట్రం చ లోకం చ సచరాచరమ్
అంతరిక్షగతాంశ్చైవ మునీన్ దేవాంశ్చ పీడయేత్
శుచినా సత్యసంధేన యథాశాస్త్రానుసారిణా
ప్రణేతుం శక్యతే దండః సుసహాయేన ధీమతా

దండ విధానము చెప్పబడుచున్నది :

లోకమంతయు దండభయముచేతనే సన్మార్గమున నడచు చున్నది. స్వభావవిశుద్ధమైన మానవుడు దుర్లభుడు. దండభయముచేతనే లోకమంతయు భోగానుకూల మగుచున్నది. దేవతలు, దానవులు, గంధర్వులు, రాక్షసులు, పక్షులు, సర్పములుకూడ పరమేశ్వరుని దండ భయముచేతనే వర్షాదులద్వారా భోగానుకూలు రగుచున్నారు. ఆ దండ మును సక్రమముగ ఉపయోగించిన రాజు ధర్మార్థకామములను సమృద్ధిగ పొందుచున్నారు. విషయాభిలాషి, క్షుద్రుడు అయిన రాజు ఆ దండము చేతనే శిక్షింపబడుచున్నాడు దండము గొప్ప తేజస్సు గలది. సంస్కార హీనులచే ధరింపశక్యముగానిది. ధర్మము తప్పిన రాజును సబాంధవ ముగ నశింపచేయును. దుర్గమును, రాష్ట్రమును, చరాచరమైన లోక మును, ఆకాశమున సంచరించు మునులను దేవతలనుగూడ బాధించును. అనగా యాగాదులు లేకపోవుటచే వారును దుఃఖమును పొందుదురు. శుచియు, సత్యసంధుడు, శాస్త్రము కనుసరించువాడు, శుభవర్తనుడు అగు రాజుచేతనే దండము ధరించుటకు శక్యమగుచున్నది.

ఏవం వృత్తస్య నృపతేః శిలోంఛేనాపి జీవతః
విస్తీర్యతే యశోలోకే తైలబిందు రివాంభసి
అతస్తు విపరీతస్య నృపతే రజితాత్మనః
సంక్షిప్యతే యశో లోకే ఘృతబిందు రివాంభసి
వృద్ధాంశ్చ నిత్యం సేవేత విప్రాన్ వేదవిద శ్శుచీన్
వృద్ధసేవీ హి సతతం రక్షోభి రపి పూజ్యతే
తేభ్యోఽధిగచ్ఛే ద్వినయం వినీతాత్మాపి నిత్యశః
వినీతాత్మా హి నృపతి ర్న వినశ్యతి కర్హిచిత్

పరిపాలకుని ప్రవర్తనా విధానము చెప్పబడినది —

పైన చెప్పిన విధముగ ప్రవర్తించురాజు ధనహీనుడైనను అతని కీర్తి ఉదకమునందు నూనెవలె లోకమంతయు వ్యాపించును. అజితేంద్రియుడై దీనికి విపరీతముగ ప్రవర్తించు రాజుకీర్తి నీటియందు నేయివలె సంక్షిప్తమగును. వేదవేత్తలు, పరిశుద్ధులు, వృద్ధులు అయిన విప్రులను సేవించవలయును. వృద్ధులను సేవించినవాడు రాక్షసులచేత గూడ పూజింపబడును. వినయము గలవాడయినప్పటికి రాజు పెద్దల వలన వినయము సంపాదించవలయును. వినయముగలరాజు ఎప్పుడూ నశించడు.

ఇంద్రియాణాం జయేయోగం సమాతిష్ఠే ద్దివానిశమ్
జితేంద్రియో హి శక్నోతి వశే స్థాపయితుం ప్రజాః
దశ కామసముత్థాని తథాష్టౌ క్రోధజాని చ
వ్యసనాని దురంతాని ప్రయత్నేన వివర్జయేత్
కామజేషు ప్రసక్తోహి వ్యసనేషు మహీపతిః
విసృజ్యతేఽర్థకామాభ్యాం క్రోధజే ష్వాత్మ నైవతు

మృగయాక్షో దివాస్వాపః పరివాదః స్త్రియో మదః
తౌర్యత్రికం వృథాట్యాచ కామజో దశకో గణః
పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణమ్
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోఽష్టకః
ద్వయో రప్యేతయో ర్మూలం యం సర్వే కవయో విదుః
తం యత్నేన జయే ల్లోభమేతజ్జాతా వుభౌ గుణౌ

రాజుచే పరిత్యజించదగిన వ్యసనములు చెప్పబడినవి :

రాత్రింబవళ్ళు ఇంద్రియజయమునందు ప్రయత్నపరుడు కావల యును. జితేంద్రియుడగు రాజు తన ప్రజలను వశమునందుచుకొన గలడు. కామమువలన పుట్టిన వ్యసనములు పది, మరియు క్రోధము వలన పుట్టిన వ్యసనములు ఎనిమిది-వీటి నన్నిటి నిప్రయత్న పూర్వక ముగ విడిచిపెట్టవలయును. కామజములైన వ్యసములందు ప్రవృత్తుడైన రాజు అర్థకామములచే విడిచిపెట్టబడును. క్రోధజములైన వ్యసనము లందు ప్రవృత్తుడైన రాజు తనచేతనే విడువబడుచున్నాడు అనగా స్వయముగా నశించును. వేట, జూదము, పగటినిద్ర, పరనింద, స్త్రీ సంబంధము, మదము, నృత్యగీతాదులు, వ్యర్థముగ సంచరించుటః అను అనునవి కామమువలన కలిగిన వ్యసనములు. లౌభ్యము, సాహసము ద్రోహము, ఈర్ష్య, అసూయ, ధనాపహరణము, వాక్పారుష్యము, దండపారుష్యము అనునవి ఎనిమిది క్రోధమువలన కలిగిన వ్యసనములు ఈ వ్యసనములకు మూలము లోభమనియే పండితులు చెప్పిరి, కాన అట్టి లోభమును విడిచిపెట్ట వలయును.

పాన మక్షాః స్త్రియశ్చైవ మృగయా చ యథా క్రమమ్
ఏత త్కష్టతమం విద్యా చ్చతుష్కం కామజే గణే

దండస్య పాతనం చైవ వాక్పారుష్యార్థ దూషణే
క్రోధజేఽపి గణే విద్యా త్కష్టమేత త్త్రికం సదా
వ్యసనస్య చ మృత్యోశ్చ వ్యసనం కష్టముచ్యతే
వ్యసన్యధోఽధో వ్రజతి స్వర్యాత్యవ్యసనీ మృతః
మౌలాఞ్ఛాస్త్రవిదః శూరాన్ లబ్ధలక్షాన్ కులోద్భవాన్
సచివాన్ సప్త చాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్
తైః సార్ధం చింతయే న్నిత్యం సామాన్యం సంధివిగ్రహమ్
స్థానం సముదయం గుప్తిం లబ్ధ ప్రశమనాని చ
తేషాం స్వంస్వ మభిప్రాయ ముపలభ్య పృథక్ పృథక్
సమస్తానాం చ కార్యేషు విదధ్యాద్ధిత మాత్మనః

కామజములైన వ్యసములందు మద్యపానము, జూదము, స్త్రీలు, వేట అనునవి నాలుగు మిక్కలి క్లేశదాయకములు. క్రోధజములైన వ్యసనములందు దండనము, వాక్పారుష్యము, ధనాపహరణము అనునవి మూడు క్లేశదాయకములు వ్యసనము, చావు అనువానిలో వ్యసనమే భయంకరమైనది. వ్యసనము గలవాడు పతనము చెందుచుండగ వ్యసన రహితుడు చచ్చియు పైకి స్వర్గాదిలోకములకు వెళ్ళును. వంశపారంపర్యముగ వచ్చునట్టివారు, శాస్త్రజ్ఞులు, శూరులు, ఉత్తమలక్షణములు గలవారు, ఉన్నతకులమున పుట్టినవారు అగు పురుషులను పరీక్షచేసి ఏడుగురినిగాని ఎనిమిదిమందినిగాని మంత్రులుగా నియమించవలయును. వారితో గలసి సంధి, విగ్రహము, దండకోశ, పుర రాష్ట్రముల స్థితి హస్త్యశ్వపదాతి రక్షణము, ధాన్యహిరణ్యాద్యుత్పత్తి, సత్పాత్రదానము అను వానిని గురించి విచారింపవలయును. వారియభిప్రాయములను వేరు వేరుగను తెలిసికొని హితమగు దానిని ఆచరించవలయును.

దూతం చైవ ప్రకుర్వీత సర్వశాస్త్ర విశారదమ్
ఇంగితాకార చేష్టజ్ఞం శుచిం దక్షం కులోద్భవమ్
అనురక్తః శుచిర్దక్షః స్మృతిమాన్ దేశకాలవిత్
వపుష్మాన్ వీతభీర్వాగ్మీ దూతో రాజ్ఞః ప్రశస్యతే
దూత ఏవ హి సంధత్తే భినత్త్యేవ చ సంహతాన్
దూత స్తత్కురుతే కర్మ భిద్యంతే యేన మానవాః

దూత లక్షణము లిట్లు చెప్పబడినవి ;

సర్వశాస్త్రవిశారదుడు : పరుల యింగితములను ఆకారములను, చేష్టలను తెలిసికొనగలవాడు ; శుచి దక్షుడు, ఉన్నతకులోద్భవుడు అగువానిని దూతగ నియమించవలయును రాజునందనురక్తుడు, శుచి, దక్షుడు. విషయవిస్మరణలేనివాడు, దేశకాలములు తెలిసినవాడు, మంచి శరీరముగలవాడు, భయములేనివాడు, వాగ్వైభవముగలవాడు అగు దూత రాజునకు ప్రశస్తుడగును. దూత శత్రువులను గలిపి మిత్రులను చేయ గలడు మిత్రులను వేరు చేయగలడు. దూత మానవులను భేదించ గలడు.

పాత్రస్య విశేషేణ శ్రద్ధదానతయైవ చ
అల్పం వా బహు వా ప్రేత్యదానస్య ఫలమశ్నుతే
సంగ్రామే ష్వనివర్తిత్వం ప్రజానాం చైవ పాలనమ్
శుశ్రూషా బ్రాహ్మణానాం చ రాజ్ఞాం శ్రేయస్కరం పరమ్
ఆహవేషు మిథోఽన్యోన్యం జిఘాంసంతో మహీక్షితః
యుధ్యమానాః పరం శక్త్యా స్వర్గం యాన్త్య పరాఙ్ముఖాః
న చ హన్యాత్ స్థలారూఢం న క్లీబం న కృతాంజలిమ్
న ముక్తకేశం నాసీనం న తవాస్మీతి వాదినమ్

ప్రతిగ్రహీత యోగ్యత ననుసరించియు, దానముచేయువాని శ్రద్ధ ననుసరించియు దానఫలము అల్పముగాగాని, అధికముగాగాని యుండును. ఈ ఫలము జన్మాంతరమున ఫలించును. యుద్ధమునందు వెనుకకు మరలకపోవుట, ప్రజలను పాలించుట, బ్రహ్మజ్ఞులను సేవించుట రాజునకు శ్రేయస్సును కలిగించును. వెన్నుచూపక పరస్పరజిగీషతో యుద్ధముచేసి మృతిబొందిన క్షత్రియులు స్వర్గమును పొందుదురు. భూమియందున్నవానిని, నపుంసకుని, చేతులు జోడించినవానిని, జుట్టుముడి యూడినవానిని, కూర్చున్నవానిని, నీ దాసుడనని చెప్పినవానిని చంపరాదు.

అలబ్ధం చైవ లిప్సేత లబ్ధం రక్షేత్ ప్రయత్నతః
రక్షితం వర్ధయేచ్చైవ వృద్ధం పాత్రేషు నిక్షిపేత్
అమాయయైవ వర్తేత న కథంచన మాయయా
బుధ్యేతారిప్రయుక్తాం చ మాయాం నిత్యం సుసంవృతః
నాస్య ఛిద్రం పరో విద్యా ద్విద్యా చ్ఛిద్రం పరస్యతు
గూహేత్కూర్మ ఇవాంగాని రక్షే ద్వివర మాత్మనః
సామాదీనా ముపాయానాం చతుర్ణామపి పండితాః
సామదండౌ ప్రశంసంతి నిత్యం రాష్ట్రాభివృద్ధయే

రాజధర్మములు వివరముగ చెప్పబడుచున్నవి :

లేనిదానిని సంపాదించవలయును సంపాదించినదానిని ప్రయత్నపూర్వకముగ రక్షించవలయును. రక్షించినదానిని వృద్ధిచేయ వలయును. వృద్ధిచేసినదానిని సత్పాత్రయందు వినియోగించవలయును. మోసము చేయకయే ప్రవర్తించవలయును. ఎప్పుడును మోసము చేయరాదు. రక్షణతోగూడినవాడై శత్రువులమాయను తెలుసుకొనవలయును, తన రాజ్యమునగల భేదభావమును శత్రువునకు తెలియనీయరాదు. శత్రు

రాజ్యమునగల భేదభావమును తెలుసుకొనవలయును, తాబేలువలె తన రాజ్యాంగములను తన స్థానమును రక్షించుకొనవలయును. సామము, దానము మొదలగు నాలుగు ఉపాయములలో సామదండములనే పండితులు రాష్ట్రాభివృద్ధికి యోగ్యములని చెప్పిరి.

> మోహాద్రాజా స్వరాష్ట్రం యః కర్షయత్యనవేక్షయా
> సోఽచిరాద్భ్రశ్యతే రాజ్యాజ్జీవితాచ్చ సబాంధవః
> గ్రామస్యాధిపతిం కుర్యాద్దశ గ్రామాధిపతిం తథా
> వింశతీశం శతేశంచ సహస్రపతిమేవ చ
> గ్రామదోషాన్ సముత్పన్నాన్ గ్రామికః శనకైః స్వయమ్
> శంసేద్గ్రామ దశేశాయ దశేశో వింసతీశినే
> వింశతీశస్తు తత్సర్వం శతేశాయ నివేదయేత్
> శంసేద్గ్రామ శతేశస్తు సహస్రపతయే స్వయమ్

తన రాజ్యమునందలి ప్రజలను అజ్ఞానకారణమున రక్షించనిరాజు కొలదికాలములోనే బంధువులతోగూడ రాజ్యమునుండియు జీవితమునుండియు భ్రష్టుడగును ఒక గ్రామమునకు ఒక అధిపతిని నియమించవలయును. ఇట్టి పది గ్రామములపై ఒక అధిపతిని, ఇరువది గ్రామములపై ఒక అధిపతిని, నూరుగ్రామములపై ఒక అధిపతిని, సహస్ర గ్రామములపై ఒక ఆధిపతిని నియమించవలయును. అనగా గ్రామాధికారిపై పదిగ్రామముల అధికారియు, పది గ్రామముల యధికారిపై ఇరువది గ్రామముల యధికారియు అతనిపై నూరు గ్రామముల యధికారియు, అతనిపై సహస్ర గ్రామముల యధికారియు అధికారము కలిగియుందురు అందువలననే గ్రామాధికారి తన గ్రామమునందలి కష్టనష్ట

ములను దశ గ్రామాధికారికి, దశ గ్రామాధిపతి వింశతి గ్రామాధిపతికి వింశతి గ్రామాధిపతి శత గ్రామాధిపతికి, శత గ్రామాదిపతి సహస్ర గ్రామాదిపతికి చెప్పవలయును.

> రాజ్ఞో హి రక్షాధికృతాః పరస్వాదాయినః శఠాః
> భృత్యా భవంతి ప్రాయేణ తేభ్యో రక్షేదిమాః ప్రజాః
> క్రయ విక్రయ మధ్వానం భక్తం చ సపరివ్యయమ్
> యోగక్షేమం చ సంప్రేక్ష్య వణిజో దాపయే త్కరాన్
> యథాల్పాల్ప మదంత్యాద్యం వార్యోకో వత్సషట్పదాః
> తథాల్పాల్పో గ్రహీతవ్యో రాష్ట్రా ద్రాజ్ఞాబ్దికః కరః
> నోచ్ఛింద్యా దాత్మనో మూలం పరేషాం చాతితృష్ణయా
> ఉచ్ఛిందన్ హ్యాత్మనో మూల మాత్మానం తాంశ్చ పీడయేత్
> తీక్ష్ణశ్చైవ మృదుశ్చ స్యాత్కార్యం వీక్ష్య మహీపతిః
> తీక్ష్ణశ్చైవ మృదుశ్చైవ రాజాభవతి సంమతః

రాజసేవకులు తరచుగా ప్రజలధనము నపహరించు బుద్ధిగలవారై యుందురు. వారినుండి ప్రజలను రక్షించవలయును. వ్యాపారులపై పన్ను వేయునపుడు అతడు అమ్ముచున్న వస్తువు కొన్నవిధము, మార్గమున దొంగలనుంచి రక్షించిన విధము, అడవులనుండి సంపాదించిన విధము మొదలగు విషయములను తెలుసుకొని పన్ను వేయవలయును. పద్మమందు నివసించెడు తుమ్మెదపిల్లలు మకరందబిందువులను స్వీకరించినటుల, రాజు ప్రజలనుండి అల్పాల్పముగ పన్నును గ్రహించ వలయును. ప్రజల మూలధనమును ముట్టరాదు పన్నులను సక్రమముగ గ్రహించలేకపోవుటచేత తనమూలచ్ఛేదమును అత్యాశచేత ప్రజలమూలచ్ఛేదమును చేయరాదు. తన మూలచ్ఛేదమువలన తనను తన ప్రజలను పీడించినవాడగును. రాజు అవసరమును గ్రహించి తీవ్రమైన వాడుగను

ప్రవర్తించ వలయును. తీక్ష్ణస్వభావము గలరాజు ప్రజలకు సమ్మతు డగును.

విక్రోశంత్యో యస్య రాష్ట్రాద్ధ్రియంతే దస్యుభిః ప్రజాః
సంపశ్యతః సభృత్యస్య మృతః స న తు జీవతి
క్షత్రియస్య పరోధర్మః ప్రజానా మేవ పాలనమ్
నిర్దిష్టఫలభోక్తా హి రాజా ధర్మేణ యుజ్యతే
గిరిపృష్ఠం సమారుహ్య ప్రాసాదం వా రహోగతః
అరణ్యే నిశ్శలాకే వా మంత్రయే దనిభావితః
యస్య మంత్రం న జానంతి సమాగమ్య పృథగ్జనాః
స కృత్స్నాం పృథివీం భుంక్తే కోశహీనోఽపి పార్థివః
మధ్యందినేఽర్ధరాత్రే వా విశ్రాంతో విగతక్లమః
చింతయే ద్ధర్మకామార్థాన్ సార్థంతై రేక ఏవ వా
దూత సంప్రేషణం చైవ కార్యశేషం తథైవ చ
అంతఃపుర ప్రచారం చ ప్రణిధీనాం చ చేష్టితమ్

అనుచరులతోగూడిన రాజు సమక్షములోనే దుఃఖితులైన ప్రజలు దొంగలచే బాధపడినచో ఆ రాజు మృతుడే యగును. ప్రజలను పరిపాలించుటయే రాజునకు ఉత్కృష్టమైన ధర్మము, తనకు తగినఫలమును మాత్రమే అనుభవించు రాజు ధర్మయుక్తు డగును. పర్వతశిఖరము నందుగాని, రహస్యగృహమునగాని, నిర్జనవనమునగాని, మంత్రాలోచన చేయవలయును రాజు కోశహీనుడైనను తన యాలోచన ప్రజలకు తెలియకుండగ నుంచగల్గినచో భూమండలమంతయు పరిపాలించ గలడు. మధ్యాహ్నసమయమునగాని, అర్ధరాత్రమునగాని శ్రమరహితుడయి విశ్రాంతిగ కూర్చొని మంత్రులతో గలసిగాని, ఒంటరిగాగాని

ధర్మార్థ కామములను గురించి విచారించవలయును. రాయబారములు, అంతిపుర విషయములు, గూఢచారిచేష్టలు, మొదలగువానిని విచారించ వలయును.

యదా మన్యేత భావేన హృష్టం పుష్టం బలం స్వకమ్
పరస్య విపరీతం చ తదా యాయా ద్రిపుం ప్రతి
యదా తు స్యాత్పరిక్షీణో వాహనేన బలేన చ
తదాసీత ప్రయత్నేన శనకైః సాంత్వయ న్నరీన్
శత్రుసేవిని మిత్రే చ గూఢే యుక్తతరో భవేత్
గత ప్రత్యాగతే చైవ స హి కష్టతరో రిపుః
అనిత్యో విజయో యస్మాద్దృశ్యతే యుధ్యమానయోః
పరాజయశ్చ సంగ్రామే తస్మా ద్యుద్ధం వివర్జయేత్
త్రయాణా మప్యుపాయానా పూర్వోక్తానాం మసంభవే
తథా యుధ్యేత సంపన్నో విజయేత రిపూన్యథా

తన సైన్యము బల సంతోషములతో నిండియున్నదనియు, పర బలము బలహీనమైనదనియు భావించినపుడు శత్రువుపై యుద్ధమునకు వెళ్ళవలయును తాను బలహీను డయినపుడు శత్రువును ప్రయత్న పూర్వకముగ శాంతింపజేయుచు కాలము గడుపవలయును శత్రువులను సేవించు మిత్రుల విషయమున రహస్యాతిరహస్యముగ నుండవలయును, ఆతని గమనాగమనములు గుర్తించవలయును. అతడు మిక్కిలి భయ కరమైన శత్రువు. యుద్ధమునందు జయాపజయములు అనిత్యముగ గన్పించుచున్నవి, అందుచే యుద్ధము విడిచిపెట్టవలయును. పూర్వము చెప్పిన మూడు ఉపాయములు విఫలమైనపుడు విజయముపొందు విధముగ యుద్ధమునకు వెళ్ళవలయును.

సర్వం కర్మేద మాయత్తం విధానే దైవ మానుషే
తయోర్దైవ మచింత్యం తు మానుషే విద్యతే క్రియా
హిరణ్యభూమి సంప్రాప్త్యా పార్థివో న తథైధతే
యథామిత్రం ధ్రువం లబ్ధ్వా కృశ మప్యాయతి క్షమమ్
ధర్మజ్ఞం చ కృతజ్ఞం చ తుష్టప్రకృతి మేవ చ
అనురక్తం స్థిరారంభం లఘుమిత్రం ప్రశస్యతే
ప్రాజ్ఞం కులీనం శూరం చ దక్షం దాతార మేవ చ
కృతజ్ఞం ధృతిమంతం చ కష్ట మాహు రరిం బుధాః

జయాపజయములు రెండును దైవమానుషశక్తులపై నాధారపడి యున్నవి అందు దైవవిషయము ఆలోచింపశక్యముగానిది. అందుచే మానవశక్తిని గురించియే సుదీర్ఘముగ ఆలోచింపవలయును. రాజునకు భూమివలన, బంగారమువలన పొందినదానికంటె స్థిరబుద్ధిగల మిత్రుని వలన మిక్కిలి యభివృద్ధి కలుగును. ధర్మజ్ఞుడు, కృతజ్ఞుడు, ప్రజా రంజకుడు, అనురక్తుడు, స్థిరమైనకార్యారంభము కలవాడు అగు మిత్రుడు ప్రశంసార్హుడు. ప్రాజ్ఞుడు, ఉన్నతకుల సంభూతుడు, శూరుడు, సమర్థుడు, దాత, కృతజ్ఞుడు, ధైర్యవంతుడు అగు శత్రువును జయించుట కష్టము.

తత్రాత్మభూతైః కాలజ్ఞైః హార్యైః పరిచారికైః
సుపరీక్షిత మన్నాద్య మద్యా న్మంత్రైర్విషాపహైః
విషఘ్నై రగదైశ్చాస్య సర్వద్రవ్యాణి యోజయేత్
విషఘ్నాని చ రత్నాని నియతో ధారయే త్సదా
పరీక్షితాః స్త్రియశ్చైనం వ్యజనోదకధూపకైః
వేషాభరణ సంశుద్ధాః స్పృశేయుః సుసమాహితాః

ఆత్మీయులు, కాలజ్ఞులు, భేదబుద్ధి లేనివాడగు పరిచారకులచే పరీక్షించబడిన అన్నమును భుజింపవలయును. దానినిగూడ విషహరములగు మంత్రములచే శుద్ధిచేయవలయును. అన్ని వస్తువులను విషహరములగు ఓషధులచే శుద్ధి చేయవలయును. విషహరములగు రత్నములను ఎల్లప్పుడు ధరించవలయును. రాజును సేవించు స్త్రీలందరిని పరీక్షించవలయును. అటు పిమ్మటే వింజామరలచేత, ఉదకములచేత, ధూపములచేత రాజును సేవించుటకు అర్హులగుదురు.

ఇది ఏడవ యధ్యాయము

*

# ఎనిమిదవ యధ్యాయము

వ్యవహారాన్ దిదృక్షు స్తు బ్రాహ్మణై స్సహ పార్థివః
మంత్రజ్ఞైః మంత్రిభిశ్చైవ వినీతః ప్రవిశేత్సభామ్
తత్రాసీనః స్థితో వాపి పాణి ముద్యమ్య దక్షిణమ్
వినీత వేషాభరణః పశ్యేత్కార్యాణి కార్యిణామ్
ప్రత్యహం దేశదృష్టైశ్చ శాస్త్రదృష్టైశ్చ హేతుభిః
అష్టాదశసు మార్గేషు నిబద్ధాని పృథక్పృథక్
తేషా మాద్య మృణాదానం నిక్షేపోఽస్వామి విక్రయః
సంభూయ చ సముత్థానం దత్తస్యానపకర్మ చ
వేతనస్యైవ చాదానం సంవిదశ్చ వ్యతిక్రమః
క్రయవిక్రయానుశయో వివాదః స్వామిపాలయోః
సీమా వివాదధర్మశ్చ పారుష్యే దండవాచకే
స్తేయం చ సాహసం చైవ స్త్రీ సంగ్రహణమేవ చ
స్త్రీ పుం ధర్మో విభాగశ్చ ద్యూత మాహ్వయ మేవ చ
పదాన్యష్టాదశైతాని వ్యవహారస్థితా విహ

రాజు వ్యవహారమును చూడదలచినవాడై బ్రాహ్మణులతోను, ఆలోచనా శక్తిగల మంత్రులతోను వినీతవేషుడై సభను ప్రవేశించ వలయును సభయందు ఆసనమలంకరించి దక్షిణహస్తమును పైకెత్తి వ్యవహారనిమిత్తమై వచ్చినవారందరి వ్యవహారములను వినీతవేషముతో చూడ వలయును. ప్రతిదినము దేశశాస్త్రకారణముల ననుసరించి పదు నెనిమిది విషయములను వేరువేరుగ విచారించవలయును. ఋణదానము.

న్యాసద్రవ్యము, తనదికానిదానిని అమ్ముట, వ్యాపారుల అమ్మకము, దానము చేసిన దానిని మరల గ్రహించుట, పనిజేసినదానికి ఇవ్వవలసినది ఇవ్వకపోవుట, చెప్పినదానినిచేయకపోవుట, అమ్మకము-కొనుగోలు, యజమాని సేవకవివాదము, సరిహద్దు వివాదము, వాక్పారుష్యాదులు, దండపారుష్యము, చౌర్యము, బలాత్కారము, స్త్రీసంబంధము, భార్యాభర్తల కలహము, పిత్రాది దాయభాగము, జూదము, పశువిషయక వివాదము-అనునవి పదునెనిమిది.

ఋణాదానము అనుపదమునకు నారదవాక్యములు ఇట్లు వివరణము చెప్పెను. ఋణం దేయ మదేయం చ యేన యత్ర యదా చ యత్, దాన గ్రహణ ధర్మా శ్చ తదృణాదాన ముచ్యతే, అనగా ఎవడు ఎచ్చట, ఎట్లు దేనిని నిచ్చెనో, దేనిని పుచ్చుకొనెనో, దాని వివరణము ఋణాదాన శబ్దముచే చెప్పబడును.

ఈ విషయములయందు వివాదపడుచున్నవారి విషయమున శాశ్వతమైన ధర్మము నాశ్రయించి విషయనిర్ణయము చేయవలయును.

ధర్మో విద్ధ స్త్వధర్మేణ సభాం యత్రోపతిష్ఠతే
శల్యం చాస్య న కృంతంతి విద్ధా స్తత్ర సభాసదః
సభాం వా న ప్రవేష్టవ్యం వ క్తవ్యం వా సమంజసమ్
అబ్రువ న్విబ్రువ న్వాపి నరో భవతి కిల్బిషీ
యత్ర ధర్మో హ్యధర్మేణ సత్యం చానృతేన చ
హన్యతే ప్రేక్షమాణానాం హతా స్తత్ర సభాసదః
ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః
తస్మాద్ధర్మో న హంతవ్యో మానో ధర్మో హతోఽవధీత్

వృషో హి భగవాన్ ధర్మ స్తస్య యః కురుతే హ్యలమ్
వృషలం తం విదుర్దేవా స్తస్మా ద్ధర్మం న లోపయేత్
ఏక ఏవ సుహృద్ధర్మో నిధనే ప్యనుయాతి యః
శరీరేణ సమం నాశం సర్వ మన్యద్ధి గచ్ఛతి
పాదోఽధర్మస్య కర్తారం పాదః సాక్షిణ మృచ్ఛతి
పాదో సభాసద స్సర్వాన్ పాదో రాజాన మృచ్ఛతి

"భా" యనగా ప్రకాశము. దానితో కూడినది సభ. ఏ సభయందు ధర్మము అధర్మముచే తిరస్కరింపబడునో ఆ సభయందలి యధర్మము సభయందలి సభ్యులను శల్యమువలె బాధించును. సభయందు ప్రవేశించ రాదు. ప్రవేశించినచో ధర్మము చెప్పవలయును. ధర్మమునకు వ్యతిరేకముగ చెప్పినవాడును, మౌనముగ నున్నవాడును పాపాత్ము లగుదురు. ఏ సభయందు ధర్మము అధర్మముచేతను సత్యముఅసత్యము చేతను బాధింపబడునో ఆ సభయందుగల సభ్యులు ఆపాపముచేతనే బాధించ బడుదురు. ధర్మమును తిరస్కరించినవారిని ధర్మమే చంపును, రక్షించిన వారిని రక్షించును, అందువలన మనము ధర్మమును చంపరాదు. ధర్మము మనలను చంపరాదు. కోరికలను వర్షించుటచేతనే ధర్మమునకు వృషమని పేరు. అట్టి ధర్మమునకు విరుద్ధముగ ప్రవర్తించినవానిని దేవతలు వృషలుడని పిలుతురు. అందుచే ధర్మమును విడువరాదు. ధర్మముయొక్క టియే స్థిరమైన మిత్రము; అదియే మరణకాలమున వెంటవచ్చుచున్నది. మిగిలినవన్నియు శరీరముతో సమముగా నశించుచున్నవి. పాపమునందలి పాదము కర్తను, మరియొక పాదము అబద్ధము చెప్పిన సాక్షిని క్రమ ముగా మిగిలిన రెండుపాదములు సభ్యులను రాజును పొందుచున్నవి,

ధర్మాసన మధిష్ఠాయ సంవీతాంగః సమాహితః
ప్రణమ్య లోకపాలేభ్యః కార్యదర్శన మాచరేత్
బాహ్యై ర్విభావయే ల్లింగై ర్భావ మంతర్గతం నృణామ్
స్వరవర్ణేంగితాకారై శ్చక్షుషా చేష్టితేన చ
ఆకారై రింగితై ర్గత్యా చేష్టయా భాషితేన చ
నేత్రవక్త్రవికారైశ్చ గృహ్యతేఽంతర్గతం మనః
బాల దాయాదికం రిక్థం తావ ద్రాజానుపాలయేత్
యావత్సస్యా త్సమావృత్తో యావ చ్చాతీత శైశవః
వశాఽపుత్రాసు చైవం స్యా ద్రక్షణం నిష్కులాసు చ
పతివ్రతాసు చ స్త్రీషు విధవా స్వాతురాసు చ
జీవంతీనాం తు తాసాం యే తద్ధరేయుః స్వబాంధవాః
తాఞ్ఛిష్యా చ్చౌర దండేన ధార్మికః పృథివీపతిః
న్యాయ విచారణ విషయము చెప్పబడినది.

రాజు ధర్మపర్యవేక్షణకొరకు ఆసనమలంకరించి వస్త్రాచ్ఛాదన కలవాడై లోకరక్షకులగు దేవతలకు నమస్కరించి ధర్మవిచారణ చేయవలయును. న్యాయ నిమిత్తము వచ్చిన మానవుల కంఠస్వరము అక్షరముల స్పష్టత, శరీరాకారము, చేష్టలు, కన్నులు మొదలగు బాహ్య చిహ్నములచే వారల మనస్సునందుగల భావమును గుర్తించ వలయును. ఆకారములచేత, చేష్టలచేత, సంభాషణచేత, కన్నులయందు, ముఖము నందు గల మార్పులచేత మానవులందు దాగిన మానసభావము గుర్తించ బడు చున్నది. రక్షణలేని బాలలయొక్క ఆస్తిని వారు గురుకులమునుండి వచ్చువరకు, బాల్యము గడుచునంతవరకు రక్షించవలయును. వంధ్యలు పరదేశమునకు వెళ్ళిన భర్తలు గలవారు, దాయాదులులేనివారు పతివ్రతలు విధవలు, రోగగ్రస్తులు అయిన స్త్రీలధనమును బాలురధనము వలెనే

రాజు రక్షించవలయును. అట్టివారలు జీవించియుండగ వారల ధనమును అపహరించినవారిని చోరులవలెనే శిక్షించవలయును.

మమేదమితి యో బ్రూయాత్సోఽనుయోజ్యో యథావిధి
సంవాద్య రూపసంఖ్యాదీన్ స్వామీ తద్ద్రవ్య మర్హతి
అవేదయానో నష్టస్య దేశం కాలం చ తత్త్వతః
వర్ణం రూపం ప్రమాణం చ తత్సమం దండమర్హతి
మమాయ మితి యో బ్రూయా న్నిధిం సత్యేన మానవః
తస్యాదదీత షడ్భాగం రాజా ద్వాదశమేవ వా
నిధీనాంతు పురాణానాం ధాతూనామేవ చ క్షితౌ
అర్ధభాగ్రక్షణా ద్రాజా భూమే రధిపతిర్హి సః
దాతవ్యం సర్వవర్ణేభ్యో రాజ్ఞాచోరైర్హృతం ధనమ్
రాజా తదుపయుంజాన శ్చోరస్యాప్నోతి కిల్బిషమ్
జాతి జానపదాన్ ధర్మాన్ శ్రేణీధర్మాంశ్చ ధర్మవిత్
సమీక్ష్య కులధర్మాంశ్చ స్వధర్మం ప్రతిపాదయేత్
స్వాని కర్మాణి కుర్వాణా దూరే సంతోఽపి మానవాః
ప్రియా భవంతి లోకస్య స్వే స్వే కర్మణ్యవస్థితాః

దొరికిన ద్రవ్యమును గురించిన రూపము, కొలత, సంఖ్య యథాతథముగ చెప్పినవాడు ఆ ద్రవ్యమును గ్రహించుటకు అర్హుడు. అటుల కాక తనదికాని ద్రవ్యమును తనదనిచెప్పినవాడు. ఆ ద్రవ్యవివరణము చెప్పలేనివాడు ఆ ద్రవ్యమునకు సమమైన ద్రవ్యము చెల్లించుటద్వారా తన తప్పునకు తగిన శిక్ష యనుభవించవలయును. భూమియందు దొరికిన నిధిని గురించి నాదియని చెప్పినవాడు ఆ ద్రవ్యము పొందుటకు అర్హుడు దాని నుండి రాజు ఆరవభాగమును గాని పంద్రెండవభాగము గాని

గ్రహించవచ్చును. రాజు భూమికి ప్రభువుగావున భూమియందు దొరికిన నిధియందుగాని లోహాదులయందుగాని సగభాగము గ్రహించుటకు అర్హుడు, దొంగలచే నపహరించబడిన ధనమంతయు, ఎవరిది వారికి ఇవ్వవలయును. రాజు దానిని గ్రహించిన దొంగతనమువలన కలుగుపాపమును పొందును. జాతిధర్మములను, గ్రామధర్మములను, వ్యాపారధర్మములను, కులధర్మములను గుర్తించి ధర్మపరిపాలన చేయవలయును. తమ తమ ధర్మములను పాలించువారు దూరముగ నున్నప్పటికి లోకమునకు ప్రియమైన వారే యగుదురు.

యథా నయత్యసృక్పాతై ర్మృగస్య మృగయుః పదమ్
నయే త్తథానుమానేన ధర్మస్య నృపతిః పదమ్
సద్భి రాచరితం యత్స్యాద్ధార్మికై శ్చ ద్విజాతిభిః
తద్దేశ కుల జాతీనా మవిరుద్ధం ప్రకల్పయేత్
అధమర్ణార్థ సిద్ధ్యర్థ ముత్తమర్ణేన చోదితః
దాపయే ద్ధనిక స్యార్థ మధమర్ణా ద్విభావితమ్
యైర్యై రుపాయై రర్థం స్వం ప్రాప్నుయా దుత్తమర్ణికః
తైస్తై రుపాయై స్సంగృహ్య దాపయే దధమర్ణికమ్

వేటగాడు బాణపుదెబ్బ తగిలిన మృగముయొక్క రక్తబిందువులచే దాని మార్గమును కనుగొనినటుల రాజు అనుమాన ప్రమాణములచే ధర్మమును గుర్తించవలయును. పెద్దలచే నాచరించబడినది, ధార్మికులైన బ్రాహ్మణులచే నాచరింపబడినది. దేశకులజాతులకు తగినది యగు ధర్మమునకు అవిరుద్ధముగ ప్రవర్తించవలయును, ఋణదాత తన ఋణ నిమిత్తమై రాజునకు నివేదించినచో ఋణగ్రాహకునినుండి ఆ ఋణ ద్రవ్యము నిప్పించవలయును. అతడు సహజముగ నివ్వనిచో తగిన యుపాయము నాలోచించి యిప్పించవలయును.

గృహిణః పుత్రిణో మౌలాః క్షత్రవిట్ శూద్రయోనయః
అర్థ్యుక్తాః సాక్ష్య మర్హంతి న యే కేచి దనాపది
ఆప్తాః సర్వేషు వర్ణేషు కార్యాః కార్యేషు సాక్షిణః
సర్వధర్మ విదోఽలుబ్ధా విపరీతాం స్తు వర్జయేత్
నార్థసంబంధినో నాప్తా న సహాయా న వైరిణః
న దృష్ట దోషాః కర్తవ్యా న వ్యాధ్యార్తా న దూషితాః
నా ధ్యధీనో న వక్తవ్యో న దస్యు ర్న వికర్మకృత్
న వృద్ధో న శిశు ర్నైకో నాంత్యో న వికలేంద్రియః
నార్తో న మత్తో నోన్మత్తో న క్షుత్తృష్ణోప పీడితః
న శ్రమార్తో న కామార్తో న వృద్ధో నాపి తస్కరః
స్త్రీణాం సాక్ష్యం స్త్రియః కుర్యు ర్ద్విజానాం సదృశా ద్విజాః
శూద్రా శ్చ సంత శ్శూద్రాణా మంత్యానా మంత్యయోనయః

సాక్ష్యము చెప్పుటకు తగిన యోగ్యులను గురించి చెప్పబడుచున్నది.

గృహస్థులు, పుత్రవంతులు, ఆ దేశమునందు పుట్టిన క్షత్రియ వైశ్యశూద్రులు సాక్ష్యము చెప్పుటకు తగినవారు. పూర్వము రాజదండనము ననుభవించువారు సాక్ష్యము చెప్పుటకు తగరు. యధార్థము చెప్పువారు సర్వధర్మములు తెలిసినవారు, లౌల్యము లేనివారు సాక్ష్యము చెప్పుటకు తగుదురు. ధనసంబంధము కలిగినవారు, ఆప్తులు కానివారు, నింద్యులు, సాక్ష్యమునకుతగరు. అస్వతంత్రుడు, దొంగ, నిషిద్ధకర్మలు చేయువాడు, వృద్ధుడు, శిశువు, ఒంటరివాడు, వికలమైన ఇంద్రియములు గలవాడు, సాక్ష్యమునకు తగరు. ఆర్తుడు, మత్తుడు, ఆకలి దప్పికలతో బాధపడువాడు, శ్రమపీడితుడు, కామపీడితుడు, కోపిష్ఠి సాక్ష్యమునకు తగరు. స్త్రీలవిషయమున సాక్ష్యము చెప్పుటకు స్త్రీలు, ద్విజాతుల విషయ

మున ద్విజాతులు, శూద్రుల విషయమున యోగ్యులకు శూద్రులు సాక్ష్యమున కర్తలు.

సమక్ష దర్శనా త్సాక్ష్యం శ్రవణాచ్చైవ సిధ్యతి
తత్ర సత్యం బ్రువన్ సాక్షీ ధర్మార్థాభ్యాం న హీయతే
సత్యం సాక్ష్యే బ్రువన్ సాక్షీ లోకా నాప్నోతి పుష్కలాన్
ఇహచానుత్తమాం కీర్తిం వాగేషా బ్రహ్మపూజితా
సత్యేన పూయతే సాక్షీ ధర్మః సత్యేన వర్ధతే
తస్మాత్సత్యం హి వక్తవ్యం సర్వవర్ణేషు సాక్షిభిః
ద్యౌ ర్భూమి రాపో హృదయం చంద్రార్కాగ్నియమానిలాః
రాత్రి స్సంధ్యే చ ధర్మశ్చ వృత్తజ్ఞా స్సర్వ దేహినామ్
బ్రహ్మఘ్నో యే స్మృతా లోకా యే చ స్త్రీబాలఘాతినః
మిత్రద్రుహః కృతఘ్నస్య తే తే స్యు ర్బ్రువతో మృషా
జన్మ ప్రభృతియత్కించి త్పుణ్యం భద్ర త్వయా కృతమ్
తత్తే సర్వం శునో గచ్ఛే ద్యది బ్రూయా స్త్వమన్యథా

ప్రత్యక్షముగ చూచుటవలన వినుటవలన సాక్ష్యము చెప్పుట సిద్ధించును. సాక్ష్యమున నిజము చెప్పినవానికి ధర్మార్థముల లోపము ఎప్పటికిని కలుగదు. సాక్ష్యమున సత్యము చెప్పినవాడు సమృద్ధములైన లోకములను పొందును ఈ లోకమున, పరలోకమునగూడ కీర్తిని సంపాదించును ఇట్టివాక్కు బ్రహ్మచే పూజింపబడును. సత్యవాక్యముచే సాక్షి పవిత్రుడగును సత్యముచే ధర్మము వృద్ధి యగును. అందువలన అన్నివర్ణముల వారిచేత సత్యమే చెప్పతగి యున్నది. సమస్తజీవుల ప్రవృత్తిని ఆకాశము, భూమి, ఉదకము, మనస్సు, చంద్ర సూర్యులు, అగ్ని, యముడు, వాయువు, రాత్రింబవళ్ళు, ఉభయసంధ్యలు, ధర్మము తెలిసికొనుచున్నవి. అబద్ధము చెప్పినవాడు బ్రహ్మఘ్నులు, స్త్రీబాల హంతకులు, మిత్రద్రోహులు, కృతఘ్నులు, పొందులోకములను

పొందుదురు. ఆబద్ధము చెప్పినచో పుట్టినది మొదలు సంపాదించిన పుణ్యమంతయు కుక్కలను చేరును.

న వృధా శపథం కుర్యాత్స్వల్పేఽప్యర్థే నరో బుధః
వృధా హి శపథం కుర్వన్ ప్రేత్యచేహ చ నశ్యతి

చిన్న చిన్న విషయముల నిమిత్తమై ప్రమాణము చేయరాదు. వ్యర్థముగ ప్రమాణము చేసినవాడు ఈ లోకమున పరలోకమున గూడ నాశనము పొందును.

అధర్మ దండనం లోకే యశోఘ్నం కీర్తినాశనమ్
అస్వర్గ్యం చ పరత్రాపి తస్మాత్త తత్పరివర్జయేత్
అదండ్యాన్ దండయన్ రాజా దండ్యాంశ్చాప్యదండయన్
అయశో మహ దాప్నోతి నరకం చైవాధిగచ్ఛతి
వాగ్దండం ప్రథమం కుర్యాద్ధిగ్దండం తదనంతరమ్
తృతీయం ధనదండంతు వధదండ మతః పరమ్

అన్యాయముగ శిక్షించుట ఈ లోకమున కీర్తిప్రతిష్ఠలను, పరలోకమున స్వర్గమును నశింపచేయును, దండింప దగనివానిని దండించుట వలన, దండించ తగినవారిని దండించకపోవుటవలన, రాజు అపకీర్తిని నరకమునుగూడ పొందును మొదట మాటలచే శిక్షించవలయును అటు పిమ్మట క్రమముగ నిందావాక్యములచే, ధనదండనముచే, శారీరక దండనముచే శిక్షించవలయును.

యత్కించి ద్దశవర్షాణి సన్నిధౌ ప్రేక్షతే ధనీ
భుజ్యమానం పరైస్తూష్ణీం న స తల్లబ్ధు మర్హతి

తన యాస్తిని పరు లనుభవించుచున్నను పదిసంవత్సరముల కాలము మాటాడక యూరకున్న ధనికుడు దానిని పొందుటకు అర్హుడు కాడు. అది అనుభవించువానికే చెందును.

ఋణం దాతు మశక్తో యః కర్తు మిచ్ఛే త్పునః క్రియామ్
స దత్త్వా నిర్జితాం వృద్ధిం కరణం పరివర్తయేత్
సముద్రయాన కుశలా దేశకాలార్థ దర్శినః
స్థాపయంతి తు యాం వృద్ధిం సా తత్రాధిగమం ప్రతి
ప్రతిభాష్యం వృథాదాన మాక్షికం సౌరికం చ యత్
దండశుల్కావశేషం చ న పుత్రో దాతు మర్హతి
మత్తోన్మత్తార్తా ద్యధనై ర్బాలేన స్థవిరేణ వా
అసంబద్ధకృతై శ్చైవ వ్యవహారో న సిద్ధ్యతి
సత్యా న భాషా భవతి యద్యపి స్యా త్ప్రతిష్ఠితా
బహి శ్చే ద్భాష్యతే ధర్మా న్నియతా ద్వ్యవహారికాత్
గ్రహీతా యది నష్టః స్యా త్కుటుంబార్థే కృతో వ్యయః
దాతవ్యం బాంధవై స్తత్స్యాత్ప్రవిభక్తై రపి స్వతః
కుటుంబార్థేఽధ్యధీనోఽపి వ్యవహారం య మాచరేత్
స్వదేశే వా విదేశే వా తం జ్యాయా న్న విచాలయేత్
వడ్డి వ్యాపార విషయము వివరించబడినది.

అప్పు తీర్చుటకు సామర్థ్యము లేనపుడు వడ్డినిచ్చి కాగితమును తిరిగి వ్రాయవలయును. సముద్ర ప్రయాణముచేయువారు దేశకాలములు తెలిసినవారు నిర్ణయించిన వడ్డీని స్థిరపరచవలయును. సాహసముగ నీయబడిన దానము, జూదమున ఋణపడిన ధనము, మద్యపానమునకైన అప్పు, ప్రభుత్వము విధించిన శిక్షారూపమైన ధనము పుత్రుడు, ఈయ నక్కరలేదు. మత్తుడు, పిచ్చివాడు, ఆర్తుడు, అస్వతంత్రుడు, బాలుడు, వృద్ధుడు చేసిన వ్యవహారము, అధర్మముగ చేసినవ్యవహారము, సిద్ధింప నేరదు. స్థిరమైన వ్యవహారమునకు విరుద్ధముగ చేసిన వ్యవహారము

ధర్మమునకు విరుద్ధముగ చేసిన వ్యవహారము పత్రముగ నున్నప్పటికి సమర్థనీయముగాదు, అప్పుచేసినవాడుచనిపోయినను కుటుంబ నిమిత్తము చేసినఅప్పును పుత్రులకు, బంధువులకు తీర్చవలసియున్నది. సేవక వృత్తియందున్న వారు స్వ దేశమునందుగాని వి దేశమునందుగాని కుటుంబ నిమిత్తమై చేసిన అప్పును కుటుంబ యజమాని తీర్చవలయును.

బలాద్దత్తం బలాద్భుక్తం బలాద్యచ్చాపి లేఖితమ్
సర్వాన్బలకృతానర్థా నకృతాన్ మను ర బ్రవీత్
అనాదేయం నాదతీత పరిక్షీణోఽపి పార్థివః
నచాదేయం సమృద్ధోఽపి సూక్ష్మమప్యర్థ ముత్సృజేత్
అనాదేయస్య చాదానా దాదేయస్య చ వర్జనాత్
దౌర్బల్యం ఖ్యాప్యతే రాజ్ఞః స ప్రేత్యేహ చ పశ్యతి
స్వాదానా ద్వర్ణసంసర్గా దబలానాం చ రక్షణాత్
బలం సంజాయతే రాజ్ఞః స ప్రేత్యేహ చ వర్ధతే
తస్మా ద్యమ ఇవ స్వామీ స్వయం హిత్వా ప్రియాప్రియే
వర్తేత యామ్యయా వృత్త్యా జితక్రోధో జితేంద్రియః
యస్త్వధర్మేణ కార్యాణి మోహాత్కుర్యా న్నరాధిపః
అచిరాత్తం దురాత్మానం వశే కుర్వంతి శత్రవః
కామక్రోధౌ తు సంయమ్య యోఽర్థాన్ ధర్మేణ పశ్యతి
ప్రజాస్త మనువర్తంతే సముద్ర మివ సింధవః

బలవంతముగ నిప్పించబడినది, బలవంతముగ ననుభవించబడినది బలవంతముగ వ్రాయించబడినది చెల్లనేరవు—అని మనువు చెప్పెను. రాజు దారిద్ర్యపీడితుడైనను: తాను గ్రహించరానిదానిని గ్రహించరాదు.

ససమృద్ధుడైనను తనకు రావలసినదానిని కొంచెమైనను విడువరాదు. తీసుకొనరానిదానిని తీసుకొనుటవలన, రావలసినదానిని విడిచిపెట్టుటవలన లోకమునందు బలహీనుడను పేరునుపొందును. ఈ లోకమునందును పర లోకమునందునునష్టమును పొందును. తనకురావలసినదానిని గ్రహించుట వలన,అందరినిశాస్త్రముననుసరింపచేయుటవలన, బలహీనులను రక్షించుట వలన రాజునకు బలముపెరుగును అట్టివాడు ఈ లోకమునందును పర లోకమునందును అభివృద్ధిగాంచును. రాజు యమునివలె తన ప్రియా ప్రియములను విడిచి జితేంద్రియుడై జితక్రోధుడై పరిపాలించవలయును రాజు అజ్ఞానకారణమున అధర్మకార్యములు చేసినచో అతని శత్రువులు కొలదికాలములోనే స్వాధీనము చేసుకొనగలరు. కామ క్రోధములు నిగ్రహించి ధర్మముననుసరించు రాజును ప్రజలు నదులు సముద్రునివలె అనుసరింతురు.

విక్రీణీతే పరస్య స్వం యోఽస్వామీ స్వామ్యసంమతః
న తం నయేత సాక్ష్యం తు స్తేన మస్తేన మానినమ్
అస్వామినా కృతో యస్తు దాయో విక్రయ ఏవ వా
అకృత స్సతు విజ్ఞేయో వ్యవహారే యథాస్థితిః
సంభోగో దృశ్యతే యత్ర న దృశ్యేతాగమః క్వచిత్
ఆగమః కారణం తత్ర న సంభోగ ఇతి స్థితిః

తనది కానిదానిని, ఇతరుల యాస్తిని, వారి యమనుతి లేకుండగ అమ్మినవాడు సాక్ష్యమునకు తగడు అట్టివాడు తనను దొంగను కాదని యనుకొనుచున్నను దొంగయే యగును తనది కానిదానిని దానము చేసినను అమ్మినను అది చెల్లనేరదు. పూర్వము ఎవరిదో వారి దేయగును. క్రయ విక్రయములద్వారా లభించనిదానిని అనుభవించినంతమాత్రమున తనదికాదు. అది ఎవరికి చెందినదో వారిదే యగును.

ధర్మార్థం యేన దత్తంస్యాత్కస్మైచి ద్యాచతే ధనమ్
పశ్చాచ్చ న తథా తత్స్యాన్న దేయం తస్య తద్ధనమ్
భృతో నార్తో న కుర్యా ద్యోదర్పా త్కర్మ యథోదితమ్
స దండ్యః కృష్ణలాన్యష్టౌ న దేయంచాస్య వేతనమ్
ఆర్తస్తు కుర్యాత్స్వస్థః సన్యథాభాషిత మాదితః
స దీర్ఘస్యాపి కాలస్య తల్లభేతైవ వేతనమ్
యో గ్రామదేశ సంఘానాం కృత్వా సత్యేన సంవిదమ్
విసంవద న్నరో లోభా త్తం రాష్ట్రా ద్వి ప్రవాసయేత్
క్రీత్వా విక్రీయ వా కించి ద్యస్యేహానుశయో భవేత్
సోఽంతర్దశాహా త్తద్ద్రవ్యం దద్యాచ్చైవాదదీత వా

ధర్మనిమిత్తము దానమడిగినవారు, తాము చెప్పిన విధముగ ధర్మ నిర్వహణముచేయనిచో వారికాదానము చేయ నక్కరలేదు. సేవకుడు స్వస్థుడై తాను చెప్పినవిధముగ తనపనిని నిర్వర్తింపనిచో నతనికి వేతనమీయనక్కరలేదు. ఎనిమిదికృష్ణల పైకము దండనము విధించవలయును రోగపీడితుడైనవాడు తాను చెప్పినవిధముగసకాలములోపనిపూర్తిచేయక కాలాంతరమునచేసినను ఆతనికీయవలసినధనము పూర్తిగనీయవలయును గ్రామదేశవాసుల సమక్షమున తాను నిర్వర్తించవలసిన పనినిగురించి సప్రమాణముగచెప్పి. చెప్పినట్లు చేయునివానిని రాజు తనదేశమునుండి వెడలగొట్టవలయును. క్రయవిక్రయవిషయములందు కొంచెముధనమిచ్చి పిమ్మట తనకది నచ్చనిచో పదిదినములలోపల ఇచ్చినధనమును తిరిగి తీసుకోవలయును లేక పుచ్చుకొనిన ధనమును తిరిగి ఈయవలయును.

అకన్యేతి తు యాంకన్యాం బ్రూయా ద్ద్వేషేణ మానవః
స శతం ప్రాప్నుయా ద్దండం తస్యా దోష మదర్శయన్

పవిత్రమైన కన్యను అపవిత్రురాలని నిందించి, ఆమెయందు గల దోషము నిరూపణ చేయనిచో నూరునాణెముల దండమును విధించ వలయును.

దివా వక్తవ్యతా పాలే రాత్రౌ స్వామిని తద్గృహే
యోగక్షేమేఽన్యథాచేత్తు పాలోవక్తవ్యతా మియాత్
విఘుష్య తు హృతం చోరైర్నపాలోదోష మర్హతి
యది దేశే చ కాలే చ స్వామినః స్వస్య శంసతి
తత్రా పరివృతం ధాన్యం విహింస్యుః పశవో యది
న తత్ర ప్రణయే ద్దండం నృపతిః పశురక్షిణామ్
పథిక్షేత్రే పరివృతే గ్రామాంతీయేఽథవా పునః
స పాలః శతదండార్హో విపాలాన్ వారయే త్పశూన్
అనిర్దశాహాం గాం సూతాం వృషాన్ దేవపశూం స్తథా
సపాలాన్వా విపాలాన్వా న దండ్యా న్మను రబ్రవీత్.

పశుపాలన విషయము చెప్పబడినది :

పశువులవలనకలిగిన నష్టములకు పగటియందుకాపలావాడు, రాత్రి యందు యజమాని బాధ్యులు, అటులగాక రాత్రియందును పాలకునిదే బాధ్యతయైనచో అతనిచ్చే నింపవలయును యజమానిపశువులు బలవంతముగ దొంగలచే నపహరించబడినచో దానికి పాలకుడు బాధ్యుడుగాడు. దొంగిలించబడిన విషయము యజమానికి తెలియచేయవలయును ఆవరణ లేని ప్రదేశమునందలి ధాన్యమును పశువులు భక్షించినచో పాలకుని రాజు దండించరాదు. మార్గమునందు, ఆవరణగల క్షేత్రములందు పశువులు భక్షించిన పాలకునికి నూరు పణములు దండనము విధించవలయును. పాలకుడులేని పశువులను క్షేత్రస్వామియే బయటకు తోలవలయును.

ప్రసవసమయమునుండి పది దినములు గడవని ఆవును, ఆంబోతులను పాలకులున్నను, లేకున్నను, దండింపరాదని మనువు చెప్పెను.

సీమాంప్రతి సముత్పన్నే వివాదే గ్రామయోర్ద్వయోః
జ్యేష్ఠేమాసి నయే త్సీమాం సుప్రకాశేషు సేతుషు
సీమావృక్షాంశ్చ కుర్వీత న్యగ్రోధాశ్వత్థ కింశుకాన్
శాల్మలీన్ సాలతాలాంశ్చ క్షీరిణశ్చైవ పాదపాన్
తటాకా న్యుదపానాని వాప్యః ప్రస్రవణాని చ
తే వృష్టాస్తు యథా బ్రూయుః సమస్తాః సీమనిశ్చయమ్
నిబధ్నీ యాత్తథా సీమాం సర్వాం స్తాం శ్చైవ నామతః

ఊరి పొలిమేరల గురించి వివాదము వచ్చినప్పుడు కరకట్టలు బాగా కనిపించునట్టి జ్యేష్ఠమాసమున సీమల నిర్ణయము చేయవలయును. పొలిమేరలను తెలియచేయుటకు పాలుకల జువ్విచెట్లను, మర్రిచెట్లను, తాటిచెట్లను, రావిచెట్లను, నాటవలయును. చెరువులను, నీటిమడుగులను దేవాలయములను, పొలిమేరలయందు నిర్మించవలయును. అందరు కలసి దేనిని పొలిమేరగా చెప్పుదురో దానినే నిశ్చయించవలయును.

మాతరం పితరం జాయాం భ్రాతరం తనయం గురుమ్
ఆక్షారయఞ్ఛతం దాప్యః పంథానం చాదదద్గురోః
మనుష్యాణాం పశూనాం చ దుఃఖాయ ప్రహృతేసతి
యథా యథా మహద్దుఃఖం దండం కుర్యాత్తథాతథా

తల్లిని, తండ్రిని, భార్యను, సోదరుని, కుమారుని, గురువును, నిందించినవానికి, గురువునకు దారినియ్యనివానికి నూరునాణెముల దండము విధించవలయును. మనుష్యులను, పశువులను బాధించినచో ఆ బాధకు తగినటుల కొట్టినవానిని దండించవలయును.

యానస్యైవ యాతుశ్చ యానస్వామిన ఏవ చ
దశాతివర్తనాన్యాహుః శేషే దండో విధీయతే
ఛిన్ననాస్యే భగ్నయుగే తిర్యక్ప్రతిముఖాగతే
అక్షభంగే చ యానస్య చక్రభంగే తథైవ చ
ఛేదనే చైవ యంత్రాణాం యోక్త్రరశ్మ్యో స్తథైవ చ
ఆక్రందే చాప్యపైహీతి న దండం మనురబ్రవీత్
యత్రావర్తతే యుగ్యం వైగుణ్యాత్ప్రాజకస్య తు
తత్ర స్వామీ భవేద్దండ్యో హింసాయాం ద్విశతం దమః
మనుష్యమారణేక్షిప్రం చోరవత్కిల్బిషం భవేత్
ప్రాణభృత్సు మహత్స్వర్ధం గోగజోష్ట్రహయాదిషు

శకటాదులవలన కలిగిన ప్రమాదవిషయమున దండవిధానము చెప్పబడినది :

శకటము నడుపువాడు యజమాని అనువారివలన కలిగిన పది ప్రమాదవిషయములు మినహాయించి దండనము చెప్పబడినది. ఆ పది విషయములు ఇవి —

వృషభమునకు కట్టిన పగ్గపుత్రాళ్ళు తెగుట, బండికిగల కర్రలు విరుగుట, భూమియందలి మిట్టపల్లముల వలన బండి తిరుగబడుట, చక్రమునందలి ఆకులు విరుగుట, చక్రము విరుగుట, ఇరుసు విరుగుట, యంత్రములు విరుగుట, ఎద్దులకు కట్టిన చర్మాదుల పట్టెడలు తెగుట, 'తొలగిపొం'డని పెద్దగా అరచుట - అనువాని వలన కలిగిన ప్రమాదములకు దండనము లేదు.

అసమర్థుడైన సారధికారణమున కలిగిన ప్రమాదమునందు యజమాని శిక్షార్హుడు. ప్రాణిహింస జరిగినచో రెండువందల నాణెముల శిక్ష విధించవలయును. మానవుడు చనిపోయినచో దొంగతనమునందు వలె పాపము కలుగును. పశువులు చనిపోయిన పంచశత పణములు శిక్ష విధించవలయును.

పరమం యత్న మాతిష్ఠేత్ స్తేనానాం నిగ్రహే నృపః
స్తేనానాం నిగ్రహాదస్య యశో రాష్ట్రం చ వర్ధతే
అభయస్య హి యో దాతా స పూజ్యః సర్వతో నృపః
సత్రం హి వర్ధతే తస్య సదైవాభయ దక్షిణమ్
సర్వతోధర్మ షడ్భాగో రాజ్ఞో భవతి రక్షతః
అధర్మాదపి షడ్భాగో భవత్యస్య హ్యరక్షతః
యదధీతే యద్యజతే యద్దదాతి యదర్చతి
తస్య షడ్భాగభాగ్రాజా సమ్యగ్భవతి రక్షణాత్
రక్షన్ ధర్మేణ భూతాని రాజా వద్యాంశ్చ ఘాతయన్
యజతేఽహరహర్యజ్ఞైః సహస్రశత దక్షిణైః
యోఽరక్షన్ బలి మాదత్తే కరం శుల్కం చ పార్థివః
ప్రతిభాగం చ దండం చ స సద్యో నరకం వ్రజేత్

రాజు దొంగలను బంధించుటయందు సంసిద్ధుడైయుండవలయును. దొంగలను బంధించుటవలన కీర్తియు రాష్ట్రాభివృద్ధియు కలుగును. సత్రమనునది యాగవిశేషము. దానివలెనే అభయమే దక్షిణగాగల దాజ్యము వృద్ధిచెందును. లోకరక్షణమువలన రాజునకు ప్రజల ధర్మాచరణము నందు ఆరవభాగము లభించును అటులనే రక్షించక పోవుటవలన అధర్మమునందు ఆరవభాగము లభించును. రక్షించుటవలన రాజు -

వేదాధ్యయనమునందు, యాగమునందు, దానమునందు ఆరవభాగము ఫలము పొందును. దుష్టులను శిక్షించి మంచివారిని రక్షించుటవలన వేల కొలది దక్షిణలు ఇచ్చిచేసిన యాగఫలము ప్రతిసమయము నందును పొందును. పన్నులను గ్రహించి రక్షించని రాజు నరకమును పొందును.

అరక్షితారం రాజానం బలిషడ్భాగహారిణమ్
తమాహుః సర్వలోకస్య సమగ్రమలహారకమ్

అధార్మికం త్రిభిర్న్యాయై ర్నిగృహ్ణీయాత్ప్రయత్నతః
నిరోధనేన బంధేన వివిధేన వధేన చ

క్షంతవ్యం ప్రభుణా నిత్యం క్షిపతాం కార్యిణాం నృణామ్
బాలవృద్ధాతురాణాం చ కుర్వతా హిత మాత్మనః

యః క్షిప్తో మర్షయత్యార్తై స్తేన స్వర్గే మహీయతే
యస్త్వైశ్వర్యా న్న క్షమతే నరకం తేన గచ్ఛతి

శాసనా ద్వా విమోక్షా ద్వా స్తేనః స్తేనా ద్విముచ్యతే
అశాసిత్వా తు తం రాజా స్తేనస్యాప్నోతి కిల్బిషమ్

ఆరవభాగము పన్నును గ్రహించి ప్రజారక్షణము చేయనిరాజు అందరిపాపమును పొందునని చెప్పిరి. కారాగారము, బంధనము, శారీరక శిక్షయను మూడుపాయములచే అధార్మికుడైన వానిని గ్రహించవలయును. తన హితమును కోరినరాజు, బాలురు, వృద్ధులు, బాధితులు తననాక్షే పించినను సహించి క్షమించవలయును. ఆ విధముగ సహించినరాజు స్వర్గమును పొందును. ఐశ్వర్యకారణమున సహించనిరాజు నరకమును పొందును. శాసనమువలనగాని,విమోక్షమువలనగానిచోరుడు పాపవిముక్తుడగును, చోరుని శాసించనిరాజు ఆ చౌర్యఫలము పొందును.

రాజభిః కృత దండాస్తు కృత్వా పాపాని మానవాః
నిర్మలాః స్వర్గ మాయాంతి సంతః సుకృతినో యథా
పురుషాణాం కులీనానాం నారీణాం చ విశేషతః
ముఖ్యానాం చ రత్నానాం హరణే వధ మర్హతి
పితాచార్యః సుహృన్మాతా భార్యాపుత్రః పురోహితః
నాదండ్యో నామ రాజ్ఞోఽస్తియః స్వధర్మే న తిష్ఠతి
కార్షాపణం భవేద్దండ్యో యత్రాన్యః ప్రాకృతో జనః
తత్ర రాజాభవే ద్దండ్యః సహస్రమితి ధారణా
యోఽదత్తాదాయినో హస్తా ల్లిప్సేత బ్రాహ్మణోధనమ్
యాజనాధ్యాపనేనాపి యథా స్తేన స్తథైవ సః
ఐంద్రస్థాన మభిప్రేప్సు ర్యశశ్చాప్యయ మక్షయమ్
నోపేక్షేత క్షణ మపి రాజా సాహసికం నరమ్

సత్పురుషులు స్వర్గమును పొందిన విధముగనే పాపములు చేసిన మానవులుగూడ రాజదండనముపొంది నిర్మలులై స్వర్గమును పొందుచున్నారు సద్వంశమున పుట్టినపురుషులను, స్త్రీలను, రత్నములను, అపహరించినవాడు వధార్హుడు, స్వధర్మమును పాలించని తండ్రి, ఆచార్యుడు, మిత్రుడు, తల్లి, భార్య, పుత్రుడు, పురోహితుడు గూడ దండనార్హులే యగుదురు. తప్పుచేసిన సామాన్యుడు కార్షాపణము మాత్రమే చెల్లించవలసి యుండగ ఆ తప్పు చేసినరాజు వెయ్యి కార్షాపణములు చెల్లించ వలసియుండును యాజనము, అధ్యాపనము కల్గినను ఇవ్వదలచనివాని చేతినుండి గ్రహింపదలచిన బ్రాహ్మణుడు దొంగయే యగును. ఇంద్రలోకము నపేక్షించినరాజు సాహసకృత్యములు చేసిన వానిని క్షణమైనను ఉపేక్షించరాదు.

నమిత్ర కారణా ద్రాజా విపులాద్వా ధనాగమాత్
సముత్సృజే త్సాహసికాన్ సర్వ భూత భయావహాన్
శస్త్రం ద్విజాతిభిర్గ్రాహ్యం ధర్మోయత్రో పరుధ్యతే
ద్విజాతీనాం చ వర్ణానాం విప్లవే కాలకారితే
ఆత్మనశ్చ పరిత్రాణే దక్షిణానాం చ సంగరే
స్త్రీవిప్రాభ్యుపపత్తౌ చ ఘ్నన్ ధర్మేణ న దుష్యతి
ఆతతాయి వధో దోషో హంతు ర్భవతి కశ్చన
ప్రకాశం వాఽప్రకాశం వా మన్యు స్తం మన్యుమృచ్ఛతి

స్నేహకారణముననగాని ధనాపేక్షవలనగాని లోకభయంకరులైన వారిని రాజు విడువకూడదు. ధర్మమునకు ద్విజులకు బాధ కలిగినపుడు ద్విజులచే శస్త్రము ధరింప తగియున్నది. ఆత్మరక్షణార్థము గో స్త్రీ బ్రాహ్మణ రక్షణార్థము హత్యచేసినను పాపయుక్తుడు గాడు. తనను చంపదలచినవానిని ప్రకాశముగాగాని అప్రకాశముగాగానిచంపిన పాపము లేదు, శత్రువునకు కలిగినకోపమును కోపముచేతనే జయింపవలయును.

పరదారాభిమర్శేషు ప్రవృత్తాన్ మహీపతిః
ఉద్వేజనకరై ర్దండై శ్చిహ్నయిత్వా ప్రవాసయేత్
పరస్య పత్న్యా పురుషః సంభాషాం యోజయ న్రహః
పూర్వమాక్షారితో దోషైః ప్రాప్నుయా త్పూర్వ సాహసమ్
పరస్త్రియం యోఽభివదేత్తీర్థేఽరణ్యే వనేఽపి వా
నదీనాం వాపి సంభేదే స సంగ్రహణ మాప్నుయాత్
ఉపచార క్రియాకేశిః స్పర్శో భూషణవాససామ్
సహఖట్వాసనం చైవ సర్వం సంగ్రహణం స్మృతః

పరస్త్రీలను పొందువారిని రాజు రాజ్యమునుండి బహిష్కరించ వలయును. రహస్యముగ పరస్త్రీతో సంభాషించిన పురుషుని శిక్షింప వలయును. నదీతీరమున, అరణ్యమున, నదీ సంగమమున పరస్త్రీలతో మాటాడుట సంగ్రహణమగును. సేవించుట, ఆటలాడుట, ఆభరణము లను స్పృశించుట, ఒకే మంచముపై కూర్చుండుట మొదలగునవి సంగ్రహణ మనిపించుకొనును.

యోఽకామాం దూషయే త్కన్యాం స సద్యో వధ మర్హతి
సకామాం దూషయం స్తుల్యో న వధం ప్రాప్నుయాన్నరః
యస్య స్తేనః పురే నాస్తి నాన్యస్త్రీగో న దుష్టవాక్
న సాహసిక దండఘ్నౌ స రాజా శక్రలోకభాక్
న మాతా న పితా న స్త్రీ న పుత్ర స్త్యాగ మర్హతి
త్యజన్నపతితా నేతాన్ రాజ్ఞా దండ్యః శ్శతాని షట్

తనను కోరని కన్యను బలాత్కరించిన వానిని వధించవలయును. కామించిన కన్యయైనచో వధించరాదు. ఏ రాజుపట్టణమునందు దొంగ, జారుడు, దుష్టుడు, సాహసికుడు లేడో ఆరాజు ఇంద్రలోకమునుపొందును చెల్లిని, తండ్రిని, భార్యను, కుమారుని త్యాగము చేయరాదు. వారియందు తప్పులేకయే త్యాగముచేసిన వానికి ఆరువందల నాణెముల శిక్షవిధించ వలయును.

అంధో జడః పీఠ సర్పీ సప్తత్యా స్థవిరశ్చయః
శ్రోత్రియేషు ఉపకుర్వాంశ్చ న దాప్యాః కేనచిత్కరమ్
శ్రోత్రియం వ్యాధితార్తౌ చ బాల వృద్ధానకించనమ్
మహాకులీన మార్యం చ రాజా సంపూజయేత్సదా

శుల్కస్థానం పరిహర న్నకాలే క్రయవిక్రయీ
మిథ్యావాదీ చ సంఖ్యానే దాప్యోఽష్టగుణ మత్యయమ్
ఆగమం నిర్గమం స్థానం తథా వృద్ధిక్షయా వుభౌ
విచార్య సర్వపణ్యానాం కారయే త్క్రయవిక్రయౌ
పంచరాత్రే పంచరాత్రే పక్షే పక్షేఽథవా గతే
కుర్వీత చైషాం ప్రత్యక్ష మర్ఘం సంస్థాపనం నృపః
తులామానం ప్రతీమానం సర్వం చ స్యాత్సులక్షణమ్
షట్సు షట్సు చ మాసేషు పునరేవ పరీక్షయేత్
గర్భిణీ తు ద్విమాసాది స్తథా ప్రవ్రాజితో మునిః
బ్రాహ్మణాలింగినశ్చైవ న దాప్యా స్తారికం తరే
యన్నావి కించి ద్దాశానాం విశశ్యేతాపరాధతః
తద్దాశై రేవ దాతవ్యం సమాగమ్య స్వతోంశతః
క్షత్రియం చైవ వైశ్యం చ బ్రాహ్మణో వృత్తికర్శితౌ
బిభృయా దానృశంస్యేన స్వాని కర్మాణి కారయన్
అహన్యహన్యవేక్షేత కర్మాంతాన్వాహనాని చ
ఆయవ్యయౌ చ నియతా వాకరాన్ కోశమేవ చ

కుంటిని, గ్రుడ్డిని, డెబ్బదిసంవత్సరముల వృద్ధుని, పరోపకారిని ధనము తీసుకొనకయే నదిని దాటించవలయును. పండితుని వ్యాధిపీడితుని, బాధితుని, బాలవృద్ధులను ఉన్నతవంశజాతుని, రాజును ఎల్లప్పుడు గౌరవించవలయును. అమ్మతగిన ప్రదేశమును విడిచి మరియొకచోట రహస్యముగ అమ్మువానికి, సమయముదాటి అమ్మువానికి, లెక్కలయందు తప్పు చెప్పువానికి ఎనిమిదిరెట్లు పన్నును విధించవలయును. వస్తువుల రాకపోకలు వృద్ధి, క్షయములు క్రయవిక్రయములు విచా

రించి పన్ను విధించవలయును, అయిదు-అయిదు దినములకుగాని, పక్షమునకుగాని, వ్యాపారవిషయములను పరీక్షించవలయును. తూనిక పరికరములను, కొలత పరికరములను ప్రతి ఆరుమాసములకు పరీక్షించవలయును. రెండు మాసములు నిండిన గర్భవతిని, సంన్యాసిని, బ్రాహ్మణులను, బ్రహ్మచారులను, శుల్కము తీసుకొనకయే నదిని దాటించవలయును. నావికుల అపరాధమువలన పడవ మునిగినగాని బ్రద్దలయినగాని దానివలన నష్టపడినవారి ద్రవ్యమును నావికులే భరించవలయును, బ్రాహ్మణుడు, వృత్తిలేక బాధపడుచున్న క్షత్రియ వైశ్యులను - తగినపని వారిచే చేయించుచు - పోషించవలయును. రాజు ప్రతి రోజు తన వాహనముల రాకపోకలను, ఆదాయవ్యయములను, గనులను కోశములను చూడవలయును.

ఇది ఎనిమిదవ యధ్యాయము.

*

# తొమ్మిదవ యధ్యాయము

పురుషస్య స్త్రియాశ్చైవ ధర్మ్యే వర్త్మని తిష్ఠతోః
సంయోగే విప్రయోగే చ ధర్మాన్వక్ష్యామి శాశ్వతాన్
పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే
రక్షంతి స్థవిరే పుత్రా న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి
కాలేఽదాతా పితావాచ్యో వాచ్య శ్చానుపయ న్పతిః
మృతే భర్తరి పుత్రస్తు వాచ్యో మాతు రరక్షితా
సూక్ష్మేభ్యోఽపి ప్రసంగేభ్యః స్త్రియో రక్ష్యా విశేషతః
ద్వయోర్హి కులయో శ్శోక మావహేయు రరక్షితాః
ఇమం హి సర్వవర్ణానాం పశ్యంతో ధర్మ ముత్తమమ్
యతంతే రక్షితుం భార్యాం భర్తారో దుర్బలా అపి
స్వాం ప్రసూతిం చరిత్రం చ కుల మాత్మాన మేవ చ
స్వం చ ధర్మం ప్రయత్నేన జాయాం రక్షన్హి రక్షతి
పతిర్భార్యాం సంప్రవిశ్య గర్భో భూత్వే హ జాయతే
జాయాయా స్తద్ధి జాయాత్వం యదస్యాం జాయతే పునః
యాదృశం భజతే హి స్త్రీ సుతం సూతే తథావిధమ్
తస్మా త్ప్రజావిశుద్ధ్యర్థం స్త్రియం రక్షే త్ప్రయత్నతః

స్త్రీ పురుష విషయకమైన ధర్మములు వివరముగ చెప్పబడినవి :

ధర్మమార్గమున సంచరించదలచిన స్త్రీ పురుషులకు సంయోగ వియోగ కాలములయందు ఆచరించవలసిన శాశ్వతధర్మములను చెప్పుచున్నానని మనువు ప్రతిజ్ఞచేసెను. స్త్రీని బాల్యమున తండ్రియు, యౌవనమున భర్తయు, వృద్ధాప్యమున పుత్రుడు రక్షింతురు. అంతియేకాని,

ఆమెను రక్షించక విడిచిపెట్టరాదు, తగినకాలమున వివాహము చేయని తండ్రియు యౌవనమునకు తగినటుల ప్రవర్తించని భర్తయు, భర్త గతించిన పిమ్మట ఆమెనురక్షించనిపుత్రులు నింద్యులగుదురు సూక్ష్మము లైన నింద్యవిషయములమండియు స్త్రీలను రక్షించవలయును. లేనియెడల రెండు వంశములవారికి దుఃఖమును కలుగచేయుదురు. ఇది అన్ని జాతులవారికి ముఖ్యమైన ధర్మము. అందుచేతనే భర్తలు దుర్బలు లయినప్పటికి తమ భార్యలను రక్షించుకొనుటకు ప్రయత్నించుచున్నారు. భార్యను రక్షించినవాడు తన సంతానమును, తనచరిత్రను, తనకులమును తనను తన ధర్మమును రక్షించినవాడగును. భర్తయే భార్యయందు ప్రవేశించి తిరిగి జన్మించుచున్నాడు. జాయయను పదమున కదియే యర్థము స్త్రీ తాను ఆశ్రయించిన పురుషునివంటి సంతానమునే పొందును పవిత్రసంతాన నిమిత్తము స్త్రీని ప్రయత్నపూర్వకముగ రక్షించ వల యును విశేషము : "న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అను వాక్యమునకు కొందరు మనువు స్త్రీని బానిసగ చేసెననిచెప్పుదురు. కాని అది సరియైనది కాదు స్త్రీని రక్షించవలయునని చెప్పుటయే ఆ వాక్యతాత్పర్యము.

న కశ్చిద్యోషితః శక్తః ప్రసహ్య పరిరక్షితుమ్
ఏతై రుపాయయోగై స్తు శక్యా స్తాః పరిరక్షితుమ్
అర్థస్య సంగ్రహేచైనాం వ్యయేచైవ నియోజయేత్
శౌచే ధర్మేఽన్నపక్త్యాం చ పారిణాహ్యస్య వేక్షణే

అరక్షితా గృహే రుద్ధాం పురుషై రాప్తకారిభిః
ఆత్మాన మాత్మనా యాస్తు రక్షేయు స్తాః సురక్షితాః
పానం దుర్జనసంసర్గః పత్యా చ విరహోఽటనమ్
స్వప్నోఽన్య గేహవాస శ్చ నారీ సందూషణాని షట్.

స్త్రీజను బలవంతముగ రక్షించుట ఎవ్వరికి సాధ్యముకాదు యోగ్యములైన ఉపాయములచే రక్షింపవలయును ధనసంచయమునందు వ్యయమునందు, శౌచధర్మములయందు, పాకాదులయందు ఆమెను నియోగించవలయును. పురుషులు నిర్బంధించినంత మాత్రమున స్త్రీలు రక్షితులు కారు, యోగ్యములగు విషయములను తెలిసికొని తమను రక్షించుకొనువారే రక్షితులగుదురు. మద్యపానము, దుర్జనసాంగత్యము, భర్త తోడులేకుండగ సంచరించుట, అకాలనిద్ర, అన్యగృహ నివాసము స్త్రీల దోషములకు కారణములు.

యాదృగ్గుణేన భర్త్రా స్త్రీ సంయుజ్యేత యథావిధి
తాదృగ్గుణా సా భవతి సముద్రేణేవ నిమ్నగా
ప్రజనార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః
స్త్రియః శ్రియశ్చ గేహేషు న విశేషోఽస్తి కశ్చన
ఉత్పాదన మపత్యస్య జాతస్య పరిపాలనమ్
ప్రత్యహం లోకయాత్రాయాః ప్రత్యక్షం స్త్రీనిబంధనమ్
అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతి రుత్తమా
దారాధీన స్తథా స్వర్గః పితౄణా మాత్మనశ్చ హ
పతిం యా నాభిచరతి మనోవాగ్దేహ సంయతా
సా భర్తృలోకా నాప్నోతి సద్భిః సాధ్వీతి చోచ్యతే

సముద్రముల సంగమును పొందిన నది సముద్రభావము పొందినట్లు భార్య భర్తయందుగల గుణములనే పొందుచున్నది. గృహమును ప్రకాశింపచేయునటువంటి స్త్రీలు, సంపదలుగూడ సంతాన నిమిత్తము పూజించ తగియున్నారు, ఈ రెండింటియందు ఎట్టిభేదములేదు. సంతానము గనుటకు, పోషించుటకు, లోకజీవనముజరుగుటకు స్త్రీయే ప్రత్యక్ష

కారణము సంతానము, ధర్మకార్యనిర్వాహణము, సేవ, ఉత్తమ సంభోగము, స్వర్గలోకముగూడ దారాధీనమై యున్నవి. ఈమెయే తనకు పితరులకు గూడ స్వర్గకారణ మగుచున్నది. మనోవాక్కాయములచేత భర్తను సేవించిన స్త్రీ భర్తపొందు లోకములను పొందును. లోకమున సాధ్వి యనిపించుకొనును

క్షేత్రభూతా స్మృతా నారీ బీజభూతః స్మృతః పుమాన్
క్షేత్ర బీజసమాయోగా త్సంభవః సర్వ దేహినామ్
విశిష్టం కుత్రచిద్బీజం స్త్రీయోనిస్త్వేవ కుత్రచిత్
ఉభయం తు సమం యత్ర సా ప్రసూతిః ప్రశస్యతే
బీజస్య చైవ యోన్యాశ్చ బీజ ముత్కృష్ట ముచ్యతే
సర్వభూత ప్రసూతిర్హి బీజలక్షణ లక్షితా
యాదృశం తూప్యతే బీజం క్షేత్రే కాలోపపాదితే
తాదృగ్రోహతి తత్తస్మి న్బీజం స్వైర్వ్యంజితం గుణైః

స్త్రీ క్షేత్రమనియు పురుషుడు బీజమనియు చెప్పబడును. వీరిద్దరి కలయికచేతనే జీవులు పుట్టుచున్నారు. ఒకచోట బీజము ఉత్కృష్టమైనదిగను. మఱియొక చోట యోని యుత్కృష్టమైనదిగను యుండును. రెండును సమమైనచోట ప్రశస్తమైన సంతానము కలుగును. బీజయోనులలో బీజమే శ్రేష్ఠమైనది. సమస్త సృష్టియు బీజలక్షణములనే కలిగి యున్నది భూమియందు నాటిన బీజలక్షణములుగల మొక్కలే మొలచుచున్నవి ఆ మొక్కలు బీజస్వభావమే కలిగి యున్నవి.

ఇయం భూమిర్హి భూతానాం శాశ్వతీ యోని రుచ్యతే
న చ యోనిగుణాన్ కాంశ్చి ద్బీజం పుష్యతి పుష్టిషు
భూమావప్యేక కేదారే కాలోప్తాని కృషీవలైః
నానారూపాణి జాయంతే బీజానీహ స్వభావతః

అన్యదుప్తం జాతమన్య దిత్యేత న్నోపపద్యతే
ఉప్యతే యద్ధిబీజం తత్తదేవ ప్రరోహతి
దత్ప్రాజ్ఞేన వినీతేన జ్ఞానవిజ్ఞాన వేదినా
ఆయుష్కామేన వప్తవ్యం న జాతు పరయోషితి

ఈ భూమియే సమస్తజీవరాసులకు యోనియైయున్నది. అయి నప్పటికి ఏ బీజములు యోని గుణములు పొందవు. బీజగుణములనే పొందును. ఒకే భూమియందు వ్యవసాయదారుడు, అనేకవిధములయిన బీజములు చల్లుచున్నాడు. ఆ బీజ స్వభావముగల మొక్కలు మొలచు చున్నవి. ఒక విత్తనము నాటిన దానికి విరుద్ధమైన మరియొక మొక్క మొలచుట లేదు. ఏ బీజము నాటిన ఆ మొక్కయే మొలచు చున్నది. అందువలన జ్ఞాన విజ్ఞానవేత్త, ఆయుష్కాముడు పరస్త్రీయందు బీజ స్థాపన చేయరాదు.

న నిష్క్రియవిసర్గాభ్యాం భర్తు ర్భార్యా విముచ్యతే
ఏవం ధర్మం విజానీమః ప్రాక్ప్రజాపతి నిర్మితమ్
సకృదంశో నిపతతి సకృత్కన్యా ప్రదీయతే
సకృదాహ దదానీతి త్రీణ్యేతాని సతాం సకృత్
భ్రాతుర్జ్యేష్ఠస్య భార్యా యా గురుపత్న్యనుజస్య సా
యవీయస్తు యా భార్యా స్నుషాజ్యేష్ఠస్య సా స్మృతా

దాన విక్రయములచేత భర్త భార్యనువిడువజాలడు. ఇది బ్రహ్మ చేసిన ధర్మమని తెలియవలయును. అన్నదమ్ములవిభాగము కన్యాదానము గవాదుల దానము అను ఈ మూడును సత్పురుషులు ఒకమారేచేయుదురు. అన్న భార్య తమ్మునికి గురుపత్నివంటిది. తమ్ముని భార్య అన్నకు కోడలి వంటిది.

విధాయ వృత్తిం భార్యాయాః ప్రవసే త్కార్యవాన్నరః
అవృత్తికర్శితా హి స్త్రీ ప్రదుష్యేత్ స్థితిమత్యపి
సంవత్సరం ప్రతీక్షేత ద్విషంతీం యోషితం పతిః
ఊర్ధ్వం సంవత్సరా త్త్వేనాం దాయం హృత్వా న సంవసేత్
ఉన్మత్తం పతితం క్లీబ మబీజం పాపరోగిణమ్
న త్యాగోఽస్తి ద్విషంత్యా శ్చ న చ దాయాపవర్తనమ్
యా రోగిణీ స్యాత్తు హితా సంపన్నా చైవ శీలతః
సానుజ్ఞాప్యాధివేత్తవ్యా నావమాన్యా చ కర్హిచిత్

దేశాంతరము వెళ్ళదలచిన భర్త భార్యకు జీవనాధారము కల్పించి వెళ్ళవలయును. జీవనాధారములేనిచో స్థిరచిత్తురాలైన స్త్రీయుచెడిపోవును తనను ద్వేషించుచున్న భార్య నిమిత్తము సంవత్సరకాలము ప్రతీక్షించ వలయును, అటుపిమ్మట ఆమె కిచ్చిన ఆభరణాదుల గ్రహించి విడిచిపెట్ట వలయును. గ్రాసవాసముల నిచ్చి జీవనము మాత్రము కల్పించ వలయుమ ఉన్మత్తుని, పతితుని. నపుంసకుని, రోగగ్రస్తుని ద్వేషించుచున్న స్త్రీని గూడ విడిచిపెట్టరాదు. ఆమె ధనమును అపహరించ రాదు. రోగగ్రస్తురాలు, సత్స్వభావము గలది యగు భార్యను అంగీకరింపచేసి మరియొక వివాహము చేసుకొనవలయును. ఆమెను ఎప్పుడును అవమానించరాదు.

ఉత్కృష్టాయాభిరూపాయ వరాయ సదృశాయ చ
అప్రాప్తామపి తాం తస్మై కన్యాం దద్యా ద్యథావిధి
కామ మామరణా త్తిష్ఠే ద్గృహే కన్యర్తుమత్యపి
న చైవైనాం ప్రయచ్ఛేత్తు గుణహీనాయ కర్హిచిత్
దేవదత్తాం పతి ర్భార్యాం విందతే నేచ్ఛయాత్మనః
తాం సాధ్వీం బిభృయాన్నిత్యం దేవానాం ప్రియ మాచరన్

ప్రజనార్థం స్త్రియః సృష్టాః సంతానార్థం చ మానవాః
తస్మాత్సాధారణో ధర్మః శ్రుతౌ పత్న్యా సహోదితః

ఆదదీత న శూద్రోఽపి శుల్కం దుహితరం దదన్
శుల్కం హి గృహ్ణన్ కురుతే ఛన్నం దుహితృ విక్రయమ్

ఉత్కృష్టమైన యోగ్యతగల వరుడు లభించినపుడు వివాహ వయస్కురాలు కాని కన్యనిచ్చియు శాస్త్రప్రకారము వివాహముచేయవలయును. ఋతిమతియైనను గుణహీనున కీయరాదు, ఆమరణాంతము ఇంటియందుండుటయే మంచిది. భర్త దైవదత్తమైన కన్యను భార్యగా పొందకలుగునేకాని తన యిష్టము ననుసరించికాదు. అట్టి పతివ్రతను దేవతలకు ప్రియమాచరించుచు శాశ్వతముగ భరించవలయును గర్భధారణ నిమిత్తము స్త్రీలును, గర్భాధాన నిమిత్తము పురుషులు సృష్టించబడిరి. ఇందువలన ధర్మములన్నియు భార్యాభర్తలకు చెప్పబడినవి. శూద్రుడయినను కన్యనిచ్చి శుల్కము గ్రహించరాదు. శుల్కము గ్రహించుట యన రహస్యముగ కన్యనమ్ముటయే యగును.

ఏతత్తు న పరే చక్రు ర్నాపరే జాతు సాధవః
యదన్యస్య ప్రతిజ్ఞాయ పున రన్యస్య దీయతే

నానుశుశ్రుమ జాత్వేత త్పూర్వేష్వపి హి జన్మసు
శుల్కసంజ్ఞేన మూల్యేన ఛన్నం దుహితృవిక్రయమ్

అన్యోన్యస్యావ్యభిచారో భవే దామరణాంతికః
ఏష ధర్మః సమాసేన జ్ఞేయః స్త్రీపుంసయోః పరః

తథా నిత్యం యతేయాతాం స్త్రీపుంసౌ తు కృతక్రియౌ
యథా నాభిచరేతాం తౌ వియుక్తా వితరేతరమ్

ఒకరికి యివ్వ గలనని ప్రతిజ్ఞచేసిన కన్యను మరియొకరి కిచ్చుట సాధువులగువారు పూర్వముచేయలేదు, ఇప్పుడుచేయుటలేదు. పూర్వ కాలమునందును శుల్కమను పేరుతో దుహితృ విక్రయము చేసినటుల వినబడుట లేదు. భార్యాభర్తలు ఆమరణాంతము కలిసియుండుటయే ధర్మము. స్త్రీ పురుషుల ప్రధానధర్మమిదియే యని గుర్తించవలయును. స్త్రీ పురుషులిద్దరును కలసియుండుటకు తగిన ప్రయత్నము నిత్యము చేయవలయును. వారి ప్రవర్తన వియోగమున కవకాశ మిచ్చునట్లుండ రాదు.

ఊర్ధ్వం పితుశ్చ మాతుశ్చ సమేత్య భ్రాతర స్సమమ్
భజేరన్ పైతృకం రిక్థ మనీశాస్తే హి జీవతోః
పితేవ పాలయే త్పుత్రాన్ జ్యేష్ఠో భ్రాతౄన్యవీయసః
పుత్రవచ్చాపి వర్తేరన్ జ్యేష్ఠే భ్రాతరి ధర్మతః
యో జ్యేష్ఠో జ్యేష్ఠ వృత్తి స్స్యా న్మాతేవ పితేవ సః
అజ్యేష్ఠవృత్తిర్యస్తు స్యాత్స పంపూజ్యస్తు బంధువత్

కుటుంబమునగల ఆస్తికి తల్లి దండ్రులే యజమానులు. వారి మరణానంతరమే కుమారులందరు ఆస్తిని సమముగ పొందుట కర్హులు. అన్న తండ్రివలె తమ్ములను పోషించవలయును. తమ్ములు అన్నను తండ్రివలె, తల్లినివలె గౌరవించ వలయును. జ్యేష్ఠ సోదరధర్మమును పాటించని అన్నను బంధువునువలె గౌరవించ వలయును.

ఉద్ధారో న దశస్వ స్తి సంపన్నానాం స్వకర్మసు
యత్కించిదేవ దేయం తు జ్యాయసే మానవర్ధనమ్
స్వేభ్యోఽంశేభ్య స్తు కన్యాభ్యః ప్రదద్యుర్భ్రాతరః పృథక్
స్వా త్స్వా దంశా చ్చతుర్భాగం పతితాః స్యు రదిత్సవః

యథై వాత్మా తథా పుత్రః పుత్రేణ దుహితా సమా
తస్యా మాత్మని తిష్ఠంత్యాం కథ మన్యో ధనం హరేత్
మాతు స్తు యౌతకం యత్స్యా త్కుమారీ భాగ ఏవ సః
దౌహిత్ర ఏవ చ హరే దపుత్ర స్యాఖిలం ధనమ్
దౌహిత్రో హ్యాఖిలం రిక్థ మపుత్రస్య పితుర్హ రేత్
స ఏవ దద్యాద్ద్వౌ పిండౌ పిత్రే మాతామహాయ చ
పౌత్ర దౌహిత్రయో ర్లోకే న విశేషోఽస్తి ధర్మతః
తయోర్హి మాతాపితరౌ సంభూతౌ తస్య దేహతః

దాయ భాగవిషయము వివరముగ చెప్పబడినది :

సోదరులందరు కర్మసమృద్ధులయినప్పుడు జ్యేష్ఠ సోదర భాగము ప్రత్యేకముగ నీయనక్కరలేదు. గౌరవనిమిత్తము కొంచెమీయవచ్చును సోదరులందరు తమ భాగములనుండి నాలుగవభాగమును ఆడబడుచుల కీయవలయును. అట్లు ఈయనివారు పతితు లగుదురు. తానే పుత్రుడుగా జన్మించెను. పుత్రునివంటిదే పుత్రిక. ఆమె జీవించియుండగ తండ్రి ధనమును మరియొకరు ఎట్లు గ్రహింతురు. తల్లి ధనమునకంతయు కుమార్తెలే అధికారులు. పుత్రులు లేనివారిధనమునకు దౌహిత్రుడే అధికారి, అతడే తాతగారి ధనమున కధికారి. అతడు తండ్రికి తల్లి తండ్రికిగూడ పిండప్రదానము చేయును. పౌత్రునకు దౌహిత్రునకు ధర్మ నిమిత్తముగ భేదములేదు. దౌహిత్రుని తల్లియు, పౌత్రుని తండ్రియు తన శరీరము నుండియే జన్మించిరి

పుత్రికాయాం కృతాయాం తు యది పుత్రోఽనుజాయతే
సమ స్తత్ర విభాగః జ్యేష్ఠతా నాస్తి హి స్త్రియాః

అకృతా వా కృతా వాపి యం విందే త్సదృశా త్సుతమ్
పౌత్రీ మాతామహ స్తేన దద్యా త్పిండం హరేద్ధనమ్
పుత్రేణ లోకాఞ్జయతి పౌత్రేణానంత్య మశ్నుతే
అథ పుత్రస్య పౌత్రేణ బ్రధ్నస్యాప్నోతి విష్టపమ్
పుం నామ్నో నరకా ద్యస్మాత్త్రాయతే పితరం సుతః
తస్మాత్పుత్ర ఇతి ప్రోక్తః స్వయమేవ స్వయంభువా.

కుమార్తె వివాహము, దౌహిత్రునికోరి చేసిన పిమ్మట కుమారు డుద్భవించినప్పటికి, కుమార్తెకు సగభాగమీయవలయును. కుమార్తెకు జ్యేష్ఠభాగములేదు. దౌహిత్రుని నియామకము చేయక పోయినప్పటికి, చేసినప్పటికిని, మేనమామలు లేనిచో తాతగారి ధనము దౌహిత్రునకే చెందును. దౌహిత్రుడే పిండప్రదానము చేయును. పుత్రునివలన స్వర్గాది లోకములు కలుగును. పౌత్రునివలన ఆ లోకములయందే శాశ్వతత్వము సంభవించును. పుత్ర పౌత్రులవలన సూర్యలోకము కలుగును. పుత్రునివలన తండ్రి పుంనామనరకమునుండి విముక్తుడగును. అందుచేతనే కుమారునికి పుత్రుడను పేరు కలిగెనని బ్రహ్మయే స్వయముగ చెప్పెను.

పౌత్రదౌహిత్రయోర్లోకే విశేషోనోపపద్యతే
దౌహిత్రోఽపి హ్యముత్రైనం సంతారయతి పౌత్రవత్
పౌత్రదౌహిత్రులకు భేదము లేదు. పౌత్రునివలె దౌహిత్రుడుగూడ తరింపచేయును....

మాతా పితా వా దద్యాతాం య మద్భిః పుత్ర మాపది
సదృశం ప్రీతిసంయుక్తం స జ్ఞేయో దత్త్రిమః సుతః
తల్లి దండ్రులు సుతులులేనివారికి ప్రేమతో నిచ్చిన కుమారుడు దత్తపుత్రు డగును.

భ్రాతౄణా మేక జాతానా మేక శ్చేత్పుత్రవాన్ భవేత్
సర్వాం స్తాం స్తేన పుత్రేణ పుత్రిణో మను రబ్రవీత్

ఒకే దంపతులకు పుట్టిన సోదరులలో ఒకరికి పుత్ర సంతాన మున్నను వారందరు పుత్రవంతులగుదురని మనువు చెప్పెను.

జనన్యాం సంస్థితాయాం తు సమం సర్వే సహోదరాః
భజేరన్ మాతృకం రిక్థం భగిన్యశ్చ సనాభయః
యా స్తాసాం స్యు ర్దుహితర స్తాసా మపి యథార్హ తః
మాతామహ్యా ధనాత్కించి త్ప్రదేయం ప్రీతిపూర్వకమ్
అన్వాధేయం చ యద్దత్తం పత్యా ప్రీతేన చైవ యత్
పత్యౌ జీవతి వృత్తాయాః ప్రజాయాస్తద్ధనం భవేత్

తల్లి మృతి చెందినపుడు తల్లి ధనమును పుత్రులు అవివాహిత లైన పుత్రికలు సమముగా పంచుకొందురు. వివాహితలైనవారికి సోదర ధనమునుండి నాలుగవభాగము ప్రాప్తించునని పూర్వము చెప్పబడెను. వివాహిత లయిన పుత్రికలకేగాక వారి సంతానమునకుకూడా అమ్మమ్మ ధనమునుండి కొంచెము నీయవలయును. "అన్వాధేయ"మనగా వివాహానంతరము స్త్రీ బంధువులవలన, భర్తవలన పొందినధనమని యర్థము. వివాహాత్పూరతోయత్తు లబ్ధం భర్తృకులే స్త్రియా, అన్వాధేయం తదుక్తం తు సర్వబంధు కులే తథా—అని కాత్యాయన మహర్షి వివరించెను. అన్వాధేయము తల్లి మృతిచెందిన పిమ్మట ఆమెసంతానమునకే చెందును. భర్త జీవించియున్నను సంతానమునకే చెందునని కుల్లూకభట్టు వివరించెను

పత్యౌ జీవతి యః స్త్రీభి రలంకారో ధృతో భవేత్
న తం భజేరన్ దాయాదా భజమానా పతంతి తే

యో జ్యేష్ఠో వినికుర్వీత లోభా ద్భ్రాతౄన్యవీయసః
సోఽజ్యేష్ఠః స్యాదభాగశ్చ నియంతవ్యశ్చ రాజభిః
అనపత్యస్య పుత్రస్య మాతా దాయ మవాప్నుయాత్
మాతర్యపి చ వృత్తాయాం పితుర్మాతా హరేద్ధనమ్

భర్తవలన భార్యపొందిన ఆభరణాదులను భర్త గతించినపిమ్మట దాయాదులు గ్రహింపగూడదు. అటుల గ్రహించిన పతితులగుదురు. లోభకారణమున సోదరులను వంచించిన జ్యేష్ఠసోదరుడుఅజ్యేష్ఠుడగును. అతనికి భాగమీయరాదు. రాజు అట్టివానిని శిక్షింపవలయును. సంతానము లేని పుత్రునిభాగమును తల్లికీయవలయును. తల్లియు గతించిననాయనమ్మ కీయవలయును.

ద్యూతం సమాహ్వయం చైవ రాజా రాష్ట్రా న్నివారయేత్
రాజ్యాంతకరణా వేతౌ ద్వౌ దోషౌ పృథివీక్షితామ్
ప్రకాశమేత త్తాస్కర్యం యద్దేవనసమాహ్వయౌ
తయోర్నిత్యం ప్రతీఘాతే నృపతి ర్యత్నవాన్ భవేత్
అప్రాణిభిర్యత్క్రియతే తల్లోకే ద్యూత ముచ్యతే
ప్రాణిభిః క్రియతే యస్తు స విజ్ఞేయః సమాహ్వయః
ద్యూతం సమాహ్వయం చైవ యః కుర్యా త్కారయేత వా
తాన్ సర్వాన్ ఘాతయే ద్రాజా శూద్రాంశ్చ ద్విజలింగినః
ద్యూత మేత త్పురాకల్పే దృష్టం వైరకరంమహత్
తస్మాద్ద్యూతం న సేవేత హాస్యార్థ మపి బుద్ధిమాన్

జూదమును సమాహ్వయమును రాజు రాష్ట్రమునుండి దూరము చేయవలయును. ఈ రెండు దోషములు రాజుల రాజ్యములను అంతము

చేయగలవు. ఈ రెండును బట్టబయలుగ చేయు దొంగతనములు. వీటిని నివారించుటయందు రాజు ప్రత్యేక ప్రయత్నము చేయవలయును. ప్రాణ రహితములయిన పాచికలతో నాడునది జూదము ప్రాణముగల కోళ్ళు మొదలగువానితో నాడునది సమాహ్వయము. జూదమాడువారిని ఆడించు వారినిగూడ శిక్షించవలయును. జూదమువలన భయంకర విరోధములు పూర్వకల్పమున జరిగినట్లు వినుచున్నాము. అందుచే బుద్ధిమంతుడు పరిహాసముకొరకుగూడ జూదమాడరాదు.

అమాత్యాః ప్రాడ్వివాకో వా యత్కుర్యుః కార్యమన్యథా
తత్స్వయం నృపతిః కుర్యాత్తాన్ సహస్రం చ దండయేత్

బ్రహ్మహా చ సురాపశ్చ స్తేయీ చ గురుతల్పగః
ఏతే సర్వే పృథక్ జ్ఞేయా మహాపాతకినో నరాః

చతుర్ణామపి చైతేషాం ప్రాయశ్చిత్త మకుర్వతామ్
శారీరం ధన సంయుక్తం దండం ధర్మ్యం ప్రకల్పయేత్

మంత్రులుగాని, రాజనియుక్తుడగు అధికారిగాని అన్యాయముగ ప్రవర్తించినవారికి సహస్రపణములు దండనము విధించవలయును వారి పనిని రాజే స్వయముగ చూడవలయును. బ్రాహ్మణహంతకుడు. మద్యపానము చేసినవాడు, దొంగ, గురుపత్నిని పొందినవాడు మహా పాతకులు. వీరిని రాజు ప్రత్యేకముగ గుర్తించవలయును. ఇట్టిపాపము చేసినవారు స్వయముగ ప్రాయశ్చిత్తము చేసికొననిచో వీరికి శారీరక శిక్ష మరియు ధన సంబంధమైన శిక్షవిధించవలయును

నాదదీత నృప స్సాధు ర్మహాపాతకినో ధనమ్
ఆదదానస్తు తల్లోభాత్తేన దోషేణ లిప్యతే

చేయగలవు. ఈ రెండును బట్టబయలుగ చేయు దొంగతనములు. వీటిని నివారించుటయందు రాజు ప్రత్యేక ప్రయత్నము చేయవలయును. ప్రాణ రహితములయిన పాచికలతో నాడునది జూదము ప్రాణముగల కోళ్ళు మొదలగువానితో నాడునది సమాహ్వయము. జూదమాడువారిని ఆడించు వారినిగూడ శిక్షించవలయును. జూదమువలన భయంకర విరోధములు పూర్వకల్పమున జరిగినట్లు వినుచున్నాము. అందుచే బుద్ధిమంతుడు పరిహాసముకొరకుగూడ జూదమాడరాదు.

అమాత్యాః ప్రాడ్వివాకో వా యత్కుర్యుః కార్యమన్యథా
తత్స్వయం నృపతిః కుర్యాత్తాన్ సహస్రం చ దండయేత్

బ్రహ్మహా చ సురాపశ్చ స్తేయీ చ గురుతల్పగః
ఏతే సర్వే పృథక్ జ్ఞేయా మహాపాతకినో నరాః

చతుర్ణామపి చైతేషాం ప్రాయశ్చిత్త మకుర్వతామ్
శారీరం ధన సంయుక్తం దండం ధర్మ్యం ప్రకల్పయేత్

మంత్రులుగాని, రాజనియుక్తుడగు అధికారిగాని అన్యాయముగ ప్రవర్తించినవారికి సహస్రపణములు దండనము విధించవలయును వారి పనిని రాజే స్వయముగ చూడవలయును. బ్రాహ్మణహంతకుడు, మద్యపానము చేసినవాడు, దొంగ, గురుపత్నిని పొందినవాడు మహా పాతకులు. వీరిని రాజు ప్రత్యేకముగ గుర్తించవలయును. ఇట్టిపాపము చేసినవారు స్వయముగ ప్రాయశ్చిత్తము చేసికొననిచో వీరికి శారీరక శిక్ష మరియు ధన సంబంధమైన శిక్షవిధించవలయును

నాదదీత నృప స్సాధు ర్మహాపాతకినో ధనమ్
అదదానస్తు తల్లోభా త్తేన దోషేణ లిప్యతే

ప్రకాశవంచకా స్తేషాం నానాపణ్యోపజీవినః
ప్రచ్ఛన్న వంచకా స్త్వేతే యే స్తేనాటవికాదయః

ప్రజాపాలనయందు ఆసక్తిగల రాజులు మంచివారిని రక్షించియు దుష్టులను శిక్షించియు స్వర్గమును పొందుదురు. పన్నులను గ్రహించియు దొంగలను నిర్బంధించలేని రాజు రాజ్యమున క్షోభముకల్గును. అట్టి రాజు స్వర్గమును కోల్పోవును. పరద్రవ్యమును అపహరించు దొంగలు ప్రకాశకులు. అప్రకాశకులు అని రెండు విధములుగ నుందురు వీరిని గురించి రాజు చారులవలన తెలిసికొనవలయును నానావిధములయిన వ్యాపారములు చేయువారు ప్రకాశవంచకులు. రాత్రిసమయమున దొంగతనము చేయువారు అప్రకాశవంచకులు.

స హి దండాదృతే శక్యః కర్తుం పాపవినిగ్రహః
స్తేనానాం పాపబుద్ధీనాం నిభృతం చరతాం క్షితౌ

భూమియందు సంచరించు పాపులను శిక్షచేతనే నిగ్రహించవలయును. వారిని నిగ్రహించుటకు దండమునకు మించిన శిక్షలేదు.

గ్రామేష్వపి యే కేచి చ్చౌరాణాం భక్తదాయకాః
భాండావకాశదాశ్చైవ సర్వాం స్తానపి ఘాతయేత్
య శ్చాపి ధర్మ సమయా త్ప్రచ్యుతో ధర్మజీవనః
దండేనైవ త మప్యో షేత్ స్వకా ద్ధర్మాద్ధివిచ్యుతమ్

దొంగలకు నివాసములు భోజనాది సదుపాయములు సమకూర్చు గ్రామవాసులనుగూడ శిక్షించవలయును యాగాదులద్వారా ధర్మజీవనము చేయువారిని గూడ స్వధర్మమునుండి చ్యుతులైనపుడు శిక్షించవలయును.

సముత్సృజే ద్రాజమార్గే యస్త్వ మేధ్య మనాపది
స ద్వౌ కార్షాపణౌ దద్యా దమేధ్యం చాశు శోధయేత్

ఆపద్గతోఽథవా వృద్ధా గర్భిణీ బాల ఏవవా
పరిభాషణ మర్హంతి తచ్చ శోధ్య మితి స్థితిః
బంధనాని చ సర్వాణి రాజమార్గే నివేశయేత్
దుఃఖితా యత్ర దృశ్యేరన్ వికృతాః పాపకారిణః

రాజమార్గమునందు మూత్ర పురీషాదులు చేసిన వానికి రెండు కార్షాపణములు శిక్ష విధించవలయును. ఆపదసమయమున చేసిన శిక్షించ రాదు వెంటనే ఆ ప్రదేశమును శుద్ధి చేయవలయును. ఆపదలోనున్న వారు, వృద్ధులు, గర్భిణిస్త్రీలు, బాలురు, రాజమార్గమున మూత్రపురీషాదులు చేసినవారిని నిందించవలయునేగాని శిక్షింపరాదు. శిక్షలన్నియు అందరు చూచు విధమున రాజమార్గమున విధించవలయును.

స్వామ్య మాత్యపురం రాష్ట్రం కోశదండౌ సుహృత్తథా
సప్తప్రకృతయో హ్యేతాః సప్తాంగం రాజ్య ముచ్యతే
ఆరభేతైవ కర్మాణి శ్రాంతః శ్రాంతః పునః పునః
కర్మా ణ్యారభమాణం హి పురుషం శ్రీ ర్నిషేవతే
కృతం త్రేతాయుగం చైవ ద్వాపరం కలిరేవ చ
రాజ్ఞో వృత్తాని సర్వాణి రాజా హి యుగ ముచ్యతే
కలిః ప్రసుప్తో భవతి స జాగ్రద్ద్వాపరం యుగమ్
కర్మ స్వభ్యుద్యత స్త్రేతా విచరం స్తు కృతం యుగమ్
వార్షికాం శ్చతురో మాసాన్ యథేంద్రోఽభిప్రవర్షతి
తథాభివర్షే త్స్వం రాష్ట్రం కామై రింద్రవ్రతం చరన్
అష్టౌ మాసాన్యథాఽఽదిత్య స్తోయం హరతి రశ్మిభిః
తథా హరేత్కరం రాష్ట్రాన్నిత్య మర్కవ్రతం హి తత్

రాజు, మంత్రి, నగరము, రాష్ట్రము, కోశము, దండము, మిత్రుడు అనునవి ఏడును రాజ్యాంగములు. రాజు అలసినప్పటికి కార్యారంభములు చేయుచునే యుండవలయును కార్యారంభములు చేయు రాజును లక్ష్మి సేవించును రాజు ప్రవర్తనయే కృత త్రేతా ద్వాపర కలియుగములుగ చెప్పబడినవి. రాజు నిద్రించిన కలియుగము, మేల్కొనిన ద్వాపరము. కర్మారంభము చేసిన త్రేత, జగమున సంచరించిన కృతయుగము అగును. అనగా రాజు ఎల్లప్పుడు శుభ కార్యారంభుడై యుండవలె ననుటయందే తాత్పర్యముగాని కృతయుగాదులు లేవనిమాత్రముకాదు. ఇంద్రుడు, సూర్యుడు, వాయువు, యముడు, వరుణుడు, చంద్రుడు, అగ్ని, భూమివలె రాజు ప్రవర్తించవలయును. వర్ష ఋతువునందు ఇంద్రుడు నాలుగు మాసములు వర్షించునటుల రాజు తన రాష్ట్రమునందలి ప్రజలకోరికలను తీర్చవలయును. సూర్యుడు ఎనిమిది మాసములు తన కిరణములచే నీటిని గ్రహించినటుల రాజు ప్రజలనుండి పన్నును గ్రహించవలయును.

ప్రవిశ్య సర్వభూతాని యథా చరతి మారుతః
తదాచారైః ప్రవేష్టవ్యం వ్రత మేతద్ధి మారుతమ్,
యథాయమః ప్రియద్వేష్యౌ ప్రాప్తే కాలే నియచ్ఛతి
తథా రాజ్ఞా నియంతవ్యాః ప్రజాస్తద్ధి యమవ్రతమ్,
వరుణేన యథా పాశైర్బద్ధ ఏవాభిదృశ్యతే
తథా పాపా న్నిగృహ్ణీయా ద్వ్రత మేతద్ధి వారుణమ్
పరిపూర్ణం యథా చంద్రం దృష్ట్వా హృష్యంతి మానవాః
తథా ప్రకృతయో యస్మి న్స చాంద్రవ్రతికో నృపః

వాయువు అందరి శరీరములను ప్రవేశించునటుల రాజు చారుల ద్వారా అందరియందు ప్రవేశించవలయును. యముడు తగిన కాలమున

ప్రియ ద్వేషములనువిడిచి ప్రవర్తించినటుల రాజును ప్రియద్వేషములు విడిచి వ్యవహరించవలయును. వరుణుడు పాశములతో బంధించినటుల రాజు పాపులను బంధించవలయును. మానవులు చంద్రుని చూచి సంత సించినటుల రాజునుచూచి సంతసించవలయును. అనగా చంద్రునివలె ప్రజలకు సంతోషము కల్గునట్లు ప్రవర్తించవలయును.

ప్రతాపయుక్త స్తేజస్వీ నిత్యం స్యాత్పాపకర్మసు
దుష్ట సామంత హింస్రశ్చ తదాగ్నేయవ్రతం స్మృతమ్
యథా సర్వాణి భూతాని ధరా ధారయతే సమమ్
తథా సర్వాణి భూతాని బిభ్రతః పార్థివం వ్రతమ్

రాజు ప్రతాపవంతుడై దుష్టులైన సామంతులు మొదలగువారిని అగ్నివలె దహించవలయును భూమి సమస్తమగు జీవరాసులను సమముగ ధరించినట్లు రాజుకూడ సమస్త ప్రజలను సమముగ ధరించవలయును.

ఇది తొమ్మిదవ యధ్యాయము.

*

# పదియవ యధ్యాయము

సర్వేషాం బ్రాహ్మణో విద్యా ద్వృత్త్యుపాయా న్యథావిధి
ప్రబ్రూయాదితరేభ్య శ్చ స్వయం చైవ తథాభవేత్
వైశాష్యా త్ప్రకృతిశ్రైష్ఠ్యా న్నియమస్య చ ధారణాత్
సంస్కారస్య విశేషాచ్చ వర్ణానాం బ్రాహ్మణో ప్రభుః
బ్రాహ్మణః క్షత్రియో వైశ్య స్త్రయో వర్ణా ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తి తు పంచమః
సర్వ వర్ణేషు తుల్యా సు పత్నీష్వక్షత యోనిషు
అనులోమ్యేన సంభూతా జాత్యా జ్ఞేయా స్త ఏవ తే

బ్రాహ్మణుడు శాస్త్రము ననుసరించి అన్నిజాతుల వారికి వృత్తి యుపాయములను చెప్పవలయును. తాను స్వయముగ నాచరించవలయును. విశిష్టమైన జన్మవలన సహజమైన శ్రేష్ఠతవలన నియమపరిపాలన వలన మంత్ర సంస్కారమువలన బ్రాహ్మణుడు తక్కిన వర్ణములవారికి ప్రభు వగుచున్నాడు. బ్రాహ్మణక్షత్రియవైశ్యులను మూడును ద్విజాతులు. నాలుగవది శూద్రజాతి. ఐదవజాతిలేదు. అన్ని వర్ణములవారు సములై యుండగ ఆ యా జాతుల స్త్రీలు పతివ్రతలై యుండగ అనులోమ విధానమున నితర జాతులన్నియు పుట్టినవి.

బ్రాహ్మణార్థే గవార్థే వా దేహత్యాగోఽనుపస్కృతః
స్త్రీబాలాభ్యుపపత్తౌ చ బాహ్యానాం సిద్ధి కారణమ్
అహింసా సత్యమస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః
ఏతం సామాసికం ధర్మం చాతుర్వర్ణేఽబ్రవీ న్మనుః
సుబీజం చైవ సుక్షేత్రే జాతం సంపద్యతే యదా
తదార్యాజ్జాత ఆర్యాయాం సర్వం సంస్కార మర్హతి

ప్రత్యుపకారబుద్ధి లేకయే బ్రాహ్మణ గో స్త్రీ బాల రక్షణార్థము ప్రాణ త్యాగముచేసిన నిమ్నజాతులవారును సిద్ధిని పొందుదురు. అహింస సత్యము, దొంగతనము చేయకపోవుట పరిశుద్ధత ఇంద్రియ నిగ్రహము అనునవి నాలుగు జాతులవారికి ఉచితమైన ధర్మములని మనువు చెప్పెను. మంచి విత్తనములు మంచి భూమియందు ఫలించినటుల ఉత్తమస్త్రీల యందు ఉత్తమ పురుష సంజాతులు సర్వ సంస్కారములకు అర్హులు.

అజీవం స్తు యధో క్తేన బ్రాహ్మణః స్వేన కర్మణా
జీవేత్ క్షత్రియ ధర్మేణ సహ్యస్య ప్రత్యనంతరః
ఉభాభ్యా మప్య జీవం స్తు కధం స్యాదితిచే ద్భవేత్
కృషి గోరక్ష మాస్థాయ జీవేద్వైశ్యస్య జీవికామ్
వైశ్యవృత్యాపి జీవంస్తు బ్రాహ్మణః క్షత్రియోఽపి వా
హింసప్రాయాం పరాధీనాం కృషిం యత్నేన వర్జయేత్
కృషిసాధ్వితి మన్యంతే సా వృత్తిః సద్విగర్హితా
భూమిం భూమిశయాం శ్చైవ హంతి కాష్ఠ మయోముఖమ్

బ్రాహ్మణుడు శాస్త్రవిహితమైన తన ధర్మవృత్తిచే జీవనము చేయలేనపుడు క్షత్రియవృత్తిచే జీవించవలయును. తనవృత్తి చేతను క్షత్రియ వృత్తిచేతను జీవించలేనపుడు వ్యవసాయము గోరక్షణము అను వైశ్య వృత్తిచే జీవించవలయును. బ్రాహ్మణ క్షత్రియులు పరాధీనమైన వైశ్యవృత్తిచే జీవించుచున్నను హింసానుకూలమైన వ్యవసాయమును విడువ వలయును వ్యవసాయము సద్వృత్తియని తలచినప్పటికి అది సత్పురుషులచే నిందించ బడినది ఇనుపములికి గలిగిన కాష్టము భూమిని భూమియందు శయనించిన జీవులను చంపును.

వరం స్వధర్మో విగుణో న పారక్యః స్వనుష్ఠితః
పరధర్మేణ జీవన్ని సద్యః పతతి జాతితః
జీవితాత్యయ మాపన్నో యోఽన్న మత్తియత స్తతః
ఆకాశమివ పంకేన న స పాపేన లిప్యతే
ప్రతిగ్రహో ద్యాజనా ద్వా తథై వాధ్యాసనా దపి
ప్రతిగహః ప్రత్యవరః ప్రేత్య విప్రస్య గర్హితః
జపహోమై రపైత్యేనో యాజమానాధ్యాపనైః కృతమ్
ప్రతిగ్రహనిమిత్తం తు త్యాగేన తపసైవ చ

విగుణమైనను స్వధర్మము శ్రేష్ఠమైనది. చక్కగ నాచరించినను పరధర్మము తగినదికాదు. పరధర్మముతో జీవించువాడు వెంటనేపతితు డగును. ప్రాణములకు ప్రమాదము సంభవించునపుడు ఎచ్చటనైనను ఏ యన్నమునైనను తినవచ్చును అట్టివాడు ఆకాశమును బురదయంటని విధమున పాపముచే నంటబడదు. హీనునకు చెప్పిన విద్యవలన. యాజనము వలన ధనము సంపాదించుటకంటె అయోగ్యునివలన దానము పట్టుట పరలోకమున నరకహేతువగును. యాజనమువలన అధ్యాపనము వలన వచ్చిన పాపము జప హోమములచే పోవును దానమువలన కలిగిన పాపము త్యాగముచేత, తపస్సుచేతను పోవును.

స ప్తవిత్తాగమా ధర్మ్యా దాయో లాభః క్రయో జయః
ప్రయోగః కర్మయోగ శ్చ సత్ప్రతిగ్రహ ఏవ చ
విద్యా శిల్పం భృతి స్సేవా గోరక్ష్యం విపణిః కృషిః
ధృతిర్భైక్ష్యం కుసీదం చ దశజీవన హేతవః
బ్రాహ్మణః క్షత్రియో వాపి వృద్ధిం నైవ ప్రయోజయేత్
కామం తు ఖలు ధర్మార్థం కుర్యా త్పాపీయసేఽల్పికామ్

ధన సంపాదనకు ధర్మ మార్గములు ఏడు. అందు వంశాగతమైన భాగము, నిధులవలన లాభము. అమ్మకము అనునవి నాలుగు వర్ణముల వారికి ధర్మములు, జయమువలన కలుగు ధనాగమము క్షత్రియునకు, వృద్ధివలన, కృషివాణిజ్యమువలన కలుగు ధనాగమము వైశ్యునకు సత్ప్రతిగ్రహము బ్రాహ్మణునకు. తగినవి. విద్య. శిల్పము, వైశ్య భావముతో వేతనము గ్రహించుట, సేవ, గోరక్షణ, వ్యాపారము, వ్యవసాయము, ధృతి, భిక్షాటనము, వడ్డి వ్యాపారము - అనునవిపదియు జీవన హేతువులు. వీటిని ఆపదకాలమునందు మాత్రమే అవలంబించ వలయును బ్రాహ్మణ క్షత్రియులకు వడ్డి వ్యాపారము తగదు అత్య వసరమైనపుడు ధర్మమును దృష్టియందు ఉంచుకొని తక్కువ వడ్డికి మాత్రమే ఈయవలయును.

> ధర్మే ప్సవ స్తు ధర్మజ్ఞాః సతాం వృత్త మనుష్ఠితాః
> మంత్రవర్జం న దుష్యంతి ప్రశంసాం ప్రాప్నువంతి చ
> యథా యథా హి సద్వృత్తమాతిష్ఠ త్యనసూయకః
> తథా తథేమం చాముం చ లోకం ప్రాప్నోత్యనిందితః

ధర్మాభిలాషులగు శూద్రులు సత్పురుషుల యాచారమును మంత్రరహితముగ నాచరించిన పాపులు గానేరరు. గొప్పతనము పొందుదురు. అసూయారహితులై సత్ప్రవర్తన కలిగి యుండిన ఈ లోక సుఖమును పరలోక సుఖమును పొందుదురు.

ఇది పదియవ యధ్యాయము.

*

# పదునొకండవ యధ్యాయము

సాంతానికం యక్ష్యమాణ మధ్వగం సర్వవేదనమ్
గుర్వర్థం పితృమాత్రర్థం చ స్వాధ్యాయార్థ్యుపతాపినః
నవైతాన్ స్నాతకాన్ విద్యాద్బ్రాహ్మణాన్ ధర్మభిక్షుకాన్
నిః స్వేభ్యో దేయ మేతేభ్యో దానం విద్యా విశేషతః

సంతానమే ప్రయోజనముగాగల వివాహము కోరినవాడు, సాంతానికుడు, యాగము చేయదలచినవాడు, బాటసారి, సర్వస్వమును దక్షిణ యిచ్చి విశ్వజిద్యాగము చేసినవాడు; గురువు నిమిత్తమై, తల్లి తండ్రి నిమిత్తమై యాచనచేయువాడు, బ్రహ్మచారి, రోగగ్రస్తుడు—ఈ తొమ్మిది మంది స్నాతక శబ్దముచే చెప్పబడుదురు. ధనహీనులైన వీరందరికి విద్యా విశేషము ననుసరించి దానము చేయవలయును.

ధనాని తు యథాశక్తి విప్రేషు ప్రతిపాదయేత్
వేదవిత్సు వివిక్తేషు ప్రేత్య స్వర్గం సమశ్నుతే
యస్య త్రైవార్షికం భక్తం పర్యాప్తం భృత్యవృత్తయే
అధికం వాపి విద్యేత స సోమం పాతు మర్హతి
శక్తః పరజనే దాతా స్వజనే దుఃఖజీవిని
మధ్వాపాతో విషాస్వాదః స ధర్మ ప్రతిరూపకః

వేదవేత్తలై కుటుంబీకులైయున్న బ్రాహ్మణులకు యథాశక్తి దానము చేయవలయును. అది స్వర్గలోకమును కలిగించును. మూడు సంవత్సరములవరకుగాని అధికముగాగాని సరిపోవునంతటి ధనముగల వాడు సోమయాగము చేయుట కర్హుడు. తనయింటిలోనివారు బాధపడుచుండగ దానముచేయుట పైన తేనెయు, లోపల విషముగల పాత్ర వంటిది. అనగా అది ఆడంబరధర్మమే గాని యథార్థమైనదిగాదు.

యోఽసాధుభ్యోఽర్థ మాదాయ సాధుభ్యః ప్రయచ్ఛతి
స కృత్వా ప్లవ మాత్మానం సంతారయతి తావుభౌ
యద్ధనం యజ్ఞశీలానాం దేవస్వం తద్విధు ర్బుధాః
అయజ్వానాం తు యద్విత్త మాసురస్వం తదుచ్యతే
తస్య భృత్యజనం జ్ఞాత్వా స్వకుటుంబాన్ మహీపతిః
శ్రుతశీలే చ విజ్ఞాయ వృత్తిం ధర్మ్యాం ప్రకల్పయేత్
కల్పయిత్వాఽస్య వృత్తిం చ రక్షే దేవం సమంతతః
రాజా హి ధర్మషడ్భాగం తస్మా త్ప్రాప్నోతి రక్షితాత్

అయోగ్యులనుండి అర్థము గ్రహించి యోగ్యుల కిచ్చినవాడు తనను పడవగాచేసి వారిద్దరిని తరింపచేసినవాడగును. యజ్ఞము చేయు వారి ధనము దైవ విత్తమనియు యజ్ఞముచేయనివారి ధనము ఆసురధన మనియు చెప్పబడును. రాజు వేదవేత్తను తన కుటుంబమువలె భావించి వారికి ధార్మికమైన వృత్తిని కల్పించవలయును. అట్టివారిని రక్షించుట వలన ధర్మమునందు ఆరవభాగము లభించును.

యజ్ఞార్థ మర్థం భిక్షిత్వా యో న సర్వం ప్రయచ్ఛతి
స యాతి భాసతాం విప్రః కాకతాం వా శతం సమాః
దేవస్వం బ్రాహ్మణస్వం వా లోభేనోపహిన స్తియః
స పాపాత్మా పరం లోకే గృధ్రోచ్ఛిష్టేన జీవతి
ఆపత్కల్పేన యో ధర్మం కురుతేఽనాపది ద్విజః
స నాప్నోతి ఫలం తస్య పరత్రేతి విచారయన్
విశ్వైశ్చ దేవైః సాధ్యైశ్చ బ్రాహ్మణైశ్చ మహర్షిభిః
ఆపత్సు మరణా ద్భీతై ర్విధేః ప్రతినిధిః కృతః

యజ్ఞనిమిత్తము సంపాదించిన ధనమంతయు దానముచేయనివాడు నూరు సంవత్సరములు కాకిగా జీవించును. దైవధనమును బ్రాహ్మణ ధనమును లోభముచే నపహరించినవాడు పరలోకమున గ్రద్ద తినగా మిగిలిన దానిని తిని బ్రతుకును. ఆపత్కాలమున చెప్పబడిన ధర్మమును ఆపదలేని సమయమున చేసిన వాడు దాని ఫలితమును పొందలేడు. విశ్వేదేవతలు, సాధ్యులు, మహర్షులగు బ్రాహ్మణులు. ఆపద సమయములందు ముఖ్యమైన సామాధివిధికి వైశ్వానర్యమును ప్రతినిధిగ చెప్పిరి.

క్షత్రియో బాహువీర్యేణ తరేదాపద మాత్మనః
ధనేన వైశ్యశూద్రౌ తు జపహోమైర్ద్విజోత్తమః
విధాతా శాసితా వక్తా మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే
తస్మై నాకుశలం బ్రూయాన్న శుష్కాం గిర మీరయేత్
పుణ్యాన్యన్యాని కుర్వీత శ్రద్దధానో జితేంద్రియః
నాత్యల్పదక్షిణై ర్యజ్ఞై ర్యజేతేహ కథంచన

ఇంద్రియాణి యశః స్వర్గమాయుః కీర్తిం ప్రజాః పశూన్
హన్త్యల్పదక్షిణో యజ్ఞస్తస్మా న్నాల్పధనో యజేత్
అన్నహీనో దహే ద్రాష్ట్రం మంత్రహీన స్తు ఋత్విజః
దీక్షితం దక్షిణాహీనో నాస్తి యజ్ఞ సమో రిపుః

తనకు వచ్చిన యాపదను క్షత్రియుడు బాహుబలముచేత వైశ్యశూద్రులు ధనముచేత, బ్రాహ్మణుడు జపహోమములచేత తొలగించుకొనవలయును. విహితకర్మానుష్ఠానము చేయువాడును, పుత్రశిష్యులను శాసించువాడును, ప్రాయశ్చిత్తాది ధర్మములను చెప్పువాడును అగు బ్రాహ్మణుని నిందించరాదు జితేంద్రియుడై శ్రద్ధతో ఎన్ని పుణ్యకర్మలనైనను చేయవచ్చును. కాని అల్పదక్షిణలతో యజ్ఞము చేయరాదు. అల్పదక్షిణలతో చేసిన యజ్ఞము ఇంద్రియములను, కీర్తిని, స్వర్గమును

ఆయువును, ప్రజలను, పశువులను నశింపచేయును. అందుచే నల్ప దక్షిణలనిచ్చి యజ్ఞము చేయరాదు. అన్నహీనముగ చేసిన యజ్ఞము రాష్ట్రమును, మంత్రహీనమైన యజ్ఞము ఋత్విక్కులను, దక్షిణాహీనమైన యజ్ఞము దీక్షితుని నశింపచేయును. యజ్ఞమువంటి శత్రువు మరి యొకటి లేదు

అకుర్వన్విహితం కర్మనిందితం చ స మాచరన్
ప్రసక్తశ్చేంద్రియార్థేషు ప్రాయశ్చిత్తీయతే నరః
అకామతః కృతే పాపే ప్రాయశ్చిత్తం విదుర్బుధాః
కామకారకృతే ప్యాహూ రేకే శ్రుతి నిదర్శనాత్
అకామతః కృతం పాపం వేదాభ్యాసేన శుధ్యతి
కామతస్తు కృతం మోహా త్ప్రాయశ్చిత్తైః పృథగ్విధైః
ప్రాయశ్చిత్తీయతాం ప్రాప్య దైవాత్పూర్వకృతేన వా
న సంసర్గం వ్రజే త్సద్భిః ప్రాయశ్చిత్తేఽకృతే ద్విజః
ప్రాయోనామ తపః ప్రోక్తం చిత్తం నిశ్చయ ఉచ్యతే
తపో నిశ్చయ సంయుక్తం ప్రాయశ్చిత్త మితిస్మృతః

విహితకర్మను చేయక అవిహితకర్మను చేయుటవలన మానవుడు ప్రాయశ్చిత్తమును చేసుకొనవలసినవాడగుచున్నాడు. అయిష్టముతో చేసిన అవిహిత కర్మకు బుధులు ప్రాయశ్చిత్తము చెప్పిరి. కాని కోరికతో చేసిన అవిహితకర్మకుగూడ వేదము ప్రాయశ్చిత్తముచెప్పుచున్నది. అయిష్టముతో చేసినపాపము ప్రాయశ్చిత్తముచేత నశించును. దైవకారణమునగాని పూర్వజన్మకృత పాపకారణమునగాని అయోగ్యమైన కర్మచేసిన ద్విజుడు ప్రాయశ్చిత్తము చేసుకొనక సత్సాంగత్యము పొందజాలడు. ప్రాయమనగా తపస్సు. చిత్తమనగా నిశ్చయబుద్ధి ఆ రెండింటితో గూడినది ప్రాయశ్చిత్తము.

ఇహ దుశ్చరితైః కేచిత్కేచిత్పూర్వ కృతై స్తథా
ప్రాప్నువంతి దురాత్మానో వరా రూపవిపర్యయమ్
చరితవ్య మతో నిత్యం ప్రాయశ్చిత్తం విశుద్ధయే
నింద్యైర్హిలక్షణై ర్యుక్తా జాయంతేఽనిష్కృతై నసః
బ్రహ్మహత్యా సురాపానం స్తేయం గుర్వంగనాగమః
మహాంతి పాతకాన్యాహుః సంసర్గశ్చాపితైస్సహ

కొందరు ఈ జన్మయందు చేసిన పాపములచేతను మరికొందరు పూర్వజన్మయందు చేసిన పాపములచేతను శారీరకవికారములను పొందు చున్నారు. అందువలన పరిశుద్ధతకొరకు నిత్యము ప్రాయశ్చిత్తము చేసుకొనవలసి యున్నది. పాపనివృత్తి చేసుకొననివారు నింద్య లక్షణ ములు కలిగియుందురు. బ్రహ్మహత్య, సురాపానము, దొంగతనము, గురుపత్నీ గమనము ; అట్టివారితో సంసర్గము మహాపాతకములుగ చెప్పబడినవి

బ్రహ్మహా ద్వాదససమాః కుటీం కృత్వా వనే వసేత్
భైక్ష్యాశ్యాత్మ విశుద్ధ్యర్థం కృత్వా శవశిరోధ్వజమ్
సురాం పీత్వా ద్విజోమోహా దగ్నివర్ణాం సురాం పిబేత్
తథా సకాయేనిర్ధగ్ధే ముచ్యతే కిల్బిషాత్తతః
సువర్ణస్తేయకృద్విప్రోరాజాన మభిగమ్యతు
స్వకర్మఖ్యాపయన్బ్రూయా న్మాంభవా ననుశాస్త్వితి
గృహీత్వా ముసలం రాజా సకృద్ధన్యాత్తు తం స్వయమ్
వధేన శుధ్యతి స్తేనో బ్రాహ్మణ స్తపసైవ వా
గురుస్త్రీగమనీయం తు వ్రతై రేభి రపానుదేత్
ఖట్వాంగి చీరవాసా వా శ్మశ్రులో విజనే వనే
ప్రాజాపత్యం చరే త్కృచ్ఛ్రమబ్దమేకం సమాహితః

బ్రహ్మహత్య చేసినవారు వనమునందు కుటీరము నిర్మించుకొని పండ్రెండు సంవత్సరములు భిక్షాటనముచేయుచుజీవించవలయును. తలపై శవాకారముగల ధ్వజము ధరించవలయును సురాపానముచేసిన ద్విజుడు అగ్నివర్ణముగల సురను త్రావి శరీరదాహము చేసుకొనిన ఆ పాపము నుండి విముక్తుడగును దొంగతనముచేసిన బ్రాహ్మణుడు రాజును సమీపించి తన పాపమును చెప్పి శిక్షించవలసినదిగ గోరవలయును. రాజు స్వయముగ రోకలి తీసుకొని ఆ బ్రాహ్మణుని ఒక్క దెబ్బచేతనే వధించవలయును. అటులకానిచో కోటిపర్యాయములు గాయత్రిని జపియించి శుద్ధిని పొందవలయును గురుపత్ని గమనముచేసిన వారు శట్వాము యొక్క చిహ్నమును ధరించి గడ్డమును పెంచి నిర్జనవనమునందు స్థిరచిత్తముతో ఒక సంవత్సరము ప్రాజాపత్యవ్రతము చేయవలయును.

యద్గర్హితేనార్జయంతి కర్మణా బ్రాహ్మణా ధనమ్
తస్యోత్సర్గేణ శుధ్యంతి జప్యేన తపసైవ చ

జపిత్వా త్రీణి సావిత్ర్యాః సహస్రాణి సమాహితః
మాసం గోష్ఠే పయః పీత్వా ముచ్యతేఽసత్ప్రతిగ్రహాత్

బ్రాహ్మణులు నింద్యకర్మచే సంపాదించిన ధనమును త్యాగము చేయుటచేత, జపముచేత తపస్సుచేత శుద్ధులగుచున్నారు. అయోగ్యుని వలన ధనమును గ్రహించుటచే కల్గిన పాపము పోవుటకు స్థిరచిత్తముతో మూడువేలు గాయత్రీ జపము చేయుటకాని ఒకమాసము గోశాలయందుండి గోక్షీరము త్రాగుటగాని చేయవలయును.

యైరభ్యుపాయైరేనాంసి మానవోప్యపకర్షతి
తానభ్యుపాయాన్వక్ష్యామి దేవర్షి పితృసేవితాన్

త్ర్యహం ప్రాత స్త్ర్యహం సాయం త్ర్యహమద్యా దయాచితం
త్ర్యహం పరం చ నాశ్నీయా త్ప్రాజాపత్యం చరన్ ద్విజః
గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్
ఏకరాత్రోపవాస శ్చ కృచ్ఛ్రం సాంతాపనం స్మృతమ్
ఏకైకం * గ్రాస మశ్నీయాత్ త్ర్యహాణి త్రీణి పూర్వవత్
త్ర్యహం చోపవసే ద్దస్త్య మతికృచ్ఛ్రం చరన్ ద్విజః

దేవతలను ఋషులను పితరులను సేవించునట్టి మీకు మానవుల పాపములను పోగొట్టునటువంటి ఉపాయములను చెప్పగలను. ప్రాజాపత్య వ్రతము చేయునట్టి ద్విజుడు మూడురోజులు ఉదయకాలమున, మూడురోజులు సాయంకాలమున, మూడు రోజులు అయాచితమైన దానిని భుజించ వలయును. పిమ్మట మూడురోజులు ఏమియు భుజించ రాదు. గోమూత్రము, గోమయము, గోక్షీరము, గోదధి, గోసర్పి, కుశోదకము కలిపి భుజించవలయును. రెండవరోజున ఉపవాసము చేయవలయును. దీనిని కృచ్ఛ్రసాంతపన వ్రతమందురు. అతికృచ్ఛ్ర వ్రతము చేయు ద్విజుడు ఉదయ సాయంకాలసమయములందు అయాచితముగ వచ్చినదానిని ఒక్కొక్క గ్రాసముచొప్పున మూడు దినములు భుజించవలయును. పిమ్మట మూడు దినము లుపవసింపవలయును.

కుక్కుటాండ ప్రమాణం చ యావాంశ్చ ప్రవిశేన్ముఖమ్
ఏకం గ్రాసం విజానీయాచ్ఛుద్ధ్యర్థం గ్రాసశోధనమ్
త ప్త కృచ్ఛ్రం చర న్విప్రో జలక్షీరఘృతానిలాన్
ప్రతి త్ర్యహం పిబేదుష్ణాన్ సకృత్ స్నాయీ సమాహితః

* గ్రాసమనగా కోడిగ్రుడ్డునంతటి ప్రమాణము గలది.

యతాత్మనోఽప్రమత్తస్య ద్వాదశాహ మభోజనమ్
పరాకోనామ కృచ్ఛ్రోఽయం సర్వపాపాపనోదనః
ఏకైకం హ్రాసయేత్పిండం కృష్ణే శుక్లేచ వర్ధయేత్
ఉపస్పృశం త్రిషవణ మేత చ్చాంద్రాయణం స్మృతమ్
ఏత మేవ విధిం కృత్స్న మాచరేద్యవమధ్యమే
శుక్ల పక్షాది నియతశ్చరం శ్చాంద్రాయణ వ్రతమ్

సప్త కృచ్ఛ్రవ్రతముచేయు ద్విజుడు సమాహితచిత్తుడై మూడు దినములు వేడినీరు, మూడుదినములు వేడిపాలు, మూడుదినములు వేడి నేయి, మూడుదినములు వేడిగాలి తినుచు దినమున నొక పర్యాయము స్నానము చేయుచుండవలయును. పండ్రెండు దినములు భోజనముచేయక సమాహితచిత్తుడై చేయు వ్రతమునకు పరాకమని పేరు. ఇది అన్ని పాపములను పోగొట్టును కృష్ణపక్షమున ఒక్కొక్క గ్రాసముతగ్గించుచు శుక్లపక్షమున వృద్ధిచేయుచు ప్రతిదినము మూడుపర్యాయములు స్నానము చేయుచు చేయువ్రతమునకు చాంద్రాయణవ్రతమని పేరు. పూర్ణిమ యందు పదునైదుగ్రాసములు తిని కృష్ణపాడ్యమినుండి ఒక్కొక్కటి తగ్గించుచు తినవలయును. అమావాస్యయందు ఉపవాసముచేసి శుక్ల ప్రతిపత్తునుండి ఒక్కొక్క గ్రాసము వృద్ధిచేయవలయును. యవమధ్య యను చాంద్రాయణమునందు శుక్లపక్షమునుండి ఒక్కొక్క గ్రాసము వృద్ధిచేయుచు పూర్ణిమయందు పదునైదు గ్రాసములు కృష్ణప్రతిపత్తునుండి ఒక్కొక్కటి తగ్గించి అమావాస్యయందు ఉపవసించవలయును.

అష్టావష్టౌ సమశ్నీయా త్పిండా న్మధ్యందినే స్థితే
నియతాత్మా హవిష్యాశీ యతి చాంద్రాయణం చరన్
చతురః ప్రాతరశ్నీయా త్పిండా న్విప్రః సమాహితః
చతు ర స్తమితే సూర్యే శిశుచాంద్రాయణం స్మృతమ్

యధాకథంచి త్పిండానాం తిస్రోఽశీతీః సమాహితః
మాసేనాశ్నన్ హవిష్యస్య చంద్రస్యైతి సలోకతామ్

యతి చాంద్రాయణవ్రతముచేయుద్విజుడు మధ్యాహ్నసమయము నందు ఎనిమిదిగ్రాసములే భుజించవలయును. దానిని శుక్లపక్ష ప్రారంభమునుండి గాని కృష్ణపక్ష ప్రారంభమునుండిగాని చేయవచ్చును. శిశు చాంద్రాయణము చేయు ద్విజుడు ఉదయము నాలుగు గ్రాసములు, సాయంకాలము నాలుగు గ్రాసములు భుజించవలయును ఎటులయినను మాసము మొత్తముమీద రెండువందల నలుబది గ్రాసములు మాత్రము తిని చాంద్రాయణ వ్రతము చేయు ద్విజుడు చంద్రలోకమునుపొందును.

సావిత్రీం చ జపే న్నిత్యం పవిత్రాణి చ శక్తితః
సర్వేష్వేవ వ్రతేష్వేవం ప్రాయశ్చిత్తార్థ మాదృతః
ఏతైర్ద్విజాతయః శోధ్యావ్రతై రావిష్కృతైనసః
అనావిష్కృత పాపాం స్తు మంత్రైర్హోమైశ్చ శోధయేత్
ఖ్యాపనేనానుతాపేన తపసాధ్యయనేన చ
పాపకృన్ముచ్యతే పాపాత్తథా దానేన చా పది

చాంద్రాయణాది వ్రతములు చేయునపుడు గాయత్రీ జపము చేయవలయును. అటులనే అఘమర్షణాది మంత్రములు జపించవలయును బహిర్గతమైన పాపములు పోవుటకు ఈ ప్రాయశ్చిత్తములు చేయ వలయును. బహిర్గతములుగాని పాపముల పరిహారార్థము మంత్రహోమ ములు చేయవలయును. తన పాపమును చెప్పుకొటనుటచేత, మానసిక తాపముచేత, తపస్సుచేత, వేదాధ్యయనముచేత పాపము పోవును. ఆప త్కాలమున దానము చేయుటచేత పాపము పోవును.

కృత్వా పాపం హి సంతప్య తస్మాత్పాపా త్ప్రముచ్యతే
నైవం కుర్యాం పునరితి నివృత్యా పూయతే స్తు సః
అజ్ఞానాద్యది వా జ్ఞానాత్కృత్వా కర్మ విగర్హితమ్
తస్మాద్విముక్తమన్విచ్ఛన్ద్వితీయం న సమాచరేత్

చేసినపాపమును గురించి సంతాపమును పొందుటచే పాపము పోవును. మరల చేయనని నిశ్చయించు కొనుటచేత పాపియగువాడు పవిత్రు డగును. తెలిసియు తెలియకయుచేసిన పాపమునుండి విముక్తి పొందదలచినవాడు తిరిగి ఆ పాపమును చేయరాదు.

ఋషయః సంయతాత్మానః ఫలమూలానిలాశనాః
తపసైవ ప్రపశ్యంతి త్రైలోక్యం సచరాచరమ్
యద్దుస్తరం యద్దురాపం యద్దుర్గం యచ్చ దుష్కరం
సర్వం తత్తపసా సాధ్యం తపోహి దురతిక్రమమ్
మహాపాతకినశ్చైవ శేషాశ్చాకార్యకారిణః
తపసైవ సుతప్తేన ముచ్యంతే కిల్బిషాత్తతః
తపసైవ విశుద్ధస్య బ్రాహ్మణస్య దివౌకసః
ఇజ్యాశ్చ ప్రతిగృహ్ణంతి కామాన్ సంవర్ధయంతి చ

మహర్షులు నియమిత మనస్సుగలవారై ఫలమూలముల తినుచు తపస్సు చేసి చరాచరములైన మూడులోకములను చూస్తున్నారు. తరింపరానిది, పొందరానిది, దాటరానిది, చేయశక్యముగానిదికూడ తపస్సుచే సాధ్యమగును. తపస్సును అతిక్రమించుట సాధ్యముగాదు తపస్సుచే పవిత్రులైన ద్విజుల హవిస్సులను దేవతలు గ్రహించి వారి కోరికలు తీర్చుచున్నారు.

బ్రహ్మచర్యం తపోహోమః కాలే శుద్ధాల్పభోజనమ్
అరాగద్వేషలోభశ్చ తప ఉక్తం స్వయంభువా
సవ్యాహృతి ప్రణవకాః ప్రాణాయామాస్తు షోడశ
అపిభ్రూణహణం పాపాత్పునంత్యహరహం కృతాః
కౌత్సం జప్త్వా స ఇత్యేత్వా సిష్ఠం చ ప్రతీత్యృచమ్
మాహిత్రం శుద్ధవత్యశ్చ సురాపోఽపి విశుధ్యతి
సకృజ్జత్వాస్య వామీయం శివసంకల్ప మేవ చ
అపహృత్య సువర్ణంతు క్షణాద్భవతి నిర్మలః
హవిష్యాంతీయ మభ్యస్య న తమం హ ఇతీత చ
జపిత్వా పౌరుషం సూక్తం ముచ్యతే గురుతల్పగః
ఏనసాం స్థూలసూక్ష్మాణాం చికీర్షన్నపనోదనమ్
అవేత్యృచం జపేదబ్ధం యత్కించేదమితీతి వా

బ్రహ్మచర్యము, జపము, హోమము, తగినసమయమున పవిత్రమైన అల్పభోజనము, రాగద్వేషలోభములులేకపోవుట, తపమని బ్రహ్మ చెప్పెను. వ్యాహృతులతోగూడిన గాయత్రి మంత్రముతో దినమునకు పదియారు పర్యాయములు ప్రాణాయామము చొప్పున మాసముచేసిన భ్రూణహత్య, బ్రహ్మహత్య చేసినవాడుగూడ పవిత్రుడగును.

కౌత్స మహర్షి చే దృష్టమైన -

"అప నః శోశుచదఘం" ఋ. సం. (1-7-5) అను మంత్రము వసిష్ఠునిచే దృష్టమైన -

"ప్రతి స్తోమేభిరుషసం వసిష్ఠాః" (ఋ సం. 5-5-27 అనుమంత్రము

"మహిత్రీణామవోస్తు" (ఋ. సం. 8—8—43) అనుసూక్తము

"ఏతోన్విం ద్రం స్తవామ శుద్ధం" (ఋ.సం. 6-8-31) అనుమూడు ఋక్కులు.మాసముపాటు రాత్రింబవళ్ళు జపించిన సురాపానము చేసిన వాడు పవిత్రుడగును.

"అస్యవామస్య పలితస్య" ఋ.సం (2-3-14) అనుసూక్తమును శివ సంకల్పమును,

"యజ్జాగ్రతో దూరమ్" (వాజ. సం. 34—1) అను వాజసనేయమును రోజున కొకపర్యాయము చొప్పున ఒక మాసము జపించిన బంగారము దొంగిలించినవాడు పవిత్రుడగును.

"హవిష్పాంతమజరం స్వర్విది" (ఋ. సం. 8-4-10)
అను పందొమ్మిది ఋక్కులు :

"న తమం హో న దురితమ్" (ఋ. సం. 2—6—29)
అను ఎనిమిది ఋక్కులు ;

శివ సంకల్పము ;

"సహస్రశీర్షా పురుషః" (ఋ. సం 8—4—17)
అను పదియారు ఋక్కులు :

ప్రతిరోజు పదిపర్యాయముల చొప్పున ఒక మాసము జపించిన గురుభార్యను పొందినవాడు పవిత్రుడగును.

"అవ తే హేళో వరుణ నమోభిః" (ఋ. సం 1-2-15)
"యత్కించేదం వరుణదైవ్యేజనే" (ఋ. సం. 5-6-11)

"ఇతి వా ఇతి మే మనః" (ఋ. సం. 8-6-26) అను ఋక్కులను రోజున కొకసారి చొప్పున ఒక సంవత్సరము జపించిన ఉప పాతకులు మహాపాతకులు కూడ పవిత్రులగుదురు.

యథాశ్వమేధః క్రతురాట్ సర్వపాపాపనోదనః
తథాఽఘమర్షణం సూక్తం సర్వపాపాపనోదనమ్
ఋచో యజూంషి చాన్యాని సామాని వివిధాని చ
ఏష జ్ఞేయస్త్రివృద్వేదో యోవేదైనం స వేదవిత్

సమస్త క్రతువులకు చక్రవర్తియైన అశ్వమేధయాగము సర్వ పాపములను పోగొట్టునటుల అఘమర్షణ సూక్తము సర్వపాపములను పోగొట్టును. ఋగ్వేద, యజుర్వేద, సామవేద మంత్రము లన్నియు మూడు వేదములని చెప్పబడును. వానిని తెలిసినవాడు వేదవేత్త యగును.

ఇది పదునొకండవ యధ్యాయము.

*

# పంద్రెండవ యధ్యాయము

శుభాశుభఫలం కర్మ మనోవాగ్దేహ సంభవమ్
కర్మజా గతయో నౄణా ముత్తమాధమ మధ్యమాః

పరద్రవ్యేష్వ భిధ్యానం మనసానిష్టచింతనమ్
వితథాభినివేశ శ్చ త్రివిధం కర్మ మానసమ్

పారుష్య మనృతం చైవ పైశున్యం చాపి సర్వశః
అసంబద్ధ ప్రలాప శ్చ వాఙ్మయం స్యా చ్చతుర్విధమ్

అదత్తానా ముపాదానం హింసా చైవావిధానతః
పరదారోపసేవా చ శారీరం త్రివిధం స్మృతమ్

మానసం మనసైవాయ ముపభుంక్తే శుభాశుభమ్
వాచా వాచా కృతం కర్మ కాయేనైవ చ కాయికమ్

మనస్సుచేతను, వాక్కుచేతను, శరీరముచేతను చేయబడినకర్మలు శుభాశుభములని రెండు విధములు. ఈ కర్మలవలన మానవులకు ఉత్తమ అధమ, మధ్యమ గతులు గల్గును. పరద్రవ్యములపై నాశ, అవిహితమైన దానిని గురించిన యాలోచన, ప్రయోజన శూన్యమైన కార్యములపై నాసక్తి మానసకర్మ యగును. మాటలయందు కాఠిన్యము, అసత్య భాషణము. పరనింద, వ్యర్థ సంభాషణ అనునవి నాలుగువిధములయిన, వాగ్దోషములు. ఇవ్వనిదానిని గ్రహించుట, శాస్త్రవిహితముగాని హింస పరదారల స్నేహము అనునవి శారీరక దోషములు. మనస్సుచేతచేసిన కర్మఫలములను మనస్సుచేతను, వాక్కుచే చేసినదానిని వాక్కుచేతను శరీరముచేత చేసినదానిని శరీరముచేతను అనుభవించవలయును.

శరీరజైః కర్మదోషై ర్యాతి స్థావరతాం నరః
వాచికైః పక్షిమృగతాం మానసై రంత్య జాతితామ్
పంచభ్య ఏవ భూతేభ్యః ప్రేత్య దుష్కృతినాం నృణామ్
శరీరం యాతనార్థీయ మన్య దుత్పద్యతే ధ్రువమ్
తేనానుభూయ తా యామీః శరీరేణేహ యాతనామ్
తాస్వేవ భూతమాత్రాసు ప్రలీయంతే విభాగశః

మానవుడు శరీరముచేత చేసినదోషముల వలన స్థావరత్వమును వాగ్దోషములవలన పక్షి మృగ శరీరములను, మానసదోషముల వలన హీన జాతిని పొందుచున్నారు. దుష్కర్మలు చేసిన మానవుల యాతనా శరీరములు పంచభూతములనుండియే పుట్టుచున్నవి. యమలోకసంబంధమైన యాతనలు అనుభవించిన పిమ్మట ఆ శరీరములు పంచభూతముల యందు లీనమగు చున్నవి.

యద్యాచరతి ధర్మం చ ప్రాయశోఽధర్మ మల్పశః
తై రేవ చావృతో భూతైః స్వర్గే సుఖ ముపశ్నుతే
యది ప్రాయశోఽధర్మం సేవతే ధర్మ మల్పశః
తై ర్భూతైస్స పరిత్యక్తో యామీః ప్రాప్నోతి యాతనాః

అధికమైన ధర్మమును అల్పమైన అధర్మమును చేసినవానికి పంచభూతములనుంకి పుట్టిన శరీరములభించును అధికమైన పాపము అల్పమైన ధర్మము చేసినవానికి పూర్వపు శరీరము విడువబడి, పంచ భూతములనుండియే పుట్టిన యాతనాశరీరము లభించును. దానిచేతనే యమలోకమునందలి దుఃఖముల ననుభవించును. అనగా రెండురకము లైన శరీరములు పంచభూతములనుండి పుట్టినవేయైనను ఒకటి సుఖాను భూతికి అనుకూలము, మరియొకటి దుఃఖానుభూతికి అనుకూలము.

వేదాభ్యాస స్తపోజ్ఞానం శౌచ మింద్రియ నిగ్రహః
ధర్మ క్రియాత్మచింతా చ సాత్త్వికం గుణలక్షణమ్
ఆరంభరుచితాఽధైర్య మసత్కార్య పరిగ్రహః
విషయోపసేవాచాజస్రం రాజసం గుణలక్షణమ్
లోభః స్వప్నోఽధృతిః క్రౌర్యం నాస్తిక్యం భిన్న వృత్తితా
యాచిష్ణుతా ప్రమాదశ్చ తామసం గుణలక్షణమ్
యత్కర్మ కృత్వా కుర్వంశ్చ కరిష్యంశ్చైవ లజ్జతి
తద్జ్ఞేయం విదుషా సర్వం తామసం గుణలక్షణం
యేనాస్మిన్కర్మణా లోకే ఖ్యాతి మిచ్ఛతి పుష్కలామ్
న చ శోచత్యసంపత్తౌ తద్విజ్ఞేయం తు రాజసమ్
యత్సర్వే ణేచ్ఛతి జ్ఞాతుం యన్నలజ్జతి చాచరన్
యేన తుష్యతి చాత్మాస్య తత్సత్త్వగుణలక్షణమ్

వేదముల నభ్యసించుట, తపస్సు, జ్ఞానము, శౌచము, ఇంద్రియ నిగ్రహము, ధర్మాచరణము, ఆత్మవిచారము, సాత్త్వికగుణలక్షణములు. కార్యారంభమున ప్రీతి, అధైర్యము, అయోగ్యకార్యాచరణము ఎల్లప్పుడు విషయభోగానుభవము రాజసగుణ లక్షణములు. లోభము, నిద్ర, అధైర్యము, క్రౌర్యము, నాస్తిక్యబుద్ధి, భిన్నవ్యాపారములు. యాచన, తొందరపాటు తామసగుణలక్షణములు. పనిచేసినపిమ్మట, చేయుసమయమున, చేయబోవునపుడు సిగ్గును కలిగించునది తామసకర్మ. పుష్కలమైన ప్రసిద్ధిని కల్గించునది. సంపదలేనిసమయమున దుఃఖమును కల్గించనిది రాజసకర్మ. సంపూర్ణముగ తెలిసికొనవలయునను ఇచ్ఛను కల్గించునది, ఆచరణ సమయమున సిగ్గును కలిగించనిది, మనస్సునకు తృప్తిని కలిగించునది సాత్త్విక కర్మ.

దేవత్వం సాత్వికా యాంతి మనుష్యత్వం చ రాజసాః
తిర్యక్త్వం తామసా నిత్య మిత్యేషా త్రివిధా గతిః
తాపసా యతయో విప్రా యే చ వైమానికా గణాః
నక్షత్రాణి చ దైత్యా శ్చ ప్రథమా సాత్త్వికా గతిః
యజ్వాన ఋషయో దేవా వేదా జ్యోతీంషి వత్సరాః
పితరశ్చైవ సాధ్యా శ్చ ద్వితీయా సాత్త్వికాగతిః
బ్రహ్మా విశ్వసృజో ధర్మో మహానవ్యక్త మేవచ
ఉత్తమాం సాత్త్వికీ మేతాం గతి మాహు ర్మనీషిణః

సాత్త్వికులు దైవత్వమును, రాజసులు మానవత్వమును, తామసులు పశుపక్ష్యాది జన్మలను పొందుచున్నారు. సాత్త్వికస్వభావులు ప్రథమ, ద్వితీయ, తృతీయ కక్ష్యలకు చెందినవారు అని మూడురకములుగ నుందురు. ప్రథమ గతికి చెందినవారు తాపసులు, యతులు, విప్రులు, వైమానికులు, నక్షత్రములు, దైత్యులుగ పుట్టుదురు. మధ్యమ గతికి చెందినవారు యాగశీలురు. ఋషులు, దేవతలు, ధ్రువాది నక్షత్రములు ఆకారముగల సంవత్సరములు, సోమపాది పితరులు, సాధ్యులుగ జన్మింతురు. ఉత్తమగతికి చెందినవారు సృష్టికర్తయగు బ్రహ్మగ, మరీచ్యాది మహర్షులుగ ధర్మస్వరూపులుగ, మహత్తులుగ నవ్యక్తముగ జన్మింతురు.

యాదృశేన తు భావేన యద్యత్కర్మ నిషేవతే
తాదృశేన శరీరేణ తత్తత్ఫల ముపాశ్నుతే
వేదాభ్యాస స్తపో జ్ఞాన మింద్రియాణాం చ సంయమః
అహింసా గురుసేవా చ నిఃశ్రేయకం వరమ్

వైదికే కర్మయోగే తు సర్వాణ్యేతాన్యశేషతః
అంతర్భవంతి క్రమశ స్తస్మిం స్తస్మిన్ క్రియావిధౌ
సుఖాభ్యుదయికం చైవ నైఃశ్రేయసిక మేవ చ
ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మవైదికమ్

మానవుడు ఎట్టిభావముతో ఏ కర్మచేయునో అట్టిభావమునకు తగిన శరీరముతో ఆ కర్మఫలము అనుభవించును. అనగా సాత్త్వికభావముతో కర్మచేసిన సాత్త్వికభావమునకు తగిన శరీరముతో ఆ కర్మఫలము అనుభవించును. అటులనే రాజసభావమునకు తగిన శరీరముతో, తామస భావమును తగిన శరీరముతో కర్మఫలము ననుభవించును. వేదముల నభ్యసించుట, తపస్సు, ఆత్మజ్ఞానము, ఇంద్రియనిగ్రహము, అహింస, గురుసేవ, మోక్షము కల్గించును. వైదిక కర్మలయందు ఐహికాముష్మిక ఫలములనిచ్చు కర్మలన్నియు అంతర్లీన మగుచున్నవి. సుఖమును కలిగించునదియు, మోక్షమును కలిగించునదియు అగు వైదికకర్మ ప్రవృత్తమనియు, నివృత్తమనియు రెండు విధములు.

ఇహచాముత్రవా కామ్యం ప్రవృత్తం కర్మ కీర్త్యతే
నిష్కామం జ్ఞానపూర్వం తు నివృత్త ముపదిశ్యతే
ప్రవృత్తం కర్మ సంసేవ్య దేవానా మేతి సామ్యతామ్
నివృత్తం సేవమానస్తు భూతాన్యత్యేతి పంచవై
సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని
సమం పశ్యన్నాత్మయాజీ స్వారాజ్య మధిగచ్ఛతి

యథోక్తాన్యపి కర్మాణి పరిహాయ ద్విజోత్తమః
ఆత్మజ్ఞానే శమే చ స్యాద్వేదాభ్యాసే చ యత్నవాన్
ఏతద్ధి జన్మ సాఫల్యం బ్రాహ్మణస్య విశేషతః
ప్రాప్యైతత్కృతకృత్యో హి ద్విజో భవతి నాన్యథా

ఇహపరములను కోరిచేయు కర్మకు ప్రవృత్తమని పేరు. కోరికలను విడిచి జ్ఞాన ప్రాప్తికై చేయుకర్మకు నివృత్తమని పేరు. ప్రవృత్తమైన కర్మను చేసినవాడు దైవత్వమును పొందును. నివృత్తమైన కర్మను చేసినవాడు పంచభూతముల నతిక్రమించగలుగుచున్నాడు సర్వభూతములయందు తనను, తనయందు సర్వభూతములను సమముగ చూడగల్గినవాడు బ్రహ్మ స్వరూపమును పొందుచున్నాడు. ద్విజుడు స్వకర్మలను విడిచియైనను ఆత్మజ్ఞానమునందు ఇంద్రియజయమునందు వేదాభ్యాసమునందు ప్రయత్నపరుడు కావలయును. ఇదియే ద్విజునకు జన్మ సాఫల్యము కలిగించును. అందును ప్రత్యేకముగ బ్రాహ్మణునకు తగినది. దీనివలననే బ్రాహ్మణుడు కృతకృత్యుడగును. మరియొక విధముగ గానేరడు

పితృదేవమనుష్యాణాం వేద శ్చక్షుః సనాతనమ్
అశక్యం చాప్రమేయం చ వేదశాస్త్ర మితి స్థితిః
చాతుర్వర్ణ్యం త్రయోలోకా శ్చత్వార శ్చాశ్రమాః పృథక్
భూతం భవ్యం భవిష్యం చ సర్వం వేదా త్ప్రసిధ్యతి
సేనాపత్యం చ రాజ్యం చ దండనేతృత్వ మేవ చ
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్ర విదర్హతి

పితరులకు, దేవతలకు, మనుష్యులకు, వేదమే సనాతనమైన నేౘ్రత్రము, వేదము అశక్యము, అౘ్రప్రమేయము, అయియున్నది. వేదము వలననే చాతుర్వర్ణ్యములు, మూడు లోకములు, నాలుగాౘ్రశ్రమములు, భూతభవిష్యద్వర్తమానములు సిద్ధించుచున్నవి. వేదశాస్త్ర వేత్తయే సేనాధిపత్యమునకు, రాజ్యపాలనకు, దండనాధికారమునకు, సర్వలోకాధిపత్యమునకు తగియున్నాడు.

వేదశాస్త్రార్థ తత్త్వజ్ఞో యత్ర తత్రాశ్రమే వసన్
ఇహైవ లోకే తిష్ఠన్ స బ్రహ్మభూయాయ కల్పతే

తపో విద్యా చ విప్రస్య నిఃశ్రేయసకరం పరమ్
తపసాకిల్బిషంహంతి విద్యయాఽమృత మశ్నుతే

ఏకోఽపి వేదవిద్ధర్మం యం వ్యవస్యే ద్ద్విజోత్తమః
స విజ్ఞేయః పరో ధర్మో నాజ్ఞానా ముదితోఽయుతైః

వేదశాస్త్రార్థతత్వజ్ఞుడు ఏయాశ్రమమందున్నను ఈ లోకమునందే బ్రహ్మస్వరూపుడగుచున్నాడు. తపస్సును, విద్యయు, బ్రాహ్మణునకు మోక్షమును కలిగించును. తపస్సుచే పాపము నశించును. విద్యచే మోక్షము కల్గును. వేదవేత్తయైనవాడు ఒక్కడు చెప్పినదే ధర్మముగాని పదివేలమంది అజ్ఞానులు చెప్పినది ధర్మముగాదు.

ఏవం య స్సర్వభూతేషు పశ్యత్యాత్మాన మాత్మనా
స సర్వ సమతా మేత్య బ్రహ్మాభ్యేతి పరంపదమ్
ఇత్యేత న్మానవం శాస్త్రం భృగుప్రోక్తం పఠన్ ద్విజః
భవత్యాచారవా న్నిత్యం యధేష్టాం ప్రాప్నుయాద్గతిం
యే పఠంతి ద్విజాః కేచిత్సర్వపాపోపశాంతిదమ్
తే గచ్ఛంతి పరం స్థానం బ్రహ్మణః సద్మశాశ్వతమ్

సర్వ భూతములయందు తన స్వరూపము చూచినవాడు సర్వ సమభావమును పొంది పరబ్రహ్మస్థానము పొందుచున్నాడు. భృగు మహర్షి ప్రోక్తమైన ఈ శాస్త్రము చదివిన ద్విజుడు ఆచారవంతుడై తాను కోరిన లోకములను పొందును సర్వపాపపరిహారము కలిగించు నీ శాస్త్రము చదివిన ద్విజులు బ్రహ్మముయొక్క శాశ్వతస్థానము పొందుచున్నారు.

ఇది పండ్రెండవ యధ్యాయము.

పరమేశ్వరార్పణమస్తు

